


సంపుటము 23 | ఆగస్టు, 1946 | సంచిక 8

వ్యయ శ్రావణము

# ఎవరి కెఱుక?



— శ్రీ కె. అన్నమరాజ శర్మ —



౧

ప్రత్యూషస్సుల ప్రసవసౌభాగ్యవతుల
పుక్కిళుల గంధ మొలికించి, ముద్దుగొనెడు
మలయపవనుండు కీచకమార్గమందు
ఎవని యశ మగ్గడించునో యెవరి కెఱుక?

౨

అంబరవితానికా పటాభ్యంతరమున
వ్రేలు నవకవు రసగుండ్ల లీల దోప,
తరళ నక్షత్రికాంత లేతరుణు గూర్చి
హ్రీకటాక్షాళి బరచునో యెవరి కెఱుక?

౩

చైత్రునకు ఫుల్లసహకార శాఖనుండి
స్వాగతం బీయ పంచమ స్వరవిభూతి
కోకిలస్వామి శ్రుతినించు కూజితముల
నే రసార్ద్రిత విరిసెనో యెవరి కెఱుక?

౪

చంద్రికాస్నాతపూతమై సరసితటుల
మొలకనవ్వుల విరజిమ్మ, మురువుసూవు
గంధవతి సుందరీమణి కలువకన్నె
ఎవనికై ప్రతీక్షించునో యెవరి కెఱుక?

౫

అణువుగర్భాన బ్రహ్మాండ మైక్యపరచు
సూత్రమే యన్నిపుటల బ్రస్ఫుటముగాగ,
హృదయసౌందర్య మర్పించి, సృష్టికావ్య
మే కవీశుడు వ్రాసెనో యెవరి కెఱుక?

౬

తళతళత్కాంతి దిశలు నేత్రముల విప్ప,
నృత్యమొనరించు సౌదామినీలతాంగి
కాంగికన్యాస విన్యాస భంగిమముల
నే కళాకృతి నేర్పెనో యెవరి కెఱుక?



# ఆంధ్రమనఁగానేమి? ఆంధ్రులెవరు?

## ఆంధ్రవీరుల చరిత్ర



= శ్రీ బి. సీతారామయ్య =

ఆంధ్రము అను మాటయుఁ, తెనుఁగు అను మాటయును దేశ్యపదము లని నాయూహ. ౧౯౧౫-వ సం.లో 'తెనుఁగు-తెలుఁగు'అను శీర్షికతో నేనొక వ్యాసము వ్రాసి ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటించితిని. 'తెన్'యొక్క రూపాంతరమే 'తెలుఁగు'. దానిని 'తెర్కు' అనికూడ అందురు. 'తెన్నాడు, తెన్నూరు, తెన్నేరు, తెన్నండ, తెన్కణము, తెన్గాళి, తెన్గళ్' ఇత్యాదులలోని 'తెన్' దక్షిణార్థమును దెలుపును. త్రిలింగము, త్రినగము అను పదములకు తద్భవములు కావు. నకార - లకార- రేఫములు మార్పులొందుచుండును.

ఈ తెనుఁగుభాషను మాటలాడువారు బహుదేశములయం దున్నారు. వింధ్యపర్వతపంక్తికి దక్షిణమే దక్షిణాపథము. మధ్యపరగణాలలోను, దక్షిణాపథమునందు నెల్లయెడలను తెలుఁగువా రున్నారు. తెనుఁగుభాషను మాటలాడువారు తెనుఁగువారు; తెనుఁగువారు, తెనుఁగుభాష, తెనుఁగుదేశము—వీనిలోన్ని 'తెనుఁగు'నకు దక్షిణమనియే యర్థము. కొంతకాలము క్రిందటివరకు 'తెనుఁగు' అను మాటను 'తెనుఁగులు' అని వాడుచుండిరి. బహువచనమునకు గుర్తు 'గల్'అని, 'గుల్'అని యుండనోపు. "నీవు తెనుగులు ఏమయిన పరిశ్రమచేసినావా"యని యనుట మాచిన్నవాఁడు అప్పటిపెద్ద లుచ్చరించుట నే నెరుఁగుదును. ఇప్పటికిని తమిళమువారు 'కల్ - గల్-ఘళ్' బహువచనమునకుఁ జేర్చుచున్నారు.

తెన్నడి-తెన్గుపలుకు; అనఁగా తెనుఁగుభాష-దక్షిణభాష.

తెన్నండ-తెన్‌దెస-తెర్కు = అనఁగా దక్షిణదిక్కు.

తెన్నాడు = దక్షిణదేశము.

ఇప్పుడు వింధ్యకు దక్షిణమందు అనేకరూపభాషలు వెలసినవి. ఇవి యన్నియు నొకేభాషనుండి వృద్ధినొందినవి. దక్షిణాపథమునకు ద్రావిడదేశ మని పేరు గలదు. వింధ్యకు దక్షిణమున తూర్పువైపున మన దేశమున్నది. పడమరవైపున మనలో నుండి విడిపోయిన రాష్ట్రకూటులు, మహారాష్ట్రులు నున్నారు.

వారు దక్షిణీల మని చెప్పుదురు. మనము తెనుఁగువారమని చెప్పుదుము. రెండును ఒకటే అయినది. అరవలు తమిళుల మని యందురు. అదియును 'తెన్' యొక్క రూపమే. 'తెన్‌ముళి'లోని తెన్ తమ్ అని మారినది. 'ముళి' 'నుడి'యొక్క రూపమే. న, మ-లు మారుచుండును. 'నమకు'-అనఁగా 'మనకు'అని అరవలు వాడుదురు. కనుక నివి యన్నియు దక్షిణభాషలే. ఒకేభాషలోనివే యయ్యు వేరువేరు సీమలలో ఉచ్చారణభేదములు గలిగియున్నవి. అన్యభాషల సంపర్కమునం జేసి క్రొత్తరూపులును దాల్చుచున్నవి. మలయాళీలు, మహారాష్ట్రులు తమ భాషలను సంస్కృతమయములుగాఁ జేసిరి. తెనుఁగువారును మూఁడువంతులు సంస్కృతపదములే వాడుచున్నారు. అరవదేశములో సంస్కృతపదములను అచ్చఅరవమాటలుగా మార్చివేయుదురు.

౧౯౧౮-వ సం. మొదలు ౧౯౨౭-సం. వరకు రమారమి ౯ సం. లు నేను మధుర, కుంభకోణము,

తంజావూరు, అతిరామపట్టణములలో నుద్యోగమునం దుండుటవలన అక్కడి భాష మాటలాడుట, వ్రాయుట, చదువుట కొంతకొంత నేర్చుకొంటిని. పిమ్మట తెనుఁగు, తమిళమును ఒకేభాషయొక్క రూపాంతరములని గ్రహించితిని. శరీరావయవముల పేళ్లు—తల, వాయి, పల్లు, కన్ను, కయి, కాలు, వ్రేలు ఇత్యాదులు, శరీరసంబంధులైనవారి వావివరుసలు, తల్లి (తాయి), తండ్రి (తందై), అన్న (అణ్ణ), అత్త, మామ ఇత్యాదులు, వాఁడు, నీ, నేను మొదలైన సర్వనామములు, గృహోపకరణములు అనేకములైనపదములు తెనుఁగుతమిళములకు సమానములు.

అక్షరములలోను పోలిక లనేకములుండుట నేను కనిపెట్టితిని.

కుమారిలభట్టుగారును, కాల్డువెల్లుదొర గారును ఇదే యభిప్రాయమును సూచించిరి. (Supplement to Encyclopedia Indica) హైందవసర్వస్వానుబంధములోను ఇట్లే ఆంధ్రద్రావిడభాషాకుటుంబమనియు, వీనికి మొదలు ఒక్కటే యనియు నున్నది. కుమారిలభట్టుగారి ఆంధ్రద్రావిడభాషావ్యాకరణము నాకు చిక్కలేదు.

దేశవిభాగములలో కళింగము, ఆంధ్రము, తెనుఁగు, కర్ణాటకము అను సీమలయందు మాటలాడు భాష తెనుఁగే.

కళింగ మనఁగా సముద్రపు రేవు. దీనికి త్రికళింగ మనియు పేరున్నది. 'మధుకళింగ' అనఁగా ఇప్ప చెట్టులోనుండి లింగ ముద్భవింపఁగా దానిని మధుకలింగ మనిరి. అది ఓఢ్రుల నోట మొదుకలింగ-మొదుకలింగ-మూదుకళింగగా మారి మారి త్రికళింగ మైనదని యందురు. ఇదియే ముఖలింగక్షేత్రమఁట.

ఆంధ్రము:—అప్ + రన్ = మంచి జలసమృద్ధి గలది; చల్లదనముగలిగి శాంతమయినది. 'తన్ని'యనఁగా జలము.

అందణన్ (అందనుఁడు) - బ్రాహ్మణుఁడు. రూఢ్యర్థము.

అందన్నాడు - అంద్రనాడు = కృష్ణాగోదావరుల మధ్యదేశము.

తెనుఁగు=దక్షిణము(న నున్న దేశము)-కృష్ణవేణీ నదికి దక్షిణమున తెన్నాడు.

కర్ణాటకము = కాటిదేశము-అరణ్యప్రాంతమును. కనుకనే "కర్ణాటకిరాటకీచకు"లని బమ్మెరపోతన్న యన్నాఁడు.

ఆంధ్రమునకు ఈ యర్థము నేను నిర్వచింపఁగా సంస్కృతము మొదలైన అయిదారు భాషలు బాగుగా నెఱిఁగిన నా స్నేహితుఁడొకఁడు బాంద్రమునకు అభాస ఆంధ్ర మన్నాఁడు. బాంద్ర అనఁగా వానర యఁట.

దానికి నా సమాధానము : పూర్వము ఆంధ్రులు మహారాజులై, చక్రవర్తులై, ముప్పది కోటలు, ముప్పది గవర్నరులు (రాజధానీ నగరాధిపతులు), రథగజతురగ పదాతులైన యనేకలక్షల సైన్యములు గలిగి యనేక శతాబ్దములు ఏకచక్రముగా భూమికి పరిపాలకులుగా నుండిరి. అప్పటి వారి బాహ్యవేషములను విని, వారి చేష్టలను గని యిప్పటివారు పరాధీనజీవనులు - అస్వతంత్రులు, పరప్రభుత్వమునకు దాసులు, బానిస బ్రతుకు బ్రతుకువారు, నిరాయుధులు నైనవా రాక్షేపించుట కేమి కొదువ! అధికారములు గలవాఁడు వీరి బాహ్యవేషములు—అధికారము గల వేళల వీరు చేసిన పనులు—వీరి అలవాటులు అధికారాంతమునందు వీరి నెంత హేయముగా చూచుటకు కారణములో వీ రూహించుకొనవలెను.

అప్పటివారు స్వతంత్రులుగావున అసిముఖాస్త్ర యుగధారులై శత్రువుల కభేద్యములైన కవచములు దొడిగి శత్రునివహంబులు చేయు విషవాయు ప్రయోగములకు నిరోధకములైన హనుమంతుమోరలు కట్టుకొని సంచరించిరి. ఇతరులకు సాధ్యముకాని ఆకాశగమనమును అభ్యసించిరి. పక్షులవలె నెగురుటయందు నిపుణులు. ఆకాశగమనమే చేయుట ఆబాల్యమును పరిశ్రమ చేయుదురు. వారివారి సామర్థ్యమునుబట్టి పది మైళ్లు, నూరుమైళ్లు, నూరుయోజనములుకూడ గాలిలో

ఎగిరిపోఁగలవా రుండిరి. ఆకాశగమనము చేయు నప్పుడు తూకము (balance) సరిగా నిలుపుటకు రెక్కలును, తోకయుఁ గలిగియుండుట యవసరమే. అంతమాత్రముచేత వారు పక్షులు కారు— వనచరులు గారు.

వానరులైనచో రాజులు, మంత్రులు, సైన్యములు, వైద్యులు, ఇంజనీర్లు, శత్రులు, మిత్రులు, పరివారములు నుండునా? అది బాహ్యవేషము—బాహ్యరూపమునుగా నెఱుఁగవలెను. వారు మాటలాడునది మానవభాష. మానవభాషలోనే ఆంజనేయులవారు సీతమ్మకు వార్త పలికినట్లుగా మన వాల్మీకి వర్ణించినాఁడు. యుద్ధసమయములో లంకాపట్టణమును ముట్టడించియున్నప్పుడు సుగ్రీవ చక్రవర్తి చేసిన కట్టుబాటు వీరు నరులని స్థిరపరుచుచున్నది. నరరూపములతో నెవ్వరును-వానరు లెవ్వరును - బయటకు రాకూడదని నియమించిరి.

వాల్మీకి తన యాంధ్రులను దేవతాంశలచేఁ బుట్టినట్లు వర్ణించినాఁడు. శత్రువుల కజేయులు-భూలోకమునందు దేవతలు. ఆంధ్రు లనఁగా భూదేవతలనియేకదా యర్థము. వీరిలో ఆంజనేయస్వామి యిప్పటికిని పూజింపఁబడుచున్నాఁడు.

వాయువిమానములు కట్టుటకు ఊహలు ఎప్పుడు కలిగినవి? రెక్కలు కట్టుకొని యెగిరివచ్చినవారిని జూచియేకదా విమానముల యుత్పత్తికి దారితీసిరి? ౧౯౩౬ సం.లో ఇంగలాండులో కులస్త్రీలు (Ladies) కొందఱు రెక్కలు కట్టుకొని ౨, ౩ వేల అడుగుల యెత్తువరకు ఎగురుట అభ్యాసముచేయుచుండినట్లు పత్రికలలో చదివితిమి. ప్రపంచసంగ్రామము వచ్చిన తర్వాత విషధూమము ముక్కులలోను, నోటిలోను దూరకుండునట్లు హనుమంతుమోరలు (Gas Masks) కట్టుకొనుట ఇప్పటివారి కందఱకు విశదమే. అట్టివారి బొమ్మలుకూడ పత్రికలలోఁ జూచితిమి. అట్టివి చదివి యీవ్యాసము వ్రాసితిని.

ఈసందర్భములో వ్రాసిన పద్యము లీక్రిందఁ బొందుపరచెదను :

చ. జలమున వహ్ని నార్పు కవ
చంబులు దుర్విషధూమమారుతం
బులకు నిరోధకంబులగు
మోరలు నింగిని దేల్చు రెక్కలున్
బలితపు వాలముల్ గలుగు
నాంధ్రులు సంగరయోధవర్యులై
తలనుగ దక్షిణాపథము
పాలనచేసిరి వాసిగాంచుచున్.

చ. తడియదు నీటఁ బడ్డఁ, బరి
తప్తము గాదు దవానలంబునన్
బడినను, విద్యుదంశమున
భగ్నము గాదు, సమీరసంహతిన్
సడలదు నాంధ్రవీరకవ
చం- బెటు లెవ్వరు చేసియిచ్చిరో
వడుపున నింగిపై నెగిరి
నన్-బులుగుంబలెఁ- దాల్చు యోధునిన్.

ఉ. ఆహవకేళి శత్రునివ
హంబులు చిమ్మెడి మారణాస్త్రసం
దోహము దుర్విషానలము
ధూమము వారణసేయఁజాలు, ము
ద్దా హనుమంతమోరు లన
యంబును దాల్చి యజేయులై, మహా
సాహసవృత్తి బాహుబల
సంపద నేలిరి నాంధ్రు లుర్వరన్.

శా. మోరన్ రెక్కలు పెద్దతోక కవచం
బున్ దాల్చి యాబాల్యమున్
ధీరుల్ నింగిని దేలుచున్ గిరుల ధా
త్రీజంబులన్ వ్రాలుచున్
మారాకాశవిహారముల్ సలిపి నాం
ధ్రుల్ యోధులై ద్వీపసం
చారంబున్ బొనరింప నేర్చెదరు శా
దక్షప్రజ్ఞులై శూరులై.

ఉ. రెక్కల నార్చి పైకెగసి
వ్రేల్లురుకున్ దవుదోల, నొక్కెడిం
కొక్కఁడు ప్రోక మామడమ
యొక్కఁడు నేచని వచ్చు నిట్టులా

పొక్కెక్కుడు నభ్యసించుకొను
చుందురు వాయువిహారముల్ దివిన్
జెక్కువిధంబులన్ దెలుఁగు
శూరు లజేయపరాక్రమక్రముల్.

ఉ. పాపము ! మధ్యదేశపరి
పాలుర వానరజాతి యం చనూ
యాపరు లాడినన్ నిజము
లాభిమతైషులు సాంధ్రులైన భా
షాపరిశోధనన్ సలుపఁ
జాలరె యాంధ్రపదంబె యట్లుకొ
నోపు నటంచుఁ బల్కు విబు
ధోత్తముఁ డొక్కఁడు హేతువాదనన్.

ఇట్లు సమర్థించి వ్రాయుటలో పరికరములన్నిం టిని సంక్షేపముగా సమకూర్చితిని. పరిశోధనాపరులకు సాయపడుటకు సంశయము లేదు.

చ. తెనుఁగు-తెలుంగు-తెన్-దెరుఁగు
తెంకన-దక్షిణ మంద్రము-పల్కనం
గను-నుడి యన్న భావ యగుఁ
గాంతము కాంతము నై జలావృతం
బు నయిన నందనం బగును
బొందుగ నందననాడు నంద్రనా
వనఁజను గృష్ణగౌతముల
యంతరమే యగు నాంధ్రదేశముల్.

ఉ. అందణమన్న నందమయి
యంచితవారిసమృద్ధి గల్గి చే
రందిన దంచు ద్రావిడప
దార్థముచేఁ దెలియంగ నయ్యె న
ట్లందననాడు వేసమరె
నందరనాడని యంధ్రనాడు నం
చందురు దీని రూఢి తెలి
యన్ వలయున్ బరిశోధనాపరుల్.



# సాయంకాలము

— శ్రీ వి. కోటేశ్వరశర్మ —

౧

అరుణారుణ కాంతుల్లో
నిగ్గులనే పరికిస్తూ
కలలను కంటున్నావా?

మనిషీ?

కల సత్యం మరిచావా?

౨

దుష్టతమోనివహంలో
కండ్లులేక తడుముకొనే
మీ కోజ్ఞానజ్యోతిని
చూపించుటకేనోయ్

మనిషీ?

రక్తసిక్తగాత్రుణ్ణయ్యా.

౩

మాయంత్ర సహాయంతో
అంధతమస్సును చీల్చేశాం
జ్యోతిర్లోకం పయనించాం
అక్కర లే దనుకుంటావా

మనిషీ?

మనసులోని మనమన మాట.

౪

పిచ్చివాడ నీకొక్కడికేనోయ్
వింతవింత దీపాల సహాయమ్
పేదవారి గుడిశల్లో నా
చీకటిదయ్యం పిశాచనృత్యం
కావిస్తుంటే కనుగొనలేకా

మనిషీ?

అగణితభారు ణ్ణయ్యా.

౫

నాకును కొందరి సాయం
కలదోయ్ నీవంటివారి దే
చూ డిటు బాధ గణింపక
నాకై అంజలి నిచ్చెడి లోకం

మనిషీ?

నీ వొక్కడితో లేదోయ్ లోకం.

౬

నాచేనైన సహాయం
ప్రేమతో మీకొనరించి
అస్తగిరిని చేరుచున్నా
వేలకొలది నాభ్రాతలు
పుట్టుదు రిది నిజమోయ్

మనిషీ?

నీవే నేనే లోకం కాదోయ్!



# తొలకరి

— శ్రీ బోయి భీమన్న —

చల్లుము విత్తనమ్ములు, భు
జమ్మున నాగలి నుంపవేల? వి
ద్యుల్లత లేని మబ్బులకు
తోచదొ బుద్ధి? బెడంగుచుంటివో
కల్లొ, నిజంబొ యంచు? ఇది
గాలిదుమారమొ యంచు? కాదు కా
దల్లరి, చూడు—నీ కొరకు
ఆగదు కాలము; ఏరుగట్టుమా!

కదువడి, బారుగా, విజయ
కాంతి భయంకరమై పురోగమిం
చెడి రణరంగమట్లు చను
నీరదముల్; అనుమాన మేల? వే
పిడుగులు నగ్ని గుండ్లు గురి
పించును—సత్యమ; కాని, అంతలో
జడిగొని నిండుకుండలుగ
జల్లును నీమడిలో సుధాంబువుల్.

ఎఱ్ఱని యెండలోన బ్రతు
కెల్ల ననన్యపు దాస్యభారముల్
బర్రున లాగుకొంచు కడు
బానిసవై మనినావు; పాదముల్
జర్రున జార బిడ్డలు కు
లాసగ నాడెడు తొల్కరిం పడే
మర్రులమీద వ్రాలినది!
మంచిదినమ్ములు రాక నిల్చునే?

"మబ్బుల నీరు లేదు, పవ
మానుని గుండెల చెమ్మ లేదు, మా
దుబ్బుల యేరు నెండినది,
తూములు పూడెను, చేల నెర్లలో
గబ్బిలముల్ కులాయములు
గట్టుకొనెన్, ఇక సేద్యమేడ? మా
సెబ్బరి మన్గడల్ కడకు
చేరునె? శాంతియు సౌఖ్యమబ్బునే?"

అని దుఃఖించుచు నిల్చినాడ, వదికా
దాంధ్రత్వ మోయన్న! సా
ధనముల్ గన్పడకున్న మాత్రమున
లేదా చేవ నీలోపలన్?
ఘనముల్ మృత్యువె కాదు, జీవనమునున్
దాల్చున్; ఇకన్—నీ పొల
మ్మున వర్షించును విప్లవమ్ముగ నవాం
బుప్రావృడంభోదముల్.

అరుణార్కుం డదె పశ్చిమాంబునిధి మా
యంబయ్యె, ఇంకెంత? తొ
ల్కరి కానోపును రేపె! చిన్నెలటులే
కాన్పించు; హాః...ఉక్కపో
సె రసాభానగ...ప్రొద్దు తూర్పు దెనకున్
చేరంగ—ఈలోపునే
ధరణిన్ దున్నెదువాడ! సిద్ధపడుమా
త్వద్భూమి బాలింపగన్!

---

# ఆముక్తమాల్యద రచనోద్యోగకాలము - - -



= శ్రీ ఓరుగంటి రామచంద్రయ్య =

తెనుగుసాహిత్యమున నాముక్తమాల్యద పరమావధి నందినదని విజ్ఞుల మతము. పదపాటవమునను, అభిధేయోత్కృష్టతయందును దాని కదియే సాటి.

ఆముక్తమును రచించిన దెవరు? పెద్దనయా, కృష్ణరాయలా? ఈ ప్రశ్నము వాదోపవాదములకు1 గురియై, తుద కిప్పు డొకవిధముగా తేలిన దనుకొనవచ్చును. కవి రాయలే. అయినను వారి యాస్థానమున గవిపెద్ద యల్లసాని పెద్దన యనుప్రవేశ మా గ్రంథరచనమున సిద్ధము. కృతిగౌరవము బహుశః తత్పర్యవసాయియే యగుటచే గర్తృత్వమును రాయల కారోపించుటకు మనపూర్వక సమకాలీను లూరకొనగా, నర్వాచీనులగు రామలింగకవి, అప్పకవి ప్రభృతు లాగ్రంథమును పెద్దనరచనముగనే వాకొనిరని నిశ్చయింపనగును.

శ్రీకృష్ణరాయపెద్దనార్యులలో నెవరు రచయితలైనను, ఐతిహాసికముగ నాకావ్యప్రాశస్త్యము కొంచెమైనను గుంటువడదు. ఏలన, నిర్వురును సమకాలీనులగుటచే, నందు జిత్రించిన దేశకాలములు భిన్నములు కాజాలవు.

రచనోద్యోగము:

ఆముక్తమాల్యదరచనాకాలము నిర్ణయింప యత్నించు చరిత్రకారులకు గ్రంథాంతరవిషయములు తోడుమాపినవి. అందు నీవాక్యము ముఖ్యము:

"మున్నే గళింగదేశవిజిగీషామనీషం దండెత్తి పోయి విజయవాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చట గావింప, నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున"2

రాయ లొక కల గాంచెను. అదియే యీ యుత్తమకావ్యమునకు బీజమైనది.

శ్రీకాకుళమున కృష్ణదేవరాయల శాసన మొకటి కలదు. శా. శ. ౧౪౪౦ బహుధాన్యసంవత్సర ఫాల్గుణ శుద్ధ ౧౦ శనివారమున కాకుళపు తెనుంగురాయలకు, రాయ లయిమాళ్ల సమర్పించి సేవించెనని యందున్నది. అందే రాయలు స్వామిదర్శన మొనరించుట కుంభసంక్రమణపుణ్యకాలమున ననియు జెప్పియున్నది.3

ఎలియట్ సేకరణ (Elliot's collection)లోని యీ శాసనపు ప్రతి నాధారముగా గొని శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు హరివాసరమును, కృష్ణరాయలు తెనుగువిష్ణువును సేవించిన దినమును శా. శ. ౧౪౪౦ బహుధాన్య ఫాల్గుణ శు ౧౧ శుక్రవారముతో సరియగు క్రీ. శ. ౧౧-౨-౧౫౧౯ వని గుణించిరి.4 ఈ గుణనము ధర్మశాసనము వేసిన కాలమునకు జేరువ నున్నది కాని, నాడే కుంభసంక్రాంతి యనుటమాత్రము పొసగదు. ఏలన, రాయల రాజ్యకాలమున నెన్నడును కుంభసంక్రమణము ఫాల్గుణ శు. ౧౦ నాడు తటసింపలేదు. కుంభసంక్రాంతి శా. శ. ౧౪౪౦ బహుధాన్యమున మాఘ బ. ౧౧ గురువారమున (క్రీ. శ,

---

1. ఆముక్తమాల్యద-పీఠిక. వేదము వేంకటరాయశాస్త్రిమిశ్రుల వ్యాఖ్యాసమేత ముద్రణము. *pp.* 67-72.
2. *Ibid. Canto I, verse 11.*
3. *S. I. I; Vol. IV, No. 981.*
4. వ్యాసావళి, *pp. 33-35.*

౨౮-౧-౧౫౧౯) కలిగినది.5 నా డేకాదశి యుపవాస దివస మగుటయు, హరివాసరమున శ్రీకాకుళమున రాయ లుపవసించెనని యాముక్తమున నుండుటయు జూడ నాటిరాత్రి కలయే తెల్గుసాహిత్యమున కిట్టి యముక్తమాల్యద రచనమును ప్రసాదింప హేతువైన దని శ్రీ కందూరు ఈశ్వరదత్తుగారు నిర్ణయించిరి.6

**కొన్ని యనుపపత్తులు :**

ఆముక్తవాక్యమునుబట్టి యూహించుటేకాని, కుంభసంక్రాంతినా డేకాదశి యని శాసనమున లేదు. శా. శ. ౧౪౪౦ గత (Expired) వర్షమైనచో కుంభ సంక్రమణ మేకాదశి యగునుగాని, ఫాల్గుణ శు ౧౦. మాత్రము శనివారము కాదు; బుధవారమగును. శా. శ. ౧౪౪౦ వర్తమాన (Current) వత్సరమయినచో, ఫాల్గుణ శు. ౧౦ శనివారమేకాని బహుధాన్యము కాక వర్ష మీశ్వరము. కుంభసంక్రమణకాలము మాఘ బ. ౧ బుధవారము (క్రీ శ. ౨౮-౧-౧౫౧౯) యగును.7 అయిన నేమి? ఒకమారు హరివాసరమునను, కుంభ సంక్రాంతికి మరొకపర్యాయమును, ఇట్లు చాల సారులు కృష్ణరాయలు శ్రీకాకుళమున కేగియుండ రాదా?

శ్రీ ఈశ్వరదత్తుగారి నిర్ణయమునకు బలముగ నిట్లు వాదింపవచ్చును. పేరుచేతనే హరివాసరము విష్ణువునకు కడు గూర్చునదని తెలియుచున్నది. ఏకాదశికి హరిదిన మని వ్యవహారనామ మున్నది. అందును కుంభ సంక్రాంతియట, నా డేకాదశి హరి కత్యంతము ప్రీతి పాత్ర మైయుండును. ఏలన, కుంభము ఋషభ, సింహ, వృశ్చికములవలె స్థిరరాసులలో నొకటి. స్థిర రాశిసంక్రాంతులకు విష్ణుపాదము లని పేరు కలదు.8 కావున శాసనోక్తకుంభసంక్రమణ మేకాదశియగు క్రీ. శ. ౨౮-౧-౧౫౧౯ అనియు, నాడే కృష్ణరాయ లాముక్తమును సంకల్పించిన హరివాసర మనియు నిశ్చ యింపరాదా?

ఇచట ననుపపత్తి యొకటి కలదు. ఈశ్వరబహు ధాన్యములు రెంటను కుంభసంక్రాంతి మాఘమాస బహుళపక్షముననే తటస్థించినది. కాని హరివాసర మను పేరు ఆషాఢభాద్రపదకార్తికమాసములందు వరుసగా ననూరాధ శ్రవణ రేవతి యీ నక్షత్రములతోడి శుద్ధ ద్వాదశులకే చెల్లును.9 ఆషాఢశుక్లద్వాదశి విష్ణువునకు మిగుల గూర్చున దనియు, నాటి వామనపూజ వరమేధ ఫలదాయి యనియు ధర్మసింధువు. "ద్వాదశీ చక్రిణ స్తథా" యని హేమాద్రికృతచతుర్వర్గచింతామణి. కావు ననే దానికి వైష్ణవతిథి యని మరొక పేరును కలిగినది.10

ప్రతియేకాదశియు హరిదినమే. కాని యాషాఢ భాద్రపదకార్తికమాసశుక్లపక్షములనే వానికి క్రమ ముగా విష్ణుశయనీ, పరివర్తినీ, ప్రబోధినీ యేకాదశు లని ప్రత్యేకనామములు.11 బహుళచతుర్దశి యేమాసమున నైనను శివరాత్రియే. కాని మాఘమాసముననే దానికి శివరాత్రి యనియు, మహాశివరాత్రి యనియు రూఢిగ వ్యవహరింతురు. అట్లే హరిదినమునకు భిన్నముగ హరి వాసర ముండుటయు, అదియు నాషాఢభాద్రపదకార్తి కములందు శుద్ధైకాదశులవలె మూడు శుద్ధద్వాదశులకే వర్తిం చుటయు సాధ్యమే.

ఆముక్తమునుండి యుద్ధృతమగు నా చిన్నవాక్య మున 'వాసర'పదమును కవి రెండుమారులు ప్రయోగించి నాడు. పర్యాయపదములు తెలియక కాదు గదా? మరి యే ప్రయోజనము నర్థించి యీ కూర్పు? మొదట సామాన్యార్థమునను, తరువాత రూఢ్యర్థముగను 'వాసర' పదము ప్రయుక్తమని తోచును.

---

5. *L. D. Swamikannu Pillai : Indian Ephemeris, V*

6. *'Date of Amuktamalyada', J. A. H. R. S. IX, pt. i, pp 39-40.*

7. *Indian Ephemeris V.*

8. *Indian Ephemeris I, pt. i, p. 58.*

9. *E. I. VI, No. 12, page III, N. 4—H. Luders.*

10. *Quoted by Prof. F Kielhorn, Ind. Antiquary, XXVI, No. 17, p. 333 and note 8 on the same page.*

11. *Ind. Ephemeris I, pt. 1, p. 56.*

పైవాదము యుక్తమయినచో శ్రీకాకుళశాసనోక్తకుంభసంక్రమణదిన మాముక్తములోని హరివాసరము కాజాలదు. ఆకావ్యరచనోద్యోగదినమునకై పైశాసనకాలమునకు వెలిగా వెదుకవలసియుండును.

### హరివాసరమునాటికి కళింగవిజయము పూర్తియైనది :

హరివాసరమునాటి రాత్రి నాలుగవ జామున కలలో రాయలకు శ్రీ కాకుళాంధ్రవిష్ణువు సాక్షాత్కరించి గోదాదేవికిని, తనకు నైన పెండిలివిషయముగా కృతి నిర్మింపుమని యాదేశించెను. నాలవజామున కల శీఘ్రఫలమును సూచించునని శాస్త్రము. మరునాడు రాయలే వినిపింపగా విద్వజ్జను లాకలను రాయపరముగా, నితోధికముగ భక్తియు, నగాధసారస్వతోద్బోధంబును, అఖండభాండాగారసమృద్ధియు, నదీ్వతీయసితఛత్త్రితయు, సమస్తసామంతసమాజకర్షణంబును, బహుశ్రేయస్ప్రాప్తియు, నపత్యపరమాయురవాప్తియును దెలుపునదిగా పలికి, కృష్ణరాయల నెక్కుడుగా బ్రశంసించి, యట్టి గుణోత్తరునకు కృతినిర్మాణము సుకరమనియు, నవశ్యము కరణీయ మనియు నుడివిరి. వారి యాప్రశంసాసందర్భమున రాయలవిజయము లానాటికే జరిగినవానిని పేర్కొనిరి.[12]

'తోలుదొల్త' యను పద్యమున కళింగవిజయ మంతయు సూచింపబడినది. ఉదయగిరి[13], కొండవీడు[14], జమ్మిలోయ, కోన, కొట్టాము, కనకగిరి, గౌతమి, పొట్నూరు, మాడెములు (మాడుగులు), ఒడ్డాది, కటకము, ఇవి రాయల శౌర్యమును చవిగొన్నవి. 'తోలుదొల్త', 'మఱి', 'యటసాగి', 'యవుల' యిత్యాది పదము లాయాస్థలముల సాధించిన క్రమమును తెలుపుచున్నవి. ఉదయగిరినుండి కటకమువఱకు రాయధాటి సూత్రపట్టినట్లు లేక వక్రముగా నుండుటచే రాయల శౌర్యాగ్నికి లోకదిచ్చుసామ్యము జెప్పబడినది. ఆ తరువాతిపద్యములలో మఱల కొండవీటియందు విఱిగి యుత్కలక్షత్రియపాత్రులు రాజమహేంద్రప్రాంతములకు బఱచుట, కళింగరాజ్యలక్ష్మి వావిదప్పక కృష్ణరాయల జేరుట, గజపతి యలికి యడవులబడుట, పొట్నూర విజయస్తంభస్థాపనము[15]లను పూర్వము ప్రస్తావించినవానినే మఱియు రసవంతముగా బలుకుట నైనది. అటుపిదప గల్బర్గానగరపురయవనరాజసైన్యముల నాఱుమాడుటయు, నేదులఖానుశిరఃకర్తనమును వర్ణింపబడినవి.

ఇచట కృత్యాదిపద్యములలో రాయవిజయక్రమము సరిగ నిర్వహింపబడలేదు. ఎట్లన, రాయల చేతుల మడిసిన నేదులఖా నొకడున్నచో నాతడు యూసఫ్ ఆదిల్ ఖా నగునుగాని యతని పుత్త్రుడును, క్రీ. శ. ౧౫౩౪ వరకు జీవించినవాడు నగు ఇస్మాయిల్ కాజాలడు.[16] యూసఫ్ క్రీ. శ. ౧౬ ఆగస్టు - నవంబరు ౧౫౧౦ లోపల మరణించినట్లు నిర్ధారింపవచ్చును.[17] కావున క్రీ. శ. ౧౫౧౦ లోనే జరిగిన యవనులపైని దండయాత్ర కళింగజయమునకు వెనుక నుంచుటకు కాదుగదా.

### (క) కటకదాహము :

కృత్యాదిపద్యముల రాయకటకయాత్ర వర్ణితమైనది. కాని యది యాశ్వాసాంతపద్యముల నగపడదు. సింహాచలమువరకు రాయగమననిదర్శనములు శాసనాదులందు దొరకెగా, నీ కటకజయము జరిగియున్నచో, నట్టి నిదర్శనములు లభింపవేల? ఈ ప్రశ్నముంగూర్చు కొని రైతిహాసికులు కటకదహనము నమ్మరాదని వ్రాయు

12. అముక్తమాల్యద, ఆ 1, ప. 33-44.

13. *Ibid*, ఆ 1, ప. 36 : *Nellore Dt. Inscriptions III*, *U*. 37, 38, 40 *and* 41.

14. *Ibid.* ఆ 1, ప. 37 : *Nos*. 255 *and* 257 *of* 1892.

15. *Ibid*. ఆ 1, ప. 40 : *Nuniz*, *F. E*. 318-19 : *Nos*. 243 *and* 245 *of* 1899. సింహాచల నృసింహునికై రాయదానములు. జయస్తంభస్థాపన మిందు జెప్పబడలేదు.

16. కృష్ణరాయలు క్రీ. శ. 1530 కి ముందే మరణించెను.

17. *See my article on 'The death of Yusuf Adil Shah-the date' : Proceedings of the Indian History Congress, Allahabad, p. 323.*

త్తరు. అట్లైన 'తోలుకొత్త'మాటేమి యని ప్రశ్నించినచో, నందు రాయభుజప్రతాపమున కగ్నిసామ్యము పల్కుటచే నుత్ప్రేక్షావశుడై కవి యగ్నిప్రకాశమును గటకమునకు బంపెనేకాని యది ప్రతిపదము నమ్మదగు విలుగాదనియు వారి యుత్తరము.

అయిన కటకముపై రాయల దాడి హుళక్కియేనా? కాదని నా యూహ. కృష్ణరాయలు ప్రతాపరుద్రగజపతితో నొనర్చిన యుద్ధము లన్నియు దేశాక్రమణకే యనుకొనరాదు. కృష్ణానదిని దాటి యుత్తరమునకు సాగిననాటనుండియు రాయలు తన రాజ్యవ్యాపనము నుద్దేశింపలేదని తోచును. తన ప్రభుతనో, మైత్రినో యంగీకరింపనంతవఱకు, తన పాలనమున నున్న ప్రజల కుపద్రవము కూర్చుశక్తినైన గోల్పోవనంతవఱకు గాళింగులు జితులుకారు. కావున కృష్ణానది కావలి దండయాత్రకారణము రాయవిజిగీషయేకాని రాజ్యలిప్సకాదు. ఇట్టి కోరికయే ప్రతాపరుద్రునితోడి పోరుకై రాయని పొట్నూరు జేర్చినది. కాకున్న, విజయనగరమున కతిదూరమున, కొండ లరణ్యముల దాటి, శత్రుదేశమున, తన సైన్యములకు రస్తుతీరు మార్గములను విరోధు లవలీలగా నడ్డగింపవీలుండు స్థితిలో గళింగవిజయమందు బద్ధాదరు డగుటకు కృష్ణరాయ లంత యోచనలేని ప్రభువా? సాళువతిమ్మరుసు, మహామంత్రి, యట్టి చేత కడ్డుచెప్పకయేయుండెను.[18] అందుకు భిన్నముగ రాయలు చరించుటలో శత్రుదేశమున నతడు చిరకాల ముండ నుంకింపలే దనుటకు బలమొసగుచున్నది. కృష్ణరాయవిజయము, రాయవాచకములు పొట్నూరునుండియే రాయలు గజపతితనయను పెండ్లియై వెనుదిరిగెనని పలుకుచున్నవి. వివాహముమాట యెట్లైనను, కృష్ణరాయలు పొట్నూర బాలకాలము గడపలేదని యాగ్రంథములు తెలుపును.

నన్నిజైత్రయాత్రలలో కృష్ణరాయలు సింహాద్రియందు దాదు మాసములు గజపతికై వృథా వేచి విసిగి, జయస్తంభస్థాపనానంతరము రాజధానికి తిరిగివచ్చెనని కనబడుచున్నది.[19] రాయల సింహాచలశాసనముల కాలము[20] శా. శ. ౧౪౩౮ ధాతుసంవత్సర చైత్ర బ. ౧౨కి సరియగు క్రీ. శ. ౨౯-౩-౧౫౧౬. అటనుండి మరలి కృష్ణరాయలు విజయనగరము చేరి విరూపాక్షుని సన్నిధిని దానము లొనర్చినట్లు, అదేవర్షమున నాషాఢ బ. అమావాస్య, కర్కాటకసంక్రాంతి (క్రీ. శ. ౨౯-౬-౧౫౧౬) యప్పటి రాయశాసనము[21]నుండి తెలియనగును. ఈసమయముననే శ్రీకృష్ణరాయలు దక్షిణదేశస్థపుణ్యతీర్థముల సేవించి భూరిదానము లనేకము లొనర్చినట్లు శాసనములు పలుకుచున్నవి.

కాని సింహాచలశాసనముల కాలమునకే, అనగా ౨౯-౩-౧౫౧౬ క్రీ. శ. కే రాయల కళింగజయము సంపూర్తినందిన దనుట కాధారములు కానిపింపవు. విజయనగరసైన్యములు మాత్రము పోరాటము సాగించుచునే యుండినవి. అట్లుండగనే కృష్ణరాయలు తీర్థయాత్రల కేగుటలో విపరీతమును లేదు. ఉదయగిరి ముట్టడి జరుగు దినములందును, సిమ్మట కొండవీటి హరణమునకు బూర్వమునను, రాయ లెల్లప్పుడును దన సైన్యములవెంటనే యుండక పుణ్యక్షేత్రదర్శనోత్సుకతతో బయనించుచుండుట శాసనములలో నగపడును. అట్లే పొట్నూరున కావల దెల్గుసేనలు యుద్ధముసల్పు నవుడు నని యూహింపనగును.

ఆముక్తమాల్యదప్రస్తావనాశ్వాసాంతపద్యమున రాయలు పూరీజగన్నాథమును దాటి యింక నుత్తరము చనినట్లు సూచింపబడినది. నీలాద్రి(పూరీ)ని బలభద్రసుభద్రాసహితుడగు శ్రీకృష్ణుని యపాంగములు బాహావుల బలము నింపగా దరలిన తన జయసన్నాహోత్కటీవాద్యముల కలికి గజపతి పలాయితుడయినట్లు రాయల రచన. ఇట జగన్నాథమునుండి గజపతిపైకి దరలుట కటకముపైకేకాని యిటు దక్షిణమున కుండజాలదుకదా?

అంతియగాక, నీ క్రిందిశాసనముల జూడుడు. శా. శ. ౧౪౩౮ ధాతువత్సరము (౧౨ సెప్టెంబరు

---

18. కృష్ణరాయవిజయము, త్రై. ఆ., ప. 67.

19. *F. E., p. 319.*

20 *Nos. 243 and 245 of 1899.*

21. *457 of 1923: E. Carnatica, Hasan 13.*

౧౫౧౬) నాటి కొమ్మూరుశాసనమున22 కళింగదండయాత్రాసందర్భమున రాయలు 'కటకం చేరగాను పా...జంచేయంగా గ్రాను' అని యున్నది. శా. శ. ౧౪౩౯ ఈశ్వరవత్సరమునకు చెందిన చోళసముద్రశాసనము23 "కృష్ణరాయనికై సింహాద్రి శ్రీకూర్మములందు జయస్తంభముల స్థాపించిన వీరు"డని కొండమరుసయ్యను గొనియాడినది. సింహాద్రియందే రాయశాసన మొండు24 శా. శ. ౧౪౪౧ ప్రమాది శ్రావణ శు. ౧౩ సోమవారమున (౭-౭-౧౫౧౯ క్రీ. శ.) స్థాపితము, కృష్ణరాయలు ప్రతాపరుద్రుని దండపటమునుండి కొన్ని గ్రామముల గొన్నింటిని సింహాచలేశునికి రాయ లర్పించినాడని తెలుపుచున్నది. శ్రీకృష్ణసైన్యములు శ్రీకూర్మనీలాచలముల దాటి యుత్తరము పోయినట్లు నిదర్శనము లిన్ని యుండగా, రాయకళింగయాత్రాసందర్భమున గటకదాహము దురూహమును, అసాధ్యమును గాదు.

### శ్రీకాకుళశాసనకాలమునాటికి కళింగజయము ముగియలేదు :

శ్రీకాకుళశాసనోక్తకుంభసంక్రాంతికి కళింగజయము ముగిసె ననుటకు వీలుకాదు. సింహాద్రియందు రాయశాసనములు మొదట నగపడునవి క్రీ. శ. ౨౯-౩-౧౫౧౬ లో. పైకుంభసంక్రాంతి క్రీ. శ. జనవరి ౧౫౧౯ కి చెందినది. సింహాద్రిపొట్నూర జయశిలను జేర్చువాటికే కళింగము జితమైన, తరువాత మూడేండ్లకా, కళింగవిజయప్రస్తావి రాయల కల! కలకున, విజయసమాప్తికిని వ్యవధి యింత దీర్ఘమగుట సంభవమే కాదు. ఇంతకాలము నభియసైన్యము లేదోవిధముగ బోరుచునేయుండినవి. పైచేయి కృష్ణరాయలదే యయినను విజయమువాత్రము స్థిరపడలేదు.

శ్రీకాకుళశాసనోక్తకుంభసంక్రాంతికి కళింగవిజయము ముగిసియుండదు. ముగియలేదని క్రీ.శ. ౭-౭-౧౫౧౯ నాటి సింహాద్రిశాసనము స్పష్టముచేయుచున్నది. పై రెండు శాసనములకు నారుమాసముల యంతరము. కుంభసంక్రమణకే కళింగజయము పూర్తియైన, రాయల విజిగీషామనీషయును తృప్తినొందియుండదా ? అయినచో నీసింహాద్రిశాసనము నెట్లు సమర్థింపగలము ?

ఈప్రశ్నమును మనసునం దుంచుకొని శ్రీయీశ్వరదత్తుగా రిట్లు సెలవిచ్చిరి : "దండయాత్రనుండి మరలివచ్చి రాయలు విజయనగరమునుండియే బహుశః యీ దానమును జేసియుండవచ్చును. కారణము తెలియదుకాని చక్రవర్తి కళింగనృపతిపై మరల యుద్ధము సాగించువాడై విజయవాటివరకుం బోయి యాతనితో సమాధానము కుదురగా శ్రీకాకుళముమీదుగా మరలి రాజధానిం జేరె నన్న నమ్మకము జనించుచున్నది."25

ఇట్టి నమ్మకమెట్లో యర్థమగుట లేదు. క్రీ. శ. ౧౫౧౩ నుండి గజపతితోడి పోరు. సింహాద్రిని జయశిల జేర్చుటకు మూడేండ్లు తిరిగినవి. అంతటనైనను గజపతి సంధికి రాక కయ్యమాడుచునేయుండెనుగదా ? ఇట్టి కళింగనృపతి సెదురొ్కనవలసి, వెడలి, విజయవాటికడకు బోయినంతమాత్రమున రాయల కాతనితోడి విగ్రహము, సంధి యన్నియు నైనవా ?

అంతియగాక మరలమరల జయింపవలసివచ్చు కాళింగులు దండితు లగుదురేగాని, శక్తిహీనులై రాయల కధీనులౌచునో, శక్తి నడుగక రాయల మిత్రులుగనో చెలయునంతకాలము, వారు జితు లెట్లగుదురు? 'అపకృష్యాత్యుత్కళింగాంగనా బందీగ్రాహు' నిగ రాయని పేర్కొన్న మనుచరిత్రవాక్యము కళింగవనితలు తెలుచు భయపడుటనే తెలుపునుగాని పెక్కులు దండయాత్రల సూచింపదు. అథవా సూచించినను, అవి యన్నియు నాముక్తోక్తహరివాసరమునకు బూర్వము లే.26 కానిచో భగ్నప్రాయములగు జయముల వర్ణించుటకై రాయలు "విజిగీషామనీష"యను పదరచన కేల పాల్పడును ?

22. *824 of 1922.*

23. *No 87c of M. E. R. 1912.*

24. *244 of 1899.*

25. *'Campaigns of Sri Krishnadevaraya', J. A. H. R. S. IX, pt. 4. p. 61.*

26. శ్రీ వేంకటరాయశాస్త్రి : ఆముక్తమాల్యద—పీఠిక, *p. 66.*

**సిద్ధాంతము :**

కళింగవిజయము సింహాద్రిశాసనకాలమగు క్రీ. శ. ౮-౮-౧౫౧౯ కి తరువాత పూర్తియైనది. ఆ పిమ్మటనే శ్రీ కృష్ణరాయలు తెలుంగువిష్ణువును సేవించుచు, వారి వాసరోపవాస మొనర్చి, యాముక్తరచనాప్రోత్సాహమును గలలో బడసినది. కావున నాముక్తములోని హరివాసరమునకును, శ్రీకాకుళశాసనాంతరకుంభ సంక్రాంతి దివసమున కెట్టి సంబంధమును లేదని నిశ్చయము.

కృష్ణరాయవిజయరాయవాచకములలోను, కొద్ది మార్పులో నన్నిట[27] వ్రాతయుందును, విజయానంతరము శ్రీ కృష్ణరాయలు కళింగరాజతనయను పెండ్లియాడినట్లు చెప్పబడినది. రాయ లగ్నిసాక్షిగ గొన్న పండ్రెండుగురు భార్యలలో ముఖ్యలు మువ్వురనియు, సందొక్కర్తె యొరిస్సారాజదుహితయనియు పేజ్ వ్రాయసము.[28] పేజ్ క్రీ. శ. ౧౫౨౦ సెప్టెంబరు ప్రాంతములలో విజయనగరమం దుండినవాడు.[29] కావున కళింగ విజయానంతరమును నాహరివాసరము క్రీ. శ. ౮-౮-౧౫౧౯ కిని, సెప్టెంబరు ౧౫౨౦ కిని నడుమ నైయుండును. నాడే యాముక్తమాల్యదారచన కంకురార్పణ మైనది.

**ముగింపు :**

శ్రీకాకుళాంధ్రవిష్ణువును శ్రీ కృష్ణరాయలు దర్శించి పూజించెననుటకు పైఁ జేర్కొన్న శ్రీకాకుళశాసన మొకటితప్ప మరేనిదర్శనము లింతవరకు వెలువడలేదు. కాని యిట్టి యుద్గ్రంథనిర్మాత రాయలు; రచనాకారయిత కాకుళాంధ్రవిష్ణువు, తన యిష్టదైవమగు వేంకటేశ్వరున కభిన్నుడు.[30] శ్రీకాకుళము పలుమారులు తాఁ బయనించిన, కృష్ణానదీతీరభూమి. ఇట్టిచో నొకమారే రాయ లాదేవు దర్శించెననియు, నట నొక పర్యాయమే దానాదులొనర్చి మరి తిరిగిచూడ లేదనియు విశ్వసింపజాలకున్నాను. భావ్యాన్వేషణ శ్రీకాకుళమున శ్రీ కృష్ణరాయశాసనము లింక గొన్నిటిని వెలికిదెచ్చు ననియే నా నమ్మిక.

---

27. *F. E. P. 320.*

28. *Ibid. P. 247.*

29. *Ibid. pp. 140-141, Sewell, R.*

30. ఆముక్తమాల్యద, ఆ 1-ప. 16 '...... అతఁడరసన్నె గాదే?'



# పౌలస్త్య హృదయము*

= 'విద్యాపతి' =

ఇది యొక సందేశకావ్యము. ఈ కావ్యజాతి మొదట కవికులగురువు కాళిదాసుచే నారంభింపబడెను. ఆయనకావ్య మీజాతి కాదికావ్యమగుటయే కాక శిఖరమువంటిదియు నని విమర్శకు లుద్ఘోషించిరి. తెలుగునం దాకావ్యమున కనువాదములుకాని, యనుసరణములుకాని యిటీవలనే వెలసినవి. వీనియం దనువాదములే మెండు. మిగిలిన యనుసరణములలో పేర్కొనదగిన రెండుమూడు కావ్యములం దిది విలక్షణమైనది.

మేఘకావ్యమునకును, దీనికిని స్థూలదృష్టి కంతగా సాదృశ్యము కానిపింపకున్నను సూక్ష్మముగా పరిశీలించినచో నీరెండును నంతస్తత్త్వమున సంవదించునని స్ఫురించును. అందుచే దీనిని సందేశకావ్యమని పేర్కొంటిని. అభినయకళయం దేకపాత్రాభినయము వలె ఈ సాహిత్యప్రక్రియ బహువిచిత్రమైనది. ఇందు కథ హారమునందలి సూత్రమువలె నుండియు లేనట్లుండును. కావ్య మిరువురు పాత్రల నవలంబించినట్లు కన్పించునేకాని సాధారణముగా సంవాదమున కుపయోగింపని మేఘమువంటి జడపదార్థమో, లేక శుకాదులో నామమాత్రముగ నిర్దేశింపబడును. ఇక నాయకుడో, నాయికయో తమకు దూరమైన ప్రియులనుగూర్చి తమ సందేశము నాజడపదార్థములకు వినిపింతురు. ఈకావ్యమందును తుదకు రావణుడు "స్వాగతము బల్కవని విన్నపమ్ము సల్పు"మని సముద్రుని ద్వారమున రామునకు సందేశముఁబంపును. ఇట్టి నీరసోపకరణములతో కావ్యమును రచించి రసజ్ఞులను మెప్పింపగల్గుట కవి కళను జీర్ణించుకొనిన రససిద్ధుడైనగాని సాధ్యము కాదు.

ఈ కావ్యవస్తువున కాధారముగా లోకమునందు రావణుడు మహాభక్తు డనియు, నతడు రాముని పొందు నుద్దేశముననే సీతను గైకొనివచ్చెననియు నొక్కటి పురాణముగా చెప్పుకొనుట కలదు. ఈ యభిప్రాయము కేవలము నిర్మూలము కాదు. గ్రంథస్థాధారములును కలవు. సంస్కృతమున నధ్యాత్మరామాయణమునందే కాక తెనుగున భాస్కరరామాయణమునందును, రామునితో యుద్ధము చేయబోవునపుడు రావణుడు వలదని వారింపవచ్చిన మండోదరితో-

"ఎఱుగుదు నాకు రాఘవుము
హీనునిచేతి వనక్రమంబు ని
శ్లైజీగియు ముక్తి బొందగ న
భీష్టము గల్గుట నింత జేసితిన్."

అని చెప్పినట్లు కలదు. ఈవిషయమే యీ కావ్యమున, రాముని రాక చూచి బెదిరివచ్చిన సముద్రునితో రావణుడు తన హృదయమును విప్పిచెప్పినట్లుగా మార్చబడినది. ఈమార్పే కావ్యమునకు కాలికి పూసవంటిది. దీనివలన నీకథావస్తువునకు ప్రాతదనము పోయి నవ్యతామహితమైన సౌందర్యము ప్రాప్తించినది.

శ్రీరాముడు లంకపై నెత్తివచ్చుట చూచి రావణునియొద్దకు భయకంపితుడై పరువెత్తుకొని వచ్చు సముద్రుని రూపచిత్రణముతో కావ్య మారంభమగును. ఈ చిత్రణము చాల సహజమై కనులకు గట్టినట్లున్నది. సముద్రమున సహజముగ నుండు నురుగు, అలల సందడి మొదలగునవి భీతితో పరువెత్తికొనివచ్చువాని లక్షణములుగా నుత్ప్రేక్షింపబడినవి. ఈచిత్రణమున సముద్రమునందలి నిర్జీవమైన ప్రతియంశమునకును ప్రాణప్రతిష్ఠ జరిగినది.

---

* శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావుగార్లు వ్రాసిన ఖండకావ్యము.

అంత భీతితో వచ్చిన సముద్రుని చూచి రావణుడు ఆశ్చర్యపరవశుడై ఆతని నుత్సాహపఱచుటకై తన యిరువురి యభేద్యత్వమునుగూర్చి ప్రశంసించును. కొంతవడి కెట్లో రావణుడే సముద్రుని భీతికి గల కారణము నూహించుకొనును. రాముని ఆగమనవిషయ మాతనికి దలపున కారినంతనే ఆతని హృదయ మావేగమున పొంగిపొరలినది. "ఎట్లు! చెప్పవు! రాఘవుడే! మఱేల!" అని రావణుడు తన హృదయమందలి కల్లోలమును సముద్రునియం దావిష్కరించి శాంతి బొంద యత్నించును. ఆమాటలలో ఆరంభము నందే "దినము వర్షంబైన యుత్కంఠ" వలన రావణుడు పొందిన ఆతురత, ఆనందము, కాలవిలంబమున కసహిష్ణుత్వము మొదలగు భావములన్నియు, చెలియలికట్టను మీరిన సముద్రమునందలి యలలవలె నొక్కుమ్మడిని పైకుబుకును. చిరకాలవియోగమున దపించి ఎట్టకేలకు విభుడు చేరవచ్చుచున్నా డని విన్నంతనే మానరోషములతోను, సంతాపానందములతోను శబలితములైన మధురభావములను చెలికత్తెతో చెప్పుకొను నాయికవలె రావణుడు సముద్రునకు తన హృదయోద్వేగమును వెల్లడించుకొనును. ఒక క్షణము సందర్భమును విస్మరించినచో "దీర్ఘవిలంబము వాటించి విభుడు నన్ను వంచించెగదే!" అను మాటలు కేవలము నాయికానర్మోక్తుల వలెనే యందగించును.

రాఘవుడు తన్ను గూడుదు నని బాసయిచ్చి తప్పుటయు, తాను విభుని చేరుటకు పడిన పాట్లును, ఎఱిగి ఎఱిగి విభుడు తన్ను వంచించుటయు రావణుడు వర్ణించి చెప్పునప్పుడు హృదయము ద్రవించును. కేశవునకు "ఇంటనున్న యప్పు డీమాయనటనముల్ లేవట మాయదారియయ్యెనట మహికిడిగ్గి". పైగా గ్రుడ్డిలోక మాతని మాయలకు లోబడి ఆతనినే మెచ్చెను. తన చర్యలను ఖండించి, తన్ను రక్కసుడని దోసగల్ల జాల్పుతలలచే నిల్పెను. కడ కెట్లో సమాధానపడి—

"దక్కనిమ్ము మంచితనపు పెల్ల విభునకే
అతడు నన్నె యుంగు టదియ చాలు"

అని సంతృప్తిని బొందినాడు.

ఈ యమాయికత్వమునకు తగినట్లే యీతని యహంకారమును జాల రమ్యమైనది. స్వామి తన్ను జాలిమై గాచుటకు తాను నాతియు,కోతియు కాదట. అభిమానియౌ దశగ్రీవుడట. పైగా దా నింత రక్కసపను లొనరించినను, తల్లికంటె సీతకంటె తమ్మునికంటె నీజగదభిఘాతి రక్కసుడే సామికి మిక్కిలి గూర్పు నట. నిజము విచారించినచో లక్ష్మణాదు లందరును ప్రియతముడగు స్వామిని సేవించి యానందించిరి. వారి కట్టి చింతయును లేదు. మఱి రావణు డట్లు కాడు. రాముని పరిపూర్ణముగ ప్రేమించుచు, నాతనితో కోరి వైరమును దెచ్చుకొని ఆతనిని బాధలపాలు చేసెను. ప్రేమపూర్వకముగ సేవింపవలసినవానిని చేతులార తెలిసి తెలిసి సిలుగులపాలు సేయవలసివచ్చుచో నెంత బాధ కలుగునో చెప్పజాలము. అది యనుభవైకవేద్యము. ప్రహ్లాదాదు లనేక బాధలను బొందిరిగాని యిట్టి యగ్నిపరీక్షనుమాత్రము బొందలేదు.

తన విరహవేదనను భరింపజాలక, మార్గాంతర మేదియును లేకపోవుటచే తప్పక "జానకమ్మ తల్లినే హరించినాడు" కాని సీతావియోగవేదనాదోదూయమాన మానసుడై రామభద్రమూర్తి పిచ్చివానివలె నెలుగెత్తి యేడ్చుచు విపినములందు పరిభ్రమించుటను తలచుకొన్నంతనే ఆతనికి దుఃఖ మాగినది కాదు.

"తమ్మిగుఱ్ఱమాపున గేలుదమ్మి మోపి
ఉబుకువక్షమ్ము బాష్పమ్ము లొలుకు కనులు
వగచు నాతండ్రి యార్తిమై నడలుసాటి
జాలిచూపు నామోమున వ్రేలు నేడు."

అని వాపోయినాడు. కని పెంచిన దశరథుడైనను నింత దుఃఖింపడు. ఈపద్యమునను, దీనికి ముందు వెనుకలందున్న రెండుపద్యములందును జిత్రింపబడిన రామభద్రుని మూర్తిచిత్రణము మఱువరానిది. చిత్రకారుని కుంచెకు ఒరవడిగానున్నది. ఈ మూడుపద్యములందును అరణ్యకాండమునందలి సారమంతయు చాల సంక్షేపముగా నెంతో హృదయంగమముగా నిక్షేపింపబడినది. ఇందు అల్పాక్షరములలో నద్భుతములైన దృశ్యములను జిత్రింపగల్గుటయేకాక అమేయములైన రసభావములను

ధ్వనింపఁజేయుచు హృదయమును గరఁగింపఁగల శక్తియును వ్యక్తమగుచున్నది.

ఇందు భక్త్యాత్మకములైన మధురభావము లెడనెడ ప్రపంచింపఁబడినవి. "ఎట్లు! చెప్పవు! రాఘవుఁడే! మఱేల!" అను మొదలగువానియందు ఉపక్రమమునను, "చిరవిరహాగ్ని నడచిచ్చుల గుండమువోలె" అను మొదలగు ఉపసంహారవాక్యములందును వ్యక్తమగు ఉపాలంభనపూర్వకమైన రావణుని విప్రలంభము కావ్యమునందంతటను నంతర్వాహినివలె ధ్వనించుచునే యున్నది. రావణుని ముగ్ధత్వము, అవశత్వమువలని యార్తి కరుణము నుద్దీపింపఁజేసి పతితకు ప్రరోచనమును గల్గించుచున్నవి. ఆతని యమాయికమైన యహంకారము, వాత్సల్యమును భావశబలత్వమును దెచ్చిపెట్టి మనస్సున కొక చిత్రమైన యుత్సాహమును గల్పించుచున్నది. కావ్యము నారంభించినచో తుదిముట్టకుండ విడువఁజాలము విషయమే దీనియందలి రసస్యందియైన భావసంపదకు తార్కాణము.

చాల సుకుమారమైన యీ భావచాలనమునకు లలితమైన శైలీవిన్యాసము తోడునూపినది. అతిమృదులమై భావానుగుణమైన పదప్రయోగము, అర్థవ్యక్తియు, గాంభీర్యమును దీని నతురాస్యులకెల్లరకు నుపభోగ్యమగునట్లు చేసినవి. జాతీయోక్తిమహితమైన యిందలి పలుకుబడి హృద్యముగా నున్నది. సౌందరనందకావ్యముననే వీరి శైలి సూరనగారి 'ప్రభావతి'పాకమున బడినది. అది దీనియందు ఇంకను పరిణతమై రూపకమునందువలె ఉదాత్తతను గోల్పోవని పాత్రోచితమైన సంభాషణశైలికి నందుకొన్నది.

ఈ పరిణామము శైలియందేకాక కావ్యశిల్పమునందును గలదు. 'తొలకరి'యందు పునాదులు వైచుకొని 'సౌందరనంద'రూపమున మహాసౌధమును నిర్మించుకొన్న వీరి కావ్యశిల్పమునకీ 'పౌలస్త్యహృదయము' శిఖరమువలె నున్నది. శ్రవ్యకావ్యములందెటనైన నాటకీయమైన శిల్పము పరకోటి నందగల్గినచో నది యిట్టి సందేశకావ్యములందే కాన్పించును. నిర్ణీతమైన కథాప్రణాళిక గల కావ్యములలో సందర్భానుకూలముగ నాఖ్యానమార్గమునను, వర్ణనాత్మకముగను రచింప వీలుపడునుగాని, కథ మాత్రప్రాయమై, కేవల మేక పాత్రప్రసంగమున రసమును పోషించుచు పాత్రను చిత్రించుటకు కేవలము నాటకీయశిల్పనైపుణ్య మున్న తప్ప కావ్యనిర్వహణము సాధ్యము కాదు.

కాళిదాసుని మేఘకావ్యమున పాత్రస్వభావచిత్రణముకన్న ప్రకృతిచిత్రణమే యతిశయించినది. కాని యీకావ్యమున ప్రకృతిచిత్రణముకన్న పాత్రస్వభావచిత్రణమే యతిశయించినది. అందువలన దీని ప్రాశస్త్య మినుమడించుచున్నది.

ఇది యిట్లు వీరి కావ్యజాతమునకేగాక కావ్యశిల్పవిషయమున నాంధ్రకావ్యములకే యలంకారమన్నంతనే యీకావ్యము లోకమున కీయగల నూత్నసందేశ మేమి యను ప్రశ్న సహజముగ నుదయించును. కావ్యము లోకమున కీయగల సందేశమును బట్టి కావ్యగౌరవ మినుమడించు ననుట సుప్రసిద్ధము. అభ్యుదయరచయితలు దీనికి మఱికొంత ప్రాముఖ్యము నిచ్చిరి. ఏది యెట్లున్నను సాంఘికసంస్కృతికి ప్రతినిధిసదృశుఁడైన కవి తన కావ్యముల ద్వారమున నుదాత్తమైన సంస్కృతిని ప్రతిపాదించుచు సాంఘిక పురోభివృద్ధికి తోడ్పడవలయు ననుట సమంజసమే కాని ప్రతికవియు ప్రతికావ్యమునందును ఏదో యొక సందేశమును తప్పక నిర్దేశింపవలయు ననుట సరికాదు. చిత్రమునందలి రేఖాసౌందర్యమువలె, సంగీతమునందు రాగాలాపనమువలె కవిత్వమునందును సూర్యోదయ, సూర్యాస్తమయాదివర్ణనలు, పాత్రచిత్రణములు రంజకత్వమాత్రముననే యుపాదేయము లగును. వానియందు సందేశాత్మకత్వమునకు తావు లేనంతమాత్రమున నవి నిష్ప్రయోజనము లనిగాని, యక్కఱ లేదనిగాని యనఁజాలము. రంజింప గల్గుటయే వాని ప్రయోజనము. మేఘసందేశకావ్య మిట్టి రంజకత్వ మాత్రముననే నేటికిని ఆదరింపబడుచున్నది. అట్లే యీ కావ్యమును శిల్పగౌరవమున మనకు శిరోధార్య మగును.

ఇదియునుగాక రామాయణేతివృత్తమును కాలదిగనో, గొప్పగనో ఎప్పుడైన నొకప్పుడు తడవిననేగాని మహాకవిత్వప్రతిపత్తి సిద్ధింప దను నొక సంప్రదాయము గల

దటు. తత్సంప్రదాయానుశోధమునగాని, "ఎత్తఱినైనను ధీరోదాత్తనృపోత్తముఁడు రామనరణీపతి సద్వృత్తము సంభావ్యు" మని తిక్కనగారి మార్గమున నైనను వీరు దీనిని రచించిరని తలపవచ్చును. ఎట్లైనను వీరు తమ ఆశయమును ప్రశంసార్హముగ నిర్వహింప గల్గిరని యంగీకరింపక తప్పదు. ఈ కావ్యమును జదివినంతనే రామాయణేతివృత్తమును ఆంధ్రమునచేపట్టిన యనేకుల కన్న తద్రచనమునందు వీరి కెక్కువ యర్హత కలదని తోచును. ధారాళమై, సుప్రసన్నమైన శైలియును, మహనీయమైన కావ్యనిర్మాణదక్షతయు గల యీకవులు మహోదాత్తుడైన రాముని చరితము నిట్లు ఖండికలుగా గాని, సమగ్ర కావ్యరూపమునగాని, నైతికధర్మము క్లిష్టత బొందిన యీ కాలపరిస్థితుల నుపలక్షించి, మహాకవి వాల్మీకి ఏ మహోదారాశయమునకై ఆ మహాగ్రంథమును లోకమునకు ప్రసాదించెనో ఆ మహోదారాశయమునే మరల నీ కాలమున ప్రతిపాదింపవలయు నను దృష్టితో వ్రాసినచో నది తమకేగాక లోకమునకును నుపకారకమగును.

---

# పాగునార; పావనవార; ప్రాఙ్నాడు



## — శ్రీ సి. ఆర్. కృష్ణమాచార్యులు —

సర్కారుశాసనశాఖవారి 1920-21 సంవత్సరపు వార్షికనివేదిక (పుట 118)లో పాగునార, పావనవార, ప్రాఙ్నాడు అను నీ పేరులు ఒక్క ప్రదేశమునకే అన్వయించవచ్చు నని సూచింపబడియున్నది. ఇది యిప్పటి తణుకుతాలూకాయును, దానిచెంత నుండు ప్రాంతములనకును పూర్వనామధేయ మైయుండవలె ననియు పైనివేదికయొక్క అభిప్రాయము. అయితే దీనిని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఖండించుచు 1946 సం॥ మేనెల భారతిసంచిక (పుట 481)లో ఈ విధముగ వ్రాసియున్నారు:

"పాగునార, పావనవారములు ప్రాఙ్నాటి ప్రాచీనరూపము లైయుండు నని పైన వ్రాసిన విషయము సరియైనది కాదు. ప్రాఙ్నాటి ఆంధ్రబ్రాహ్మణు లున్నారుకాని వారికి, పాగునార(పావనవార) మనకును సంబంధము లేదు. అట్లే పాగునార, పావునవారములకును, ప్రాఙ్నాటికిని సంబంధము లేదు. ఈ రూపములు ప్రాఙ్నాడు ప్రాచీనరూపములు కావు.

'ప్రాఙ్నాడు'కు తెలుగు 'తూర్పునాడు'. ముసుందూరను గ్రామము తూర్పునాటిలో (ప్రాఙ్నాటిలో) ఉన్నదని బాపట్లలోని యొక శాసనము (S. I. I. Vol. VI. No. 179) తెలుపుచున్నది. ముసుందూరు ఇప్పుడు ముసుణూరు (మునుసూరు) అయినది. ఈ గ్రామము నెల్లూరుజిల్లా కావలితాలూకాలోని దగుట చేత ప్రాఙ్నాడు కావలిప్రాంత మనుటకు సందియము లేదు........."

ఈఖండనవాదమున కొక్కటియే శ్రీశర్మగారి యాధారము. ముసునూరు అను గ్రామ మొకటి కావలి తాలూకాలో నుండుటయే. అయితే దీనికి విరోధముగ నొక యంశ మున్నది. కృష్ణాజిల్లాలోని నూజివీడు తాలూకాలో మఱియొక 'ముసునూరు' గ్రామ మున్నది.* బాపట్లశాసనములో పేర్కొనబడిన తూర్పునాటి ముసునూరు ఈముసునూరుగానే యుండవచ్చును. ఇది యునుగాక కావలితాలూకాలోని శాసనములలో నొక దానిలోగాని 'తూర్పునాడు' పేర్కొనబడియుండ లేదు. కావున పైని చెప్పబడిన పాగునార, పావనవార, ప్రాఙ్నాడు, తూర్పునాడు అన్నియును ఇప్పటి తణుకు, నూజివీడుతాలూకాల ప్రాంతములకు చెందిన పేర్లనియే నిర్ణీతమగుచున్నది. శాసనశాఖవారి నివేదికలోని యూహాకు పైయంశములు సహాయభూతము లగుచున్నవి.

ఇదియునుగాక శ్రీ శర్మగారే "'ప్రాకునార' పదమే కాలక్రమమున పాగునార, పావనవారములుగా మాఱియుండు"నని యభిప్రాయపడియున్నారు (భారతి 1946 మేనెల సంచిక; పుట 479). 'ప్రాకునాం'డును, 'ప్రాఙ్నాడు'కును దూరమెక్కుడు లేదు.

---

* మఱియొక నెల్లూరుజిల్లా కనిగిరి తాలూకాలో నొక 'ముసునూరు'గ్రామమున్నది.

# తుదిసందేశం

[కథానిక]

— శ్రీ ఘట్టి ఆంజనేయశర్మ —

హడావుడిగా ఇంటరుక్లాసు కంపార్టుమెంటులో భార్యా, బిడ్డలతో ఎక్కేసరికి తల ప్రాణం తోకకొచ్చినట్లయింది. అంతకుముందు బెర్తు అంతా తనే ఆక్రమించుకొని నిద్రించడానికి ప్రయత్నిస్తూవుండిన ఆవిడ, మా ఆవిణ్ణీ, పిల్లల్నీ ఎగాదిగా చూసి లేచి కూర్చొని చోటిచ్చింది. నేనుకూడా స్తిమితపడి ఓమూల ఒదిగికూర్చున్నాను-ఆపుణ్యాత్మురాలి ఘనకార్యాన్ని మనసులోనే అభినందించుకుంటూ.

అంతా మసకచీకటిగా వుంది. శూన్యదృక్కులతో కిటికీలోంచి తల బయటపెట్టి ఆలోచిస్తున్నాను: కాశీలో ఇన్నాళ్లు వున్నందుకు, చివరకు, నాకున్న మనోబాధ ఏమీ తగ్గలేదని తెలిసింది. ఇంతకీ మా ఆవిడ పోరుపెడితే బయలుదేరాను. పడిన ప్రయాసనూ, వ్యయపరిచిన విత్తాన్నీ చూసుకుంటే వేమన చెప్పిన "ఇంటిలోని పోరు ఇంతింత గాదయా" జ్ఞప్తికివచ్చింది! అర్థంలేని ఆలోచనలతో చాలాసేపు అవస్థపడి, ఎప్పుడు కళ్లుమూశానో తెలియదు. మళ్లా కళ్లు తెరిచేటప్పటికి జనసమ్మర్దం తగ్గినట్లుగా వుంది. అంతకంటే ముఖ్య విషయ మేమిటంటే - మాపిల్లలు మాకుచోటిచ్చిన ఆవిడ చుట్టూ అతిస్వతంత్రంగా చేరి అల్లరిచేస్తున్నారు. మాఆవిడ ఆవిడతో చాలాఆప్యాయంగా మాట్లాడుతోంది. ఆడవాళ్లలో ఎంత ఆప్యాయత వుందీ!

బాగా చీకటిపడింది. రైల్లో దీపాలు లేవు. నిశీథంలోకి యింక చూడలేకపోయాను. వాళ్ల అర్థాంతర స్నేహానికి నాకు ఆశ్చర్యంవేసింది! వాళ్లు చెప్పుకునే అస్పష్టవాక్కులను వినటంకంటే అప్పుడు నేను చేయగల ఉత్తమమైన పని మరి ఏదీ కనుపించలేదు. ఆవిడ ఇలా చెబుతూవుంది:

"నా పెళ్లి నా ఇష్టానుసారం జరిగివుంటే నా జీవితం విషాదాంతం కాకుండా వుండేదేమో! ఆ ముడతలుపడ్డ ముఖాన్నీ, నెరిసిన జుట్టునీ, ఆయనను నా సౌందర్యంతో పోల్చుకొని ఎన్నో వెన్నెలరాత్రులు ఏడుస్తూ, ఒంటరిగా, మేలుకొని గడిపేదాన్ని! రాను రాను గుండె రాయిచేసుకొన్నాను. ఒకవిధమైన తెగింపు, సాహసం, ప్రతీకారవాంఛ నా హృదయంలో ప్రవేశించాయి! మొదట తన అసమర్థతను కప్పిపుచ్చుకునేందుకు ఆయన నన్ను భయపెట్టి కొట్టినా, కాలక్రమేణా నాకు సేవకుడికంటే ఎక్కువగా లొంగిపోయాడు. ఈవిధమైన మార్పువల్ల నే నాయన్ని ఎందుకు గౌరవించాలో బోధపడలేదు!......అది పిరికితనం కాదూ?

కూలివాళ్లలో భార్యాభర్తల్లో ఒకరికొకరు మనలో యిచ్చుకొనే గౌరవాలు యిచ్చుకోలేరు. అయినా వాళ్లు అనుభవించే ఆనందంగాని, హృదయం విప్పి మాట్లాడడంగాని మనం ఊహించనివి!

ఏమయినా—నన్నీ అధమస్థితిలోకి తీసుకొచ్చి, ఏమీ సంబంధం లేనట్లు ప్రవర్తించే సంఘానికిగాని, నేను ఆనందంతో, గౌరవంతో జీవితాన్ని వెళ్లబుచ్చుతున్నానని అందరూ అనుకోవాలని నా నిజఆనందాన్ని నాశనంచేసిన తల్లిదండ్రులకుగాని, వయస్సు దాటినా, పెళ్లిచేసుకొన్నా ననే ప్రతిష్ఠ నిలపడానికి నా యౌవనాన్ని బూడిదపాలు చేయ సాహసించిన నాభర్తకుగాని నా దురవస్థమీద ఎటువంటి సానుభూతీ లేదని నాకు త్వరలో తెలిసింది! దానిమీద నాలో ప్రతీకారవాంఛ ప్రబలంగా నిలిచిపోయింది. 'ప్రతీకారం'—అదే నా జీవితవాంఛ!!"

ఈమాటలు వింటున్నకొద్దీ నాకు ఆ కంఠధ్వని సుపరిచితంగా తోచింది! ఆ చెప్పే విషయాలన్నీ 'వివేచనాశక్తి' తో, పటుత్వంగా వున్నట్లు తోచినయ్. ఆవిడ తళతళ మెరిసే వెండిఫ్లాస్కులోని పాలు కాసిని గొంతులో పోసుకొంది. మా ఆవిడకూడా చాలా శ్రద్ధగా వింటున్నట్లు అగుపడింది!.........

"ఇంతలోనే మా మరిది పెండ్లి వచ్చింది. చాలా మంది స్నేహితులూ, బంధువులూ వచ్చారు. అప్పుడే నా జీవితంలో ఒక మానసిక విప్లవానికి బీజం నాటబడింది. మా మరిది పెండ్లి బాధ్యతలో మా ఆయన పడిపోయినారు.

నేను కృష్ణశర్మను అప్పుడే చూడడం! కండలు కట్టిన శరీరం, పచ్చటి దేహచ్ఛాయ, నిగనిగలాడే నల్లటి జుట్టు, ఆకర్షించి, లోతుగా పరిశీలనచేసే, మెరిసే చిలిపికళ్లు - ఆయనతో మాట్లాడమనీ, పరిచయం చేసుకోమనీ నన్ను వేపుకు తినేవి! నావంక అప్పుడప్పుడు ఆగి, నిదానంగా, ప్రశ్నార్థకంగా చూసేవాడు. చాలాసార్లు సిగ్గుపడి, ఆ చూపుల వేడి భరించలేక పారిపోయే దాన్ని!............"నీ కేమిటి లోపం.........నే నుండగా?" అన్నట్లుండేది ఆచూపు! మా మరిదికి ముఖ్యస్నేహితుడు గాబోలు - ఎప్పుడూ ఆయనదగ్గిరే కూర్చొని మాట్లాడుకుండేవారు.................నిజం చెప్పొద్దూ! ఏదోమిషతో వీలైనంతవరకూ ఆయనను చూచేందుకు నేను ప్రయత్నించేదాన్ని!

పెండ్లి అయిదోరోజున ఆయన నన్ను ఒంటరిగా మేడమీద చూశారు. నే నామన్మథరూపాన్ని మ్రాన్పడి చూడటంకంటె ఏమీ చెయ్యలేకపోయాను. కాసేపు అలానే గడిచింది. తర్వాత మెల్లిగా ఆయన నాదగ్గిరి కొచ్చి నడుంచుట్టూ చెయ్యివేశాడు. ఆ చేతిని నేను తీసివేయలేకపోయాను!! విద్యుచ్ఛక్తి నాలో ఒక్కసారిగా ప్రవహించినట్లు భావించాను. అసలు ఆచేతిని తొలగించే శక్తిని అప్రయత్నంగా కోలుపోయాను. ఆయన నాదగ్గరకు వస్తూవుంటే స్వర్గద్వారాన్ని సమీపించిన ట్లనిపించింది. సిగ్గుతో తల వంచుకున్న నాతలను మృదువుగా పైకెత్తి నాకళ్లల్లో కళ్లు పెట్టి చూశారు. ఎంత గంభీరమైన కళ్లు అవి! అందులో ఎన్నో ప్రేమసముద్రాలు ప్రవహిస్తున్నట్లు తోచింది! నా పెదవుల్లోని ప్రేమమధువును గ్రోలారు. కళ్ల నీళ్లు ప్రవహిస్తూవుండగా "మరిచిపోకండేం" అన్నాను. జయించిన ధీరుడిలాగా "మరిచిపోగలనా?" అన్నాడాయన తన కళ్ల నీళ్లను నా కళ్ల నీళ్లతో కలుపుతూ!......నేను భయపడిన లేడిలాగా అతని హృదయాన్ని హత్తుకున్నాను. అతని శరీరమంతా ఆక్రమించుకొన్నాను... ఆ పండువెన్నెల్లో అతని శరీరసౌందర్యంమీద నాలో ఇన్నాళ్లూ ప్రబలిన కోరికలు విజృంభించి నృత్యం చేశాయి!

నాగస్వరానికి పాము ఆకర్షింపబడినట్లు నేను వశమైనాను!...అతనిది ప్రణయవేదన కాదు!...కామప్రకోపగర్జన!... "బాగుండదు-వెళ్లివస్తా"నంటూ వెళ్లలేక వెళ్లలేక బయటపడ్డాను అతని దివ్యమూర్తినుండి... ఆనాటి దివ్యరాత్రికి...విధిలేక......"

ఇంతలో దీపాలు వెలిగాయి. చూశాను...... సందేహనివృత్తి అయింది! ఆవిడనోటినుంచి "కృష్ణశర్మ" అన్న మాట వినేటప్పటికే నామీద పెద్ద పిడుగు పడ్డట్లయింది! ఆరాత్రి ప్రకృతిగంభీరసౌందర్యంలో నాచేతుల్లో నలిగిపోయింది మాఆవిడతో ఇప్పుడు ముచ్చటించే ఆవిడే. పేపరు మొఖానికి అడ్డం పెట్టుకుని దొంగతనంగా ఆమెవంక తేరిపార చూశాను. అదే ముఖం! అవే ఎఱ్ఱటి చిన్ని పెదవులు! చూడలేను ఆ శరీరాన్ని!...అవును, ధైర్యంగా చూడగల శక్తిని కోల్పోయాను. ఎంత మార్పు?

పిల్లలు అమాయికంగా ఆవిడతొడమీద నిద్రపోయినారు. వాళ్ల ముఖాల్ని చూస్తుంటే సిగ్గేసింది! ఆ చిన్ని హృదయాల్లో ఎటువంటి రాగద్వేషాలూ లేవు! అవి నిర్మలగంగాప్రవంతులు! ఏం చెయ్యను? నేనే ఆ కృష్ణశర్మను. రైల్లోనుంచి దూకనా! ఎందుకీ వేదన?

దీపాలు మళ్ళీ ఆరిపోయినాయి. ఈ చీకటి నా వేదనను కప్పివుచ్చే రక్షణ.

"ఆ ఉదంతం ముగిసినపిమ్మట నేను మళ్ళీ ఈ జన్మలో ఆయన్ని కలుస్తా ననుకోలేదు. మావారు

కాలాకాలం జిల్లా కలెక్టరుగా పనిచేశారు. ఒకసారి ఆయన్ని అకస్మాత్తుగా మరో జిల్లాకు బదిలీ చేయటంతో వెంటనే అక్కడికి బయలుదేరవలసివచ్చింది! నాకు బాగా జ్ఞాపకం. రైలు కదులుతుంటే తొందర తొందరగా మేమున్న కంపార్టుమెంటులోకి ఒక పొడుగాటి యువకుడు ఎక్కాడు! తీరా చూద్దునకదా— "కృష్ణశర్మ"!! బంట్రోతులు నెట్టివేయబోతుంటే నేను వారించాను. నావంకకు జాలిగా, ప్రేమగా, ఆశ్చర్యంగా చూశాడు! నేను కలెక్టరుగారి భార్యనని తెలిసిగాబోలు ఒక్కసారిగా అతనిముఖం వివర్ణమయింది! నవ్వడానికి ప్రయత్నించినా విఫలుడైనాడు. రైలుచప్పుడు వింటూ మేము మూగజీవాల్లాగా గడిపాము. అతడు దిగిపోతుంటేకూడా నేను పలకరించలేక పోయాను. మాఇద్దరిలో చెక్కుకట్టిన గాయాన్ని కదిపినట్లయింది!

అతను కలెక్టరు ఆఫీసులో గుమాస్తాపని చేస్తున్నాడని నాకు తెలియదు. అందులోనూ మాఆయన కనుసన్నల్లో మెలిగే ఉద్యోగమని ఎన్నడూ వూహించలేకపోయాను. ఒకనాడు మాఆయన ఎందుకో ఏదో ఆఫీసుపనిమీదగాబోలు అతనికి కబురుపంపించారు. బంట్రోతుతో "కృష్ణశర్మను పిలుచుకొనిరా" అనడం నాచెవుల్లో పడింది. ఏమిటో నాకు భయమూ, ఉద్వేగమూ, ఆనందమూ కలిగాయ్ అప్రయత్నంగా!! నిముషంలో ముస్తాబు చేసుకొన్నాను. ఒక్కసారి నారాజు నావంక కన్నెత్తి చూస్తేచాలునని ఆరాటపడ్డాను.

అతను నెమ్మదిగా కాలుకాలిన పిల్లిలా వచ్చాడు. ముఖంలో కళాకాంతులు లేవు! కృశించినట్లు అగుపడ్డాడు. మా ఆయన తీవిగా "ఏమోయ్-శర్మా" అనటంతోటి వంగి నమస్కారం చేశాడు. ఎక్కడి నుంచీ వచ్చింది ఆ వినయం ?? ఆ దివ్యరూపాన్ని ఏచీకట్లో దాచాడో !! మా ఆయన పడక కుర్చీమీద కూర్చుంటే స్కూలుపిల్లాడి లాగా చాపమీద కూర్చున్నాడు నా రాజు! రాజరాజు సారంగధరుణ్ణి రాజాస్థానంలో విచారించినట్లుంది ఆ దృశ్యం! నేను చిత్రాంగినా! కన్నీటి వెల్లువని కష్టంతో అపుకున్నాను! ఇందాకటి నుంచీ చాటు చాటుగా ఒంటి కన్నులో చూశాను......ఇంక భరించలేకపోయాను. మెల్లిగా తెర తొలగించి, ముఖాన్ని బయటపెట్టి అతని వంక చూశాను! చాలా సేపటికి తలెత్తి ఆత్రతగా చూసే నా కళ్లల్లోకి ఒక వెర్రిచూపు చూశాడు. "నన్ను క్షమించండి — అపచారం చేశాను" అన్నట్లుంది ఆ చూపు! "ఎందుకమ్మా అలా చూస్తావ్? — నువ్వేం అపచారం చేశావ్?" అన్నట్లు అతని వంక చూశాను. కాని అతనిదగ్గరి నుంచి నేను అర్థం చేసుకోగల సమాధానమేదీ నాకు అందనేలేదు. అదొక విచిత్ర సంఘటన!........

లోపలికి వెళ్లి దిండులో తల దూర్చి భారం తీరేటట్లు ఏడ్చాను! నా స్వామికి నా వేదన తెలియదు! ఈ కన్నీటి వెల్లువని చూసి భరించలేడేమో అని వెంటనే మెల్లిగా లేచి నలిగిపోయిన జుట్టు తిరిగి దువ్వుకొని, వాకిట్లోకి వచ్చేటప్పటికి శర్మ "సెలవు" అంటున్నాడు. నాకు ఏమీ తోచలేదు! దాసీదాన్ని పిలిచి, గబగబా "రేపు సాయంకాలం అయిదింటికి రండి — అన్నీ స్వయంగా" అంటూ ఒక చీటీ వ్రాసి, ఆయన కియ్యమని దానిచేతికిచ్చి పంపించాను. "సరేనన్నా" రని దాసీది వచ్చి చెప్పేవరకు గుండెల్లో రైళ్లు పరిగెత్తినయ్........

మర్నాడు అయిదింటికి భయపడుతూ భయపడుతూ వాకిటిదగ్గర వచ్చి నుంచున్నాడు. "లోపలికి రండి" అన్నాను. తలవంచుకొని "క్షమించమని అడగడానికి వచ్చా" నన్నాడు. ఆ పరితాపంలో ఆముఖం ఎంత అందంగా వున్నదని!! మెల్లిగా చెయ్యి పట్టుకొని లోపలికి తీసుకెళ్లి "ఎందుకూ?" అన్నాను. మౌనం వహించాడు నారాజు! ఆ ముగ్ధమౌనంలో అమూల్య కాలాన్ని వ్యర్థపరచదలచుకోలేదు! దగ్గరికి లాక్కొని బుగ్గల్ని, నుదుటిని పెదవుల్ని నలిపేశాను. అతనిలో సంచలనం కలిగింది! భయపడిన పిల్లాడిలా నన్ను కౌగలించుకున్నాడు. ముద్దులు కురిపించాడు. నా కళ్లల్లో కళ్లు పెట్టి చూడలేకపోయాడు!!

"నన్ను చంపెయ్యరాదూ? ఇలా ఏడిపించకపోతే" అన్నాను. భరించలేక ఒకసారి గంభీరంగా నిట్టూ

ర్చాడు! నన్ను అమాంతంగా ఎత్తుకొని తోటలోకి తీసుకపోయాడు. ఆచెట్లమధ్య చాలాసేపు గడిపాము.

అలాగే ఏకాంతంగా, చింతలేకుండా కొన్ని రోజులు జరిగాయి. ఒకనాడు మేము తోటలోవుండగా మాఆయన నన్ను పిలుచుకుంటూ సరాసరి అక్కడికి వచ్చారు. ఆఅలికిడిని పసిపట్టి శర్మ మెల్లిగా గోడమీకి పారిపోయాడు. కాని మాఆయనకు సందేహంమాత్రం వదలలేదు. ఎవరో వచ్చిపోయినట్లు ఆయన పసిగట్టారు.

అప్పటినుంచి తన అంబేదకేవాన్ని బాగా గ్రహించి తోటచుట్టూ గట్టికాపలా పెట్టారు.

మరోసారి నేనొకచీటీ వ్రాసి దాసీదానిద్వారా పంపించాను. మాఆయన చూసి ఏమిటని అడిగారు. "కూరగాయలకోసం చీటీ వ్రాశా" నన్నాను. నన్ను పోనిచ్చి, ఆయన దాన్ని పిలిచి, చీటీ తీసుకొని చూశారు! ఇంకేముంది? కొంప మునిగింది! ఆయనమనస్సుకు ప్రత్యక్షనిదర్శనం దొరికింది! నా కీవిషయం మొదట తెలీలేదు. ఆయన కడుపులోనే దాచుకుని సమయం కోసం నిరీక్షిస్తున్నారు. మామూలుగానే ఆయన ఆవలిస్తే ప్రేగులు లెక్కపెట్టే మనిషి. నేను నీటుగా ముస్తాబై కనుచీకట్లో "కృష్ణశర్మ"కోసం కాచుకొనివున్నాను. నవవసంతుడిలాగా శర్మవచ్చాడు. "ఎన్నాళ్లు ఈసందిగ్ధమయజీవితం? పెళ్లిచేసుకొని ఎక్కడైనా వెళ్లిపోదాం...నే నింతవరకూ ఎవరివల్లా అపవిత్రురాల్ని కాలేదు"అన్నాను, అతనిసందెలమీద తల ఆనించుకొని తోటలో. అత డెందుకో ఆవేళ అంత సంతోషంగా లేడు! మేమిట్లా మాట్లాడుకుంటుండగా మాఆయన ఉగ్రరూపంతో అక్కడి కొచ్చారు! తేనెతుట్టెమీద రాయి పడినట్లు ఇద్దరూ ఖంగారుగా లేచి విడిపడ్డాము. మాఇద్దరివంకా ప్రచండంగా చూస్తున్నారు! "బుద్ధి లేదూ? ఇదా నువ్వు చెయ్యవలసిన నీచకార్యం"అన్నట్లు చూశారు శర్మవంక! అతను తల వంచుకొని వెళ్లిపోయాడు.

ఇంక ఆరాత్రి నే నాయనచేతిలో చిక్కిపోయి నాను. నేను వ్రాసిన జాబు చూశానన్నారు. నాచర్యలన్నీ తన కవగతాలేనని చెప్పారు. కసిదీరా గంటల కొలదీ కొట్టారు! గాజులు పగిలి, ఒళ్లువలిగి, జుట్టు రేగి ఆయనపాలిట నేను ఒక దయ్యంగా గోచరించాను! చివరకు "వాడేగా. ఛో...నీసంరక్షకుడు! జెగవని, ఏంచేస్తానో చూడు!" అంటూ ఆ రాత్రి నన్ను బయటికి వెళ్లగొట్టి తలుపు వేశారు. కాని అందుకు నేను విచారించనే లేదు!! ఎప్పటికన్నా నాజీవితంలో ఇలాంటి దుర్దశ సంభవిస్తుందని తెలవకపోతే కదా! ఆ చలి రాత్రిలో, ఒంటిబట్టతో, మా లచ్చిని వెంటవేసుకొని "కృష్ణశర్మ" ఇంటికి వెళ్లాను! నాజీవితంలో చివరి ఆశాజ్యోతి యిక్కడే ఆరిపోయింది!!— సరాసరి లోపలికి వెళ్లక కిటికీలోనుంచి తొంగి చూశాను. ఆయన తల్లి గాబోలు, అంటున్నది: "ఒరే... నాయనా...నిజమెంతో కాని నువ్వు కలెక్టరుగారి భార్యతో ఎక్కువగా మాట్లాడుతున్నావని ఎవరో అన్నారురా! పెళ్లయినవాడివి! చిన్నవాడివా, చితక వాడివా? ఇదేం బుద్ధిరా" అంటున్నది. ఆ చిన్న దీపకాంతిలో ఆయన కన్నీరు కార్చడం చూశాను. ఆయన కంపితస్వరంతో ఇలా అన్నారు: "నాకు మెడలు విరిచి పెళ్ళిచేశారు! నే నేం చెయ్యను? నన్ను చంపండి......నరకండి" ఇంక నేను వినలేకపోయాను! శర్మకు పెళ్లయిందని అప్పుడుకాని నాకు తెలియలేదు! ద్రోహి!......అతడు చేసిన ఘనకార్యాన్ని వెల్లడించి అతన్ని "నింద" పాలు చేద్దామనే ఆక్రోశం నాలో ప్రవేశించింది.. ...కాని నాలాంటి ఆ ఇల్లాలి జీవితంలో నిప్పులు పోయడం నా కిష్టంలేకపోయింది! నాజీవితం సంఘం గొప్పగా విలువకట్టే స్థితిలోకిరాదనీ, ఎన్నడూ రాలేదనీ నాకు తెలుసు!

తర్వాత నేను పడిన బాధల్ని చెప్పలేను!... చివరకు క్రైస్తవమతంలో చేరి, వాళ్లదగ్గర విద్య నేర్చుకొని ఉపాధ్యాయవృత్తితో వుంటున్నా నయిదేళ్ల నుంచి!" అని పెద్ద నిట్టూర్పుతో ముగించింది.

"అయితే మీఆయన గతేమిటి?" అంది మా ఆవిడ.

"మొగవాళ్లు కదూ! వారు మళ్ళీ పెళ్ళిచేసుకున్నారని విన్నా" నంది ఆమె. "విశేష మేమిటంటే

కర్మ ఆ ఉద్యోగాన్నే ఎలాగో అంటిపెట్టుకున్నాడని విన్నా!"

నేను బాధతో, పరితాపంతో కుళ్ళిపోయా ఇంతసేపూ! మాటలు శూలాల్లాగా నాహృదయంలో పొడుచుకున్నవి! చీకట్లో మొఖానికి అడ్డం పెట్టుకున్న పేపరంతా తడిసింది.

లైట్లు ఒక్కసారి వెలిగివాయ్. ఇంతలో మాఆవిడ తనఇంటి విశేషాలు చెబుతూ "ఆయనే మావా" రండి. ఒకసారి ఇద్దరూ నవ్వారు! చూచుకున్నా — పేపరు తల్లక్రిందుగా పెట్టి చదువుతున్నానని! ..."ఏమండోయ్ — ఇలా చూడండి" అంది మాఆవిడ. నేను మాట్లాడలేను. కాని ఆమె దగ్గరికొచ్చి "మంచి నీళ్లు కావాలా? — మాటలధోరణిలో మీసంగతే మరిచిపోయాను!" అంటూ పేపరు తొలగించింది. ఇద్దరూ చకితులయ్యారు! నన్నావిడ చూసింది. నే నావిడను చూశాను! మాఆవిడ ఇద్దర్నీ చూసింది! ముగ్గురం మాటల్లేక మూగజీవాల మయ్యాం మళ్ళీ! గొంతు పెగల్చుకొని "నన్ను క్షమించండి — రాక్షసుణ్ణి" అన్నా. ఆవిడ నాదగ్గరి కొచ్చి కళ్లనీరు తుడిచి "అయిపోయింది పోనివ్వండి — మళ్లా ఈ జన్మలో మిమ్మల్ని చూస్తాననుకోలేదు." అంది. ఆఖర రైలుకూతలో నా గుండెమీద తలవుంచి భారం తీశట్లు ఆమె రోదించినవిషయం మాకు వినిపించియుండదు! అది కన్నీరు కాదు! జరిగిన ఘట్టాల స్మృతికి చిహ్నం!...

ఎంతో మాట్లాడా అనుకున్నాం-మాట్లాడుకోలేకపోయినాం!

రైలు స్టేషనులో ఆగింది. ఆవిడ ఛటుక్కున అయిదు పచ్చకాగితాలు మా ఆవిడచేతిలో కుక్కి "పిల్లలకి నా బహుమానం" అంటూ నా వంకకు తిరిగి "ఇదివరకు కామించుకొని, ప్రేమించుకొన్నా మనుకున్నాం!...కాని ఇప్పుడు హృదయపూర్వకంగా ప్రేమించుకొందాం—మన జీవితాలు రెండు సమాంతర రేఖలయినా, మనం పాయలుగా విడిపోయినా మిమ్మల్ని మరిచిపోలేను!...అది నా బలహీనతకావచ్చు... కాని నా చివరి సందేశం—నన్ను మరిచిపోకండేం!" అంది. మా ఆవిడ "ఎందుకండీ ఇది?" అనే మాటల్నీ, నేను విలపిస్తూ పిలిచిన ఆర్తనాదాన్నీ వినకుండానే ఆ చీకటిలోనుంచి మెరుపుతీగలాగా మాయమయింది నా స్వప్నరాణి! నన్ను నిద్రలేపిపోయింది శాశ్వతంగా!

ఆ నిశీథంలోకి చూడలేకపోయాను. నా పాపం పండి, చివరకు చీకటిగా మారిందా అనిపించింది. కళ్లు మూసుకున్నాను! కాని నా వెనుక దయ్యాలూ భూతాలూ పరిగెత్తుతున్నట్లూ, తరుముతున్నట్లూ తోచింది!..."శాంతి" అంటే అర్థాన్ని, అనుభవించటంగాని నాకు తెలియదు! బహుశః...ఎప్పుడో, చిన్నతనంలో అనుభవించినట్లు జ్ఞాపకం!



# ఇంటిపేళ్ల పుట్టుపూర్వోత్తరాలు



— శ్రీ కీర్తి కామేశ్వరరావు —

ఇంటిపేళ్లను గూర్చి యిదివరలో యిద్దరు ముగ్గురు 'భారతి' లో వ్రాశారు. నే నిప్పుడు వీటిలో కొన్నిటి పుట్టుపూర్వోత్తరాలు, అంటే అవి ఎప్పుడెప్పు డెలా పుట్టాయో, ఏఏమార్పులు చెందాయో మొదలగు వివరాలు వ్రాస్తాను.

### "రామావఝ్ఝలు"

ఇదీ ఒక యింటి పేరే. మొట్టమొదట యీ యింటిపేరు గురించే నే నెందుకు వ్రాస్తున్నానో చెప్తాను. మనలో చాలామంది ఏదైనా వ్రాయడానికి ముందుగా ఓం ప్రథమంలో 'శ్రీరామ' చుట్టితీరుతారు. అలాగే నేను కూడ అట్టి పతితపావనమైన రామనామముతో కూడిన యీ యింటిపేరు ప్రారంభిస్తే పుణ్యం, పురుషార్థం, భుక్తీ, ముక్తీ వుంటుందనే తప్ప వేరే కారణం లేదు.

యీ యింటిపేరు ఒక మనిషి పేరునుబట్టి వచ్చింది. ఆయన ఎవరంటే 'కామకోటి' అనే యింటిపేరు గల రామావఝ్ఝలు. ఈయన సుధీమాన్యుడు, సత్యవచనుడు అగుటచే యీయన పేర వంశ ముప్పొంగేటట్లుగా వ్యాసులవారు వరమిచ్చారుట. ఆయన వద్దనుంచి తద్వంశీయులకు 'రామావఝ్ఝలు' అనే యింటిపేరు వచ్చిందని రామావఝ్ఝలు కొండుభట్టు అనే ఆయన 'కపిలగోసంవాదము' అనే పుస్తకమందు ఈ క్రిందిపద్యాలలో చెప్పారు:

క. "ఆ మౌనీంద్రు కులంబున
శ్రీమత్కామకోటి వంశశేఖరు డనుచున్
రామావఝ్ఝలు డనగ సు
ధీమాన్యుం డుదయమయ్యె దేజం బెసగన్.

శా. రామావఝ్ఝలు డాత్మసత్యవచనా
రంభప్రచారంబునన్
రామాధీశ్వరుడే యనంగ వరసే
రన్ వంశముప్పొంగ న
ద్దామప్రేమ జెలంగ వ్యాసముని శ్ర
ద్ధ్యాతుండునై సద్వర
స్తోమంబీయ నొసంగె సర్వజన సం
స్తూయ ప్రభావంబునన్."

యీ కొండుభట్టు ౧౮-వ శతాబ్దిలోనివాడని 'ఆంధ్రకవితరంగిణి' గ్రంథకర్తలు నిర్ణయించారు. యీయన వంశమూలపురుషుడైన పై రామావఝ్ఝలు మన కొండుభట్టున కెనిమిదవతరము వాడై యున్నాడు. కాబట్టి శతాబ్ది ౧-కి ౪ తరములచొప్పున వెనక్కి లెక్కవేసి చూస్తే, యీ యింటిపేరు ౧౬-వ శతాబ్దిలో పుట్టినట్లు తెలుస్తోంది. యింతటినుండి 'కామకోటి' అనే యింటిపేరు 'రామావఝ్ఝలు' అనే యింటిపేరుక్రింద మారిందని నిర్ణయింపవచ్చును. ఇంతకు పూర్వము 'రామావఝ్ఝలు' అనే యింటిపేరు వారెవ్వరూ లేరని కూడ చెప్పొచ్చును.

### "అజ్జరము"

యీ యింటిపేరు ఒక వూరుపేరును బట్టి వచ్చింది. 'ముగ్గళ్ల' అనే యింటి పేరుగల 'కొండుభట్టు' అనే ఒక నియోగిబ్రాహ్మడు వేదాలు తలకిందుగా నప్పచెప్పేటట్లుగా చదివి వివిధ విద్యలచేత గజపతి అనే రాజును మెప్పించి ఆయనవద్ద 'అజ్జరము' అనే గ్రామాన్ని అగ్రహారంగా పుచ్చుకున్నాడు. యీ కాలంలో నియోగులు వేదాలు చదివితే తప్పు. దానాలు పడ్తే మరీ మర్యాదహీనం. పాప మాకాలంలో నియోగులకూ, వైదీకులకూ భేదమేమీ లేదు. ఆ అజ్జర గ్రామ మిప్పుడు గోదావరిజిల్లా తణుకుతాలూకాలో నున్నది. కొండుభట్టు అప్పటినుంచి ఆగ్రామంలో ఉండే

వాడు. అందుచేత ఆయన్ని, ఆయనవంశీయుల్ని 'అజ్జరము'వారని పిలుస్తూండేవారు. యీవిషయాలు అజ్జరపు పేరయలింగకవి తన శిశుయనంబి విలాసపు కృత్యాదిలో యిలా చెప్పాడు:

*క. ధర వచ్ఛారద్వాజాని
గురు గోత్రమునందు బుట్టె గొండన నైర్మ
స్ఫురణాయువు సత్ప్రతిమ
కరముగ నున్నతియు గర్గె ఘన సంగతుడై.

వ. అతండు—

శా. శ్రీరంజిల్ల తెలంగుచున్న గజరా
ట్సింహాసనాధ్యక్షునిన్
ధారాళంబుగ వేదశాస్త్ర బహుని
ద్యార్థీ మెప్పించి యా
వీరాగ్రేసరు డియ్య గొండన మహా
విఖ్యాతిగా గౌతమీ
తీర క్షోణిని నజ్జరంబనగ దా
డెచ్చెన్ మహాగ్రామమున్.

క. అతడు ముగ్గళ్లవంశమున
వర్ధిజనించియు రాజదత్తమై
క్షితి తెలుపొందు నజ్జరము
తేకొని పాలన, మెప్పుకేయ భా
సితగతి నజ్జరంపు కుల
సింధు సుధాకరుడై చెలంగె నా
శ్రితులను బాంధవుల్ హితులు
శ్రీదనరారగ గొండమంత్రియున్."

ఆంధ్రకవితరంగిణిలో వ్రాసినట్లు క్రీ. శ. ౧౪౪౦-౮ ప్రాంతములో ఈ అగ్రహారదానం జరిగింది. కాబట్టి అప్పటినుంచి 'ముగ్గళ్ల' అనే యింటిపేరు 'అజ్జరము' అనే యింటిపేరుక్రింద మారినట్లు తెలుస్తోంది. యింతకు పూర్వము అజ్జరము వారు లేరనవచ్చును.

"ఏనుగు"

యీ యింటిపే రొక జంతువు నామము. పైడిపాటి సింగనమంత్రి వంశములోవాడైన జలపాలామాత్యుడు తన ప్రభువైన గజపతివల్ల ఒక మంచి ఏనుగును, సోమేశ్వరము మొదలైన అగ్రహారాలను బహుమతిగా పొందాడు. ఆసోమేశ్వరము యిప్పటి గోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకాలో నున్నది. ఏనుగును బహుమతి పొందుటచే 'పైడిపాటి' వారు 'ఏనుగు'వారైనట్లు ఏనుగు లక్ష్మణకవి తన సుభాషితరత్నావళియం దీక్రింది సీసపద్యంలో చెప్పాడు:

"పరమేష్ఠికుల్య ప్రభావుండు వాధూలు
డను ఋషిచంద్రుం డొప్పు ననఘమూర్తి
యమ్మునినాథు వంశమ్మన క్షీరాంబు
నిధి సుధాకరుడు జన్మించినట్లు
ప్రభవించి శ్రీ పైడిపాటి సింగనమంత్రి
వంశాగ్రగణ్యుడై వరలునతని
మహిమ సంతానక్రమమునను జలపాల
సచివు డొప్పె బలారి సచివసముడు

గజపతి క్షితిభర్తచే గజముతోడ
నగ్రహారము లతడు పరిగ్రహించి
చెలమి నేనుగువా రన్న యింటిపేరు
గలిగె నతనికి గజలాభగరిమవలన."

యీ ఏనుగు బహుమానం క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతంలో జరిగిందని ఆంధ్రకవితరంగిణీగ్రంథకర్తలు వ్రాశారు. దీన్నిబట్టి క్రీ. శ. ౧౫౦౦ తరువాతను 'ఏనుగు' యింటిపేరువా రున్నట్లున్ను, అంతకు పూర్వము వీరు లేనట్లున్ను తెలుస్తున్నది.

" పైడి గంటము "

ఇది పూర్వం తాటాకులమీద వ్రాసుకోడాని కుపయోగపడే బంగారు కలము. దీన్ని కూడ ఒక యింటిపేరుగా వాడేరు. అదెట్లాగంటే, ప్రౌఢదేవరాయల కాలంలో అబ్బమంత్రి ఒక గొప్ప వ్రాయసకాడు. అతని వ్రాతకు మెచ్చుకొని దేవరాయ లాతనికి ఒక పైడిగంటము పైరిజాగా యిచ్చాడు. అందుచేత అబ్బమంత్రి, అతని వంశీయులుకూడ 'పైడిగంటము' అను యింటిపేరు గలవారైరి. యీ విషయ మీక్రింది పద్యంలో తామరపల్లె తిమ్మయ్య 'కేమధర్మములు' అనే కావ్యమందు విశదీకరించాడు.

*గీ. ప్రౌఢరాయల మెప్పించి రాయసములు
పైడిగంటంబు గొని వ్రాసి భద్రలీల
పైడిగంటమువా రను పద్దు దెచ్చి
యలరె మీతాతముత్తాత యబ్బమంత్రి."

యీపైరిజాకాలము క్రీ. శ. ౧౪౨౩-౫౦ మధ్య అయివుంటుందని 'ఆంధ్రకవితరంగిణి'లో చెప్పబడింది. కాబట్టి 'పైడిగంటము' అనే యింటిపే రాకాల మధ్యమున పుట్టిందని నిర్ణయించొచ్చును. అబ్బమంత్రికి పూర్వము గ్కల యింటిపేరు తెలిసింది కాదు.

బహుశా తామరపల్లె తిమ్మయకవికాలంలో— అంటే క్రీ. శ. ౧౫౭౦-౧౬౧౦ మధ్య (ఆంధ్రకవితరంగిణినిర్ణయప్రకారం) 'పైడిగంటము' అనే యింటి

పేరు 'తామరపల్లె' క్రింద మారింది. యీ సంగతి 'వైశేషసర్వస్వము'అనే గ్రంథంలో ఈక్రింది పద్యం చెప్తోంది:

గీ. "పైడిగంటమువారు నా ప్రబలె కన్న
నంత దామరపల్లెవా రనగ నలరి
కుందనముమీద పరిమళ మొందినట్లు
తిమ్మయామాత్య నీతుల మెమ్మెగాంచె."

తిమ్మయకవి తామరపల్లెలో నుండుటచేకాబోలు పైడిగంటము తిమ్మయకవి తామరపల్లె తిమ్మయకవి అయినాడు. యీసందర్భంలో పైడిగంటమువారితో పాటు 'వెండిగంటము' అనేయింటిపేరువారు కూడ కల రని చెప్తూ, ఈపేరును గూర్చి యింకో విరవిస్తాను.

### " వాసిరెడ్డి "

యీ యింటిపేరొక పౌరుష నామము. క్రీ. శ. ౧౪-వ శతాబ్దిలో అనవేమారెడ్డి రాజ్యం చేస్తూండగా, తన సామంతులు కొందఱు కప్పాలీయక ఎగగొట్టగా, వారిపై తన సైన్యాన్ని తీసుకొని యుద్ధానికి వెళ్లాడు. అంతటా సామంతులంద రేకమై వేమారెడ్డి నిట్లా కోరారు: "మీరూ మేమూ యుద్ధంచేసి వూరికే సైన్యాన్ని తెగలెట్టుకోడ మెందుకు? మీ సైన్యంలో ఒకర్ని పంపండి, మా సైన్యంలో ఒకర్ని పంపుతాము. ఆ యిద్దరి యుద్ధంలో మావాడు గెలిస్తే మీరు కప్పం కట్టను. మీ వాడు గెలిస్తే మేము మీకు కప్పను కడ్తాము"అని అన్నారు. అంతట ఆరెడ్డి అందులకు కాదనలేక, ఎవర్ని పంపుదామా అని ఆలోచిస్తూండగా అతని సైన్యాధిపతియగు సదాశివనాయడు తాను వెళ్తా నని చెప్పగా వేమారెడ్డి 'సరే'అన్నాడు. సదాశివ నాయుడు ఆ కుస్తీలో వానిచేకాకుండ ఏకంగా చుట్టి పెట్టి ఆ సామంతులు పంపించినమిగతా ఎనమండుగురు సైనికుల్ని కూడ చంపేశాడు. తన ప్రతిష్ఠ నిలబెట్టి నందుకు వేమారెడ్డి ఆసదాశివనాయడుకి కొంత రాజ్యం కూడ యిచ్చి కమ్మప్రభువుగా చేశాడు. రెడ్డికి వాసి గూర్చినవాడగుటచే వాసిరెడ్డిసదాశివనాయ డనిరి.తద్వం శీయులప్పటినుంచి 'వాసిరెడ్డి' అను యింటిపేరు గలవా రైరి. క్రీ. శ. ౧౪-వ శతాబ్దికి పూర్వము 'వాసిరెడ్డి'అనే యింటిపేరు లేదని చెప్పవచ్చును. మంచెళ్ల వాసుదేవ కవి తన 'గంధవహము'లో పై ఉదంత మిలా వర్ణించాడు:

"మ. ఘనకీర్తుల్ జగజొబ్బగండ బిరుదుల్
గంభీర భాంకారతీ
ఘనగోత్పాదక కేరలిచ్చి యనకే
మారెడ్డిరాయుడ్ వాసిగా
గనిరాయ్ గావున వాసిరెడ్డి యన నా
ఖ్యం గొంచె నేధాత్మకా
వనినాథాగ్రణి గంకనాథు డతనిన్
వర్ణింపగా శక్యమే"

మఱియు అమగవాది రామయకవి తన ద్రౌపదీ పరిణయంలో యిలా చెప్పాడు:

తే. "వాసి రెడ్డికి నిలుపుటవలన వాట
బట్టి ధాత్రి సదాశివప్రభుని కతని
వంశమున బుట్టువారికి వాసిరెడ్డి
వా రనెడు పౌరుషాల యాహ్వయము గలిగె."

### " చెల్లపిళ్ల "

యీ యింటిపేరు 'మేలుకోట' అనే మారుపేరు గల యాదవాద్రిని వెలసినట్టి చెల్లపిళ్లరాయని నామ మైయున్నది. యీ దేవుడు తనను కొల్చినవారిలో కొందరి భక్తికి మెచ్చుకొని వారికి ప్రత్యక్షమై వారు 'చెల్లపిళ్ల' అనే యింటిపేరుతో ఆయురారోగ్యైశ్వర్యములతో సుఖముగా నుందురుగాక అని వరమిచ్చాడట. ఈ యింటిపేరు తన కిలా కలిగిందని చెల్లపిళ్ల నరసకవి తన వెంకటేశ్వరవిలాసంలో ఈ క్రింది పద్యంలో చెప్పాడు:

"మ. ప్రవరుల్ కొందఱు మేలుకోట గల చె
ల్లపిళ్లరాయండు భ
క్తిసమేతంబున కొల్వ మెచ్చి కరుణో
క్తి స్వగ సాక్షాత్కరిం
చి వరం బిచ్చి మదీయభక్తు లని వా
సింప్రొవగా వారు స
ర్వసమేతంబుల వృద్ధిబొంది రిల చె
ల్లపిళ్లవారై తగన్."

తిరుపతి వెంకటకవులలో ఒకరై వట్టిన్ని, శతావధాన, అష్టావధాన మనేకములు చేసినట్టిన్ని, బుద్ధచరిత్ర మొదలైన గ్రంథాలు చాలా రచించినట్టిన్ని, సింగ సింహాద్రి బిరుదులు గన్నట్టిన్ని శ్రీ చెల్లపిళ్ల వెంకట శాస్త్రిగారు ఈ కవివంశములోనివారే. యీ యింటిపే రెట్లా పుట్టినదీ తెలిసింది కాని, ఆ దెప్పుడు పుట్టిందీ తెలుసుకోడానికి తగిన ఆధారాలు కన్పించుటలేదు. యీ విషయమై శాసనాలూ, గ్రంథాలూ యింకా పరిశోధిస్తే గాని తెలియదు. దేవు డెప్పుడు వెలిశాడో తెలిసినా బాగుండును.

ఇలా వ్రాయాలంటే ఇంకా బోలెడున్నాయి.

# అభిమన్యుడు - పద్మవ్యూహము



— శ్రీ క్రొవ్విడి రామం, ముటుహ్నారి సంగమేశం —

మహాకావ్యలక్షణాల్ని చక్కగా పాటించి, ఉత్కృష్టమైన లక్ష్యాన్ని సాధించిన కవిసార్వభౌముడు తిక్కన. ఉభయకావ్యప్రౌఢి పాటించే శిల్పంలో కూలంకషమైన ప్రజ్ఞను నిర్వచనోత్తరరామాయణరచనాకాలం నాటికే చేకూర్చుకోవడం చేత, శాశ్వతమైన ఆమ్నాయాన్ని ఆంధ్రంలోకి అనువదించేటప్పుడు యీ మహాకవి అపూర్వమైన కళావైదుష్యాన్ని ప్రదర్శించగలిగేడు. భారతయుద్ధంలో భీష్మనిర్యాణానంతరం పద్మవ్యూహం ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తుంది. మూలంలోవున్న అనవసరవివరాలను కుదించి, ప్రధానవిషయాలకు జిలుగద్దీ, మెఱుగుపెట్టి యీయన యీ రసవత్తరఘట్టాన్ని మనకు అందిచ్చేరు. పద్మవ్యూహాన్ని భేదించిన అభిమన్యుణ్ణి తలుచుకున్నప్పుడల్లా పాశ్చాత్యవిషాదాంతనాటకాల్లో వ్యక్తమయే ఒక గొప్ప నాయకుడు (Tragic hero) స్ఫురణకు వస్తాడు. విషాదకరమైన యీ మహావీరుని మరణానికి ద్రోణాచార్యులు పన్నిన కపటక్రమవిధానం కారణమై ఉండగా, వాడుమాత్రం సైంధవునిమీద పడింది. కాగా నేడుకూడా మంచి కార్యానికి ఎవరైనా అడ్డుతగిలితే "ఏమిటీ సైంధవులడ్డు" అని సామెతగా చెప్పుకోడం కద్దు. సైంధవునిమీద నేరారోపణ చెయ్యడంలో మూలానికీ, అనువాదానికీ వైరుధ్యం లేదు. అభిమన్యుని యుద్ధక్రమాన్ని వివరిస్తూ, అతని చావుకు సైంధవుడు యెంతవరకు బాధ్యుడు అనేదే యీ వ్యాసంలో చర్చనీయాంశం.

సర్వసేనాధిపత్యపట్టాభిషేకసమయంలో

"నను భీష్ముని పిదప బలం
బున కెల్లను ముఖ్యుజేసి పూజించితి వీ
వినుతాచరణఫలంబును
గనువాడవు వరము గోరు కౌరవనాథా."

(ద్రోణపర్వం, ప్రథమాశ్వాసం.)

అని రాజరాజు ద్రోణుకు వరం యివ్వగా అతను-

"వరమిచ్చెదేని గోరెద
బరమహితమనర్మపుత్రు బ్రాణముతోడన్
దురమునబట్టి భుజాళీ
కరకౌనిరావలయు మత్కాళంబునకున్."

(ద్రోణపర్వం, ప్రథమాశ్వాసము.)

అని వినయంగా కోరుకుంటాడు. "నీవంటివాడు కూడా ధర్మరాజును చంపకుండా ఊరికే పట్టి తీసుకురమ్మన్నాడంటే, అతనికి శత్రువులు లేరన్న విషయం సత్యం" అని దుర్యోధనుణ్ణి ఆచార్యులవారు హెచ్చరిస్తారు.

మూలంలో —

"అహోస్య ధర్మరాజస్య
శ్వస్తా కశ్చిన్నవిద్యతే,
యదిచ్ఛసి త్వం జీవంతం
కులం రక్షసి చాత్మనః."

అని వుంటే, తిక్కన "అకట యజాతశత్రుఁ డను నప్పులు కిప్పుడు నిక్కమయ్యె" అని అనువదించేడు. అనువాదంలో చేసిన 'అజాతశత్రు' అనే పదప్రయోగం యెంతో సార్థకంగాను, ఉచితంగాను వుండి మూలానికి మెరుగు పెడుతున్నది.

ద్రోణాచార్యుల ఆధిపత్యంకింద రెండురోజులు ఘోరసంగ్రామం జరిగిన తరువాత కూడా చక్రవర్తి తాలూకు యీ కోరిక తీరకుండా వుండిపోతుంది. అప్పుడు దుర్యోధనుడు యోధులందరి సమక్షంలోనూ,

"మ. ..............నిక్కైన జా
    లనివాడందురు నిన్ను, నన్ను గుటిలా
  లాపంబులన్ చెప్పితే
    సిన నీకైనది యేమి యాశ్రితగుణ
  శ్రేష్ఠుండు వంచించునే" (ద్రోణపర్వం)

అని భారద్వాజుణ్ణి యెత్తిపొడుస్తాడు. దానితో అతని మనస్సుకు నొప్పికలిగి—

"ఎవ్వరి చెట్లు నీ సెదనొ
    యేర్పడజాలము లేదు పోరికిం
  గవ్వడి రాక యుండ దొల
    గంగొని పోవగజాలువారి నీ
  కెవ్వరినైన బంపు మిక
    యేటికి నొండొక బుద్ధిసేసెదే
  నవ్వుచు బల్కినన్ ధరణి
    నాథ యశస్యము గల్గనేర్చునే"
(ద్రోణపర్వం)

అని చక్రవర్తికి ధైర్యం చెబుతాడు. సర్వసేనాని యుద్ధకార్యక్రమం నిగూఢంగా వుంచి, ఆచరణరూపేణ నిరూపించడమే యోగ్యంగనుక, "ఎవ్వరి చెట్లు చేసెదనో ఏర్పడజాలదుము" అని అదేదో స్పష్టంగా తేల్చకుండా వుంచేస్తాడు యుద్ధనీతివేత్త అయిన మహాకవి తిక్కన. కాని మూలంలో మాత్రం "అద్యైకం ప్రవరం కంచిత్ పాతయిష్యే మహారథం" అని ప్రతిజ్ఞాసూచకంగానే వుంది. తత్ఫలితంగా, వివిధదేశాల రాజులు దళాలుగాను, రాజకుమారులు కేసరాలుగాను, సేనాపతి వృషుడైన చక్రవర్తి కర్ణికగాను వుండే పద్మవ్యూహాన్ని పన్ని ఆచార్యుడు ద్వారరక్షకుడుగా నిలబడ్డాడు.

కృష్ణుడు ప్రద్యుమ్నుడు, అర్జునుడు అభిమన్యుడు మాత్రమే పద్మవ్యూహాన్ని భేదించే ఉపాయాన్ని తెలుసుకున్నారు. అసలు ప్రద్యుమ్నుడు యుద్ధంలోకే రాలేదు. కృష్ణార్జునులు చెంత వుంటే, ధర్మరాజును పట్టడం అసాధ్యమని తెలిసివుండే కౌరవసర్వసేనాని సంశప్తకులతో యుద్ధానికి కృష్ణార్జునులు వెళిపోయేటట్టు చేసి, వారినుండి ధర్మరాజును వేరుచేసేడు. కాగా ఆ క్షణానికి అక్కడ యీ వ్యూహాన్ని భేదించడం తెలిసినవారు అభిమన్యుడుతప్ప మరెవరూ లేకపోయేరు.

ఇతనైనా వ్యూహంలో దూరబడగలడుగాని తిరిగి వెలుపలకు వచ్చే సాధనాన్ని ఎరగడు. చొరవచేసి కొద్దిగా లోపలికి చొచ్చుకుపోయిన ఉత్తరక్షణంలో ద్రుపదుడు, విరటుడు, పార్షతుడు మొదలైనవారితో అభిమన్యుణ్ణి అనుసరించి వ్యూహాన్ని చెల్లాచెదరుచేసేస్తామని భీముడు యీ బాలవీరుడికి హామీయిస్తాడు. మూర్తీభవించిన వీరరసమా అన్నట్టుగా, మెరుపు మెరసిన చందాన వ్యూహంలో ప్రవేశించి మహార్ణవాన్ని మథిస్తున్న మందరపర్వతంలాగ అభిమన్యుడు వ్యూహాన్ని క్షణకాలంలో గజగజ లాడించేడు. గాండీవిని మించిన పరాక్రమవంతుడని వైరివర్గంవారుకూడా ఒప్పుకున్న మహావీరుడుగనుకను, అక్కడ వున్నవారిలో అభిమన్యునికి మాత్రమే వ్యూహభేదోపాయం తెలుసును గనుకనూ, అతన్ని ఆ కార్యానికి నియమించడంలో ధర్మరాజు ఔచితిని పాటించేడనే చెప్పాలి. విక్రమోచితమైన ఘనకార్యం చేసి వీరస్వర్గాన్ని అధిష్ఠించడంచేతనే కాబోలు యుద్ధానికి వెళ్ళబోయేముందు అభిమన్యుని విషాదాంతాన్ని సూచించే దుర్నిమిత్తాలు కనపడ్డట్టు ఎక్కడా చెప్పలేదు. ఈ విషాదమరణంగురించి స్వల్పంగా సూచనకూడా మూలంలోగాని, అనువాదంలోగాని లేదు.

నిరుపమానమైన శౌర్యపరాక్రమాన్ని విజృంభింపచేసిన యీ మహావీరుని యుద్ధకాండ చదువరిని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుతుంది. బెబ్బులి లేళ్లమందని తరిమినట్టు వేలాదిమహారథుల్ని ఒక్క లేబ్రాయపు యోధుడు వెంటాడి చెండాడుతూవుంటే, సైనికులందరూ తమకళ్లనే తాము నమ్మలేకపోయినారు. అభిమన్యుని మరణంవరకు తిక్కయజ్వ చాలావరకు మూలాన్ని యథాతథంగానే ఆంధ్రీకరించడంచేత వ్యాసమునీంద్రుడే యీ ఘట్టాన్ని రచించడంలో విశిష్టతను ప్రదర్శించేడని చెప్పకతప్పదు.

ఈ యుద్ధంలో పారిపోకుండా బాణంతో అభిమన్యుని ఎదట నిలచి ప్రాణాలు దక్కించుకున్న యోధుడు ఒక్కడూ కూడా లేవడం అతిశయోక్తి కాదు. అభిమన్యుడు వ్యూహాన్ని భేదించినవెంటనే రాజరాజామీదికి దండెత్తగా, చక్రవర్తికి ఎక్కడ

అపాయం వాటిల్లుతుందోనని సర్వసైన్యాధిపతులైన ఆచార్యులవారే—

క. "వరసుగుణ కర్ణకురోత్యం
సురధరణీవల్లభుండకుంఠితగతి మీ
రరుగుం డేయుం డడ్డము
చొరుడు వెరవు లావు నెరయ శూరత మెఱయన్."
(ద్రోణ. ద్వితీయాశ్వాసం.)

అని చేయి వీచి, యెలుగెత్తి అరిచేరు.

కాబట్టి ఆ క్షణంలోనే, అనగా ఎప్పుడైతే సైనికులు వారి నిర్ణీతస్థానాలదగ్గరనుంచి చక్రవర్తిరక్షణార్థం పరిగెత్తివచ్చేరో అప్పుడే వ్యూహం సడలిపోయిందని స్పష్టమౌతుంది.

తరువాత ద్రోణుడు, కర్ణుడు, కృపాచార్యులు, కృతవర్మ మొదలుగాగల మహావీరులంతా ఒక్కసారి విరుచుకపడినప్పటికీ చెక్కుచెదరకుండా అభిమన్యుడు లాఘవలక్ష్యశుద్ధి చిత్రత్వాస్పృథత్వాలు అద్భుతంగా ప్రదర్శించి కౌరవసేన చెంచేరుపడేటట్టు చేసేడు. అతని ఎదుట యీసేనని నిలబెట్టలేక ద్రోణుడు నివ్వెరపడి చూసేడు. ఈ విషయమంతా ద్రోణపర్వం ద్వితీయాశ్వాసంలో ముప్పైఎనిమిదో పద్యం తరువాత తిక్కన అతిహృద్యంగా కళ్లకుకట్టినట్టు వివరించేడు. స్థలాభావం చేత తిరిగీ ఆ వచనాన్ని యిక్కడ ఉద్ఘాటించలేదు. ఉపమేయమైన అభిమన్యుపరాక్రమానికి సరియైనవి రెండు ఉపమానాలు యీ వచనంలో మనకు గోచరమౌతాయి. ఇటువంటి ప్రసిద్ధఘట్టాలు చదువరిహృదయ ఫలకంమీద స్ఫుటంగా ముద్రితమవడానికి ఒకే ఉపమేయానికి చాలా ఉపమానాలు వేసి వచనరచన సాగించడం వ్యాసరచనలోను, తిక్కనగారి కృతిలోనుకూడా మనకు కనపడుతుంది.

తదుపరి దుశ్శాసనుడు, కర్ణుడుకూడా యీ బాలవీరుని ధాటకు ఆగలేక పారిపోయేరు. వృషసేనుడు మూర్ఛపోయేడు. చక్రవర్తిగారి కుమారుడైన లక్ష్మణకుమారుడుకూడా, పాపం, అభిమన్యుకికే తన ప్రాణాల్ని అప్పజెప్పేడు. దుర్యోధనుడికికూడా అదేగతి పట్టడానికి సిద్ధంగా వున్న సమయంలో కర్ణుడు అడ్డుపడ్డాడు. నిశితమైన బాణఘాతాలకి ఓర్వలేక "నాదెస నాడుము వీడు నొప్పించె నిలువందగు నెలవగుట నసమున్డింపక యీలగఱచుకొని యున్నవాడ గాండీవిగలనం గదిసి యెఱుంగుదుమకాద యతని చేయింతసెట్టిదంబుగా"దని మొరపెడతాడు ద్రోణునితో. ఈ మూడురోజుల యుద్ధక్రమంలోను ధర్మరాజుని పట్టుకోలేకపోవడం సరేకదా, సంస్కృతభారతప్రకారం చూసినట్లయితే యీ రోజున ఒక మహారథుణ్ణి చంపుతాను అనే ద్రోణాచార్యులవారి శపథంకూడా యీ పరిస్థితులలో భగ్నంకావడానికి సిద్ధంగా వుంది. కృత్రిమవిధానం అవలంబిస్తేనేతప్ప యితన్ని జయించడం సాధ్యం కాదని, అకస్మాత్తుగా వెనకవుతగ్గి, వెనకనుంచి అభిమన్యుడి బాణాన్ని కొట్టమని ద్రోణుడు కర్ణునికి సూచిస్తాడు. అదేసమయంలో ద్రోణుడు గుఱ్ఱాల్ని, కృపుడు సారథిని చంపేరు. అటువంటి విషమపరిస్థితిలోకూడా ఏమీ చలించకుండా యీ బాలవీరుడు ఆకాశంమీదికి ఎగిరి పైనుంచి యుద్ధం చేస్తాడు. ఆత్మరక్షణకోసం పట్టుకున్న డాలును ద్రోణుడు బల్లెంతో శిథిలంచేయగా పలకని కర్ణుడు పగలగొట్టేడు. తరువాత రథచక్రం తీసుకుని యితను ఎదిరిని డీకొట్టేడు. చేతులో వున్న చక్రాన్ని సడలించడానికి శకుని, కృతవర్మ, కర్ణశల్యముఖ్యులంతా కలిసికట్టుగా కలియబడవలసివచ్చింది. చక్రం పోయిందన్న విచారం లేకుండా అభిమన్యుడు గద తీసుకుని అశ్వత్థామమీదకు వెళితే, అతను రథం విడిచి పరిగెట్టి పారిపోయేడు. అతని రథసారథిమాత్రం అభిమన్యుని కోపాగ్నికి ఆహుతిఅయేడు. ఆచార్యులవారితో సహా అక్షౌహిణీలకొద్దీ వున్న కౌరవసైన్యాన్ని తహతహలాడించిన వీరశిఖామణి సామాన్యయోధుడైన దుశ్శాసనుని కొడుకుచేత చంపబడడం ఔచిత్యానికి భంగమనో, అసంభవమనో, యిద్దరూ ఒకేసారి పరమపదించినట్టు చెప్పేడు తిక్కన.

మూలంలోమాత్రం—

"దౌశ్శాసని రథోత్థాయ
కురూణాం కీర్తివర్ధనః,
ఉత్తిష్ఠమానం సౌభద్రం
గదయా మూర్ధ్న్యతాడయత్,
గదావేగేన మహతా
వ్యాయామేనచ మోహితః,
విచేతా న్యపతత్ భూమౌ
సౌభద్రః పరవీరహా."

అని దుశ్శాసనపుత్రుడే అభిమన్యుణ్ణి చంపినట్టు వ్యాసుడు వ్రాసేడు.

అభిమన్యుని యుద్ధకాండ పరిశీలించినట్లయితే, భారతయుద్ధం జరిగిన పద్దెనిమిది రోజులలోను యింత తీవ్రంగాను, తీక్షణంగాను అర్జునుడుకూడా యుద్ధం చేసినట్టు కనపడదు. ఈ విషయంలో అభిమన్యునితో పోల్చదగ్గవాడు ఒక్క భీష్ముడేనని మా నమ్మకం. సైంధవుడు అడ్డుపడడంనుంచి పాండవులు అభిమన్యునికి సహాయం చేయడానికి రాలేకపోయేరు. ధవకు. కాని నిస్సహాయతవల్లగాని, వ్యూహాన్ని భేదించడం తెలియకపోవడంచేతగాని అభిమన్యుడు యుద్ధంలో మరణించలేదు. అక్రమయుద్ధంలో బలవంతంగా అతన్ని చంపేరు. అందుచేతనే, తిక్కన—

చ. "వనగజ మంబుజాకర మ
వారణ జొచ్చి కలంచి యాడగా
మనమున గొంకులేక కృప
మాలిన బోయలు చుట్టి చంపుచా
డ్పున భవదీయసేన పొరి
పుచ్చుగ జుట్టును ముట్టి పార్థనం
దను వలయించి నిర్దయవి
ధంబున జంపి రనేక సైనికుల్."

అని మొగమాటం లేకుండా వివరించేడు.

సైంధవుడు పాండవుల్ని అడ్డేశనే దుఃఖంచేత గాండీవి విపరీతక్రోధావేశపరుడై మర్నాడు సూర్యాస్తమయానికి పూర్వమే సింధురాజుశిరస్సు శతధా ఛిన్నంచేస్తానని ఘోరమైన ప్రతిజ్ఞ చేస్తాడు. మూలంలో పదిపదిహేను శ్లోకాలలో వివరించబడిన శపథం తెలుగు భారతంలో సంగ్రహరూపాన్ని పొందింది. అన్న ప్రకారం సైంధవశిరస్సును బద్దలుచేయకపోతే మూత్రపురీషాదులకు సంబంధించిన లోకాలకు పోతాననీ, యింకా యీ మాదిరి ధోరణిలో ఏవో అర్జునుడు అన్నట్టు మూలంలో వుంది. తిక్కన వీటిని మరుగుపరచి క్రోధావేశంవల్ల వచ్చిన వాచాలతను ఒకటిరెండు పద్యాల్లోనే సూచించేడు.

సైంధవుడు చేసింది ధర్మయుద్ధం. పగవాడి బలాన్ని పగవాడినుంచి వేరుచెయ్యడం యుద్ధనీతికి విరుద్ధంగాదు. అతనికి ఆ నాడు కలిగిన అప్రతిహతశక్తికి కారణం దైవదత్తమైన వరంకూడాను. ఇంతకూ అశ్వత్థామ, శల్యుడు, కర్ణుడు, కృపుడు మొదలైనవారి లాగ అభిమన్యుని కృత్రిమవధలో యీ సింధురాజు పాల్గొనలేదు. అర్జునుడిచేతా తప్ప మరెవ్వరిచేత చావనంత ప్రబలయోధుడుకూడా కాడు పాపం యీ సింధురాజు. వరప్రసాదం లుప్తమవగానే సామాన్య దేవుడైనా అతన్ని జయించగలడు. అయితే అతని తల నేలకూలచేసినవాడి శిరస్సుకూడా బద్దలవుతుందిగదా అని ఒక ప్రశ్న. సైంధవవధకు మరొక సామాన్యవీరుని ప్రాణం బలికావలసివస్తే దానివల్ల అంత ప్రమాదమేమీ వుండదుగదా అని నా సమాధానం. అనేకమంది పాండవయోధులు యీ సమయంలో యుద్ధభూమిలో హతులవుతూనే ఉన్నారు.

నిజంగా తన కూరిమిశిష్యుని ముద్దుకొడుకని అయినా ఆలోచించకుండా, కేవలం తన పట్టుదలను చెల్లించుకోడానికి ద్రోణాచార్యులు కర్ణునికి కృత్రిమ విధానాన్ని సూచించి బలవంతంగా అభిమన్యుణ్ణి చంపించేరు. కర్ణుడు, అశ్వత్థామ, కృపుడు మొదలుగా గల మహావీరులు యీ అధర్మయుద్ధంలో భాగస్వాములు. ఈ విషయం సమగ్రంగా తెలిసివుండిన్నీ వీరిలో ఎవరినైనా ఒకర్ని చంపుతానని ప్రతిజ్ఞ పట్టకుండా సైంధవుని ప్రాణాలు అర్జునుడు తీయడం శోచనీయం. ఆ వీరవరప్రతిజ్ఞ ఒక కౌరవమహానాయకుని శిరస్సును ఆ మర్నాడు ఛేదించగలిగితే భారతకథ మరొకవిధంగా నడిచేది. అభిమన్యువధలో జరిగిన కృత్రిమం అర్జునుడికి తెలియదనడానికి యెంతమాత్రం ఆధారం లేదు. సైంధవవధకు పూర్వం భూరిశ్రవసాత్యకులకు జరిగిన యుద్ధసందర్భంలో అర్జునుడు "మీ రందరు నట్లకాదె యధర్మపరులయి యభిమన్యు ననుచితంపు జంపు చంపితి" రని చెబుతాడు. ఇంతకూ సహాయం లేకపోవడంచేతగాని, వ్యూహంలోనుంచి తప్పించుకు బైటపడడం తెలియకగాని అభిమన్యుడు వైరివర్గానికి బలిఅయిపోలేదనిన్నీ, ద్రోణాచార్యులు అవలంబించిన కృత్రిమవిధానము, అతని అనుచరుల అధర్మయుద్ధము అభిమన్యువధకు ప్రబలకారణమనీ యిదివరకే మనవిచేసేను. అక్రమానికీ, కుటిలత్వానికీ అవధిలేదు గనక, ఒకప్పుడు పాండవసైన్యం అభిమన్యుని చెంత వున్నప్పటికీ, యీ బాలవీరుని ప్రాణం దక్కించుకునే అవకాశం లేకపోనేమో! కాగా ఘోరమైన శపథం పట్టి సామాన్యుడైన సైంధవుణ్ణి చంపడానికి మహావీరుడైన గాండీవి ఎందుకింత ప్రాముఖ్యాన్ని యిచ్చేడో విజ్ఞులు తెలియజేయ వేడుకోలు.

# టిబెట్టు - రాజ్యాంగ వ్యవహారాలు

— శ్రీ స్వామీ ప్రణవానంద —

టిబెట్టుదేశము "దలైలామా" చే పరిపాలింపబడు చున్నది. "దలైలామా" యన "గురుసముద్రుడు" డని యర్థము. దలైలామా అవతార సాంప్రదాయము క్రీ. శ. ౧౩౮౧-వ సంవత్సరమునుండి ప్రారంభమాయె నని కొందరి యభిప్రాయము. కాని మొట్టమొదటి దలైలామా ౧౩౯౧-వ సంవత్సరమున అవతరించెనని మరికొందరి మతము.

దలైలామా అవలోకితేశ్వరు డను బోధిసత్వని యవతార మని నమ్మెదరు. ఒక దలైలామా మరణించిన వెంటనే అతని యాత్మ మరల గర్భస్థ మగును. దలైలామా మరణానంతరము తరువాతి దలైలామా కనబడువరకు మంత్రివర్గపు సభ యే రాజ్యకార్యములను నిర్వహించుచుండును. రెండు మూడు సంవత్సరము లయిన తర్వాత రాజ్యజ్యోతిష్కుడు దలైలామా యేదిశ నవతరించెనో తెలియజేయును. అప్పుడు మంత్రి వర్గములో నొకడును, ఆస్థాన జ్యోతిష్కుడును, మరి కొందరు పరివారమును దలైలామా నన్వేషించుటకై యతడవతరించిన దిశకు బోయి దలైలామా మరణించిన తరువాత పుట్టిన బిడ్డలకై వెదకుదురు. దలైలామా తల్లి దండ్రులకు, నన్నదమ్ములకు నుద్యోగము లగునుగావున చాలమంది తమ పిల్లలను దలైలామా పదవి కభ్యర్థిగ చూపుదురు. అప్పుడా పిల్లలలో శాస్త్రీయములగు లక్షణములు గల పిల్లవాండ్ర నొకచోట సమకూర్చి మరణించిన దలైలామాయొక్క వస్తువులను కొన్నిటి నితరుల వస్తువులతో గలిపి వానిని విడదీయుటకై వీరిని నియోగింతురు. వారిలో నెవరు పూర్వపు దలైలామా యొక్క వస్తువులను గుర్తింపగలుగుదురో వానిని దలైలామా పదవికి గ్రహింతురు. ఒకవేళ ఎవ్వడైనను నావస్తువుల నొక్కరును సరిగా గుర్తింపలేక పోయి నచో నభ్యర్థుల పేరులను కాగితపు ముక్కలపై వ్రాసి బంగారపు గిన్నెలో వేసి యొక పిల్లవానిచే నొక కాగితపుముక్కను దీయించెదరు. ఆకాగితపు ముక్కపై నెవరి పేరున్న వాడు దలైలామా పదవి కెన్నుకొన బడును. ఆ పిల్లవా డప్పటికి భిక్షువు కాకపోయినచో నతని కప్పుడు సన్యాసదీక్ష నిత్తురు. ఆ పిల్లవానిని రాజ మర్యాదలతో రాజధానియగు ల్హాసానగరమునకు గొంపోవుదురు. నగరమున "పోతలా" యను రాజభవనమున ప్రవేశించుటకు ముందు మంత్రివర్గము మహావైభవముతో నెదురుగ బోయి అతనిని లోన ప్రవేశపెట్టుదురు. తరువాత రెండు మూడు నెలలు గొప్ప సన్నాహములుజేసి విస్తృతములగు కర్మకాండలతో రాజ్యాభిషిక్తునిగ జేయుదురు. అప్పుడు చీనాదేశపు ప్రతినిధిగూడ వచ్చును. ౧౯౦౪-వ సంవత్సర ప్రాంతముల బ్రిటిషు ప్రభుత్వముతో జరిగిన సంధి ననుసరించి బ్రిటిషు ప్రతినిధిగూడ ఈమహోత్సవమునకు వచ్చుచుండుట యాచారమాయెను. పట్టాభిషేక మైనతరువాత నుర్ర డను దలైలామాకు విద్యాభ్యాసమునకై విద్వాంసులగు లామాలను నియమింతురు. ఆధ్యాత్మికము, మతము, రాజకీయము, లౌకికములగు విద్యల నెల్ల గరపి అతనిని సకలవిద్యా పారంగతుని చేయుదురు. అప్పుడు రాజ్యమునకు సంబంధించిన సమస్త కార్యములను అతడే స్వయముగ జూచుకొనును. రాజదర్బారునందు మంత్రివర్గముతోబాటు చీనాదేశపు ప్రతినిధిగూడ నుండును. దేశాంతరములకు సంబంధించిన వ్యవహారములన్నిటి యందు నితనితో సంప్రదించవలసియుండును.

పదుమూడవ దలైలామా డిశంబరు ౧౯౩౩-వ సం.న మరణించెను. పదునాల్గవ దలైలామా సెప్టెంబరు ౧౯౩౯-వ సం.న కనుగొనబడెను. ఫిబ్రవరి ౧౯౪౦ లో సింహాసనమునధిష్ఠించెను. ఇతడు టిబెట్టుదేశమున నుత్తర



అవతారీలామా

మన చీనాపరిహద్దుల నున్న యొక వ్యవసాయదారుని కుమారుడు. ఈతని కయిదు సంవత్సరముల వయస్సు.

—రాజ్యాంగము—

పశ్చిమటిబెట్టునకు ఇద్దరు వైస్రాయిలు గలరు. వారిని "గర్పోనులు", లేక "ఉర్కోలు" అందురు. సీనియరువైస్రాయిని "ఉర్కో-కోంగు" అనియు, జూనియర్ వైస్రాయిని "ఉర్కో-యోక్కు" అనియు పిలుతురు. పశ్చిమటిబెట్టునకు రాజధాని "గర్తోకు". వైస్రాయి లిక్కడ వేసవిఆరుమాసము లుందురు. శీతకాలపు రాజధాని "గర్గుంస". పశ్చిమటిబెట్టు "రుదోకు", "పురంగు-తక్లాకోట", "దాపా", "ఛబంగు"అను



సిమలింగమఠము

నాల్గు రాష్ట్రములుగ (Provinces) విభజింపబడినది. ఒక్కొక రాష్ట్రమున కొక్కొక గవర్నరు గలడు. గవర్నరును "జోంగు", లేక "జోంగ్పోను"అందురు.

వీరుగాక సంతలలో పన్ను వసూలుచేయుటకు "ఛాసా" లను టాక్సుకలెక్టర్లును, "యుంగుఫోంగు" లను గవర్నమెంటువర్తకులును, "తజము, తర్జము, లేక తసము" లను పోస్టుటాఫీసర్లును కలరు. హ్లాసాగర్తోకు నగరముల మధ్య ఇరువదిఅయిదు "తసము"లు గలవు. ఈ ఆఫీసరులు హ్లాసాగర్తోకుల మధ్య గవర్నమెంటు టపాలనుసరఫరాచేయుదురు. ఈ రెండుపట్టణములకు మధ్య తొమ్మిదివందలమైళ్ల దూరముండును. సాధారణపు టపా నలుబదిఅయిదు రోజులలో చేరును. అర్జంటు



సిమలింగమఠములోని లామాలు

టపా పదునైదురోజులలో చేరును. ఏదైన అర్జంటు టపా సరఫరాయగునపుడు ఒక ఏజెన్సీకిని, రెండవఏజెన్సీకిని మధ్య టపామనిషి గుఱ్ఱముపైనుండి దిగకుండగనే తాళము వేయుందురు. మరియు నీ "తసములు" "హ్లాసా", "గర్తోకు"ల మధ్య ప్రయాణముచేయు గవర్నమెంటు ఉద్యోగస్థుల కందరకు ప్రయాణమునకు వలయు యాకులను, గుఱ్ఱములను చుట్టుప్రక్కలనున్న గ్రామముల నుండి సమకూర్పవలయును. తస మను పదము ఉద్యోగికిని, ఉద్యోగి యుండు స్థలమునకుగూడ వ్యవహరింతురు. గడచిన అయిదుసంవత్సరములనుండి హ్లాసానగరమునుండి వివిధములగు ప్రభుత్వకేంద్రములకు నుత్తరములను, బంగీలను పంపుటకు తపాలాదిక్ష లములలో పెట్టబడినవి.

రాజా స్వయముగ సన్యాసి యగుటచే గవర్నమెంటులోని సగముకంటె నెక్కువ యుద్యోగములు సన్యాసులే యలంకరించుచున్నారు. స్త్రీలుగూడ నన్ని యుద్యోగములకు నర్హులు. పశ్చిమటిబెట్టులోని రాజధానియందు, గవర్నరులుండు చోటులలోను నియమితముగ నుండు పోలీసుగాని, సైనికదళముగాని లేదు. ల్హాసాయందుమాత్రము కొన్ని సంవత్సరములనుండి నవీన పద్ధతులపై పోలీసునకు, సైనికదళమునకు క్రమశిక్షణమును గరపుచున్నారు. ప్రజలకందరకు తుపాకుల నుపయోగించు నలవాటుండుటచేతను, వైసన్య లేకపోవుటచేతను రాజ్యమున కవసరమగునపుడు గ్రామములనుండి జనులను పిలుచుకొనిపోవుదురు.

హిందూదేశపు పరిహద్దున లీపులేఖకనుమకు పదునొకండు మైళ్ల దూరములో నున్న తక్లాకోట పురంగు-జోంగునకు ప్రధానస్థానము. గవర్నరుగారి కోట కొండపైన నిమలింగమఠమున కంటె తూర్పుగ నున్నది. దానిలోపల నొక కారాగృహమును, దాని ప్రక్క పెద్దపెద్ద కొరడాలు, సంకెళ్లు, ఉన్ని త్రాడులు వ్రేలాడుచుండును. కోటయున్న కొండ క్రింద నున్న "పేలిథంకా"యను చిన్నని పీఠభూమిపై జూనునెల మొదలు అక్టోబరువరకు సంత జరుగును. ఇచ్చటికి వచ్చు భోటియావర్తకులు పచ్చి యిటుకలతో గట్టిన గోడలపై డేరాలను వేసికొందురు. గోడలలో ద్వారములను, తలుపులను నమర్చుకొని, సంత ముగిసి వెళ్లిపోవునపుడు వాటిని దీసి, వారివారి హుణియా కాతాదారుల ఇండ్లలో బెట్టిపోవుదురు. ౧౯౦౪-వ సం.న బ్రిటిషు ప్రభుత్వమునకు, టిబెట్టుప్రభుత్వమునకు జరిగిన సంధిషరతు ననుసరించి హిందూదేశస్థులెవ్వరును టిబెట్టుదేశమున కప్పుతోనున్న యిల్లు కట్టరాదు.

ఆసంధిలోని మరియొక షరతుననుసరించి పూర్వటిబెట్టులో "గాన్ని"లోను, "యటుంగు"లోను, పశ్చిమ టిబెట్టులో "గర్తోకు"లోను బ్రిటిషువర్తకప్రతినిధులు (British Trade Agents) ఏర్పాటుచేయబడిరి. వీరు ఆయాప్రదేశములలో పెట్టబడు సంతలలోనికి పోవు హిందూదేశపు వర్తకుల కష్టసుఖముల నాలించుటకై నియమింపబడిరని చెప్పుదురు. పశ్చిమటిబెట్టులోని ట్రేడుఏజెంటు సిమ్లానుండి మేనెలలో బయలుదేరి, గర్తోకు వెళ్లి, అక్కడనుండి ప్రధానములగు మండీలకు వెళ్లి మరల గర్తోకు వచ్చి, లీపూలేఖుద్వారా అల్మోరాకు దిగి, నవంబరునెలలో సిమ్లాకు చేరును. అతడు శీతకాలమున సిమ్లాలో నుండును. టిబెట్టులో ప్రయాణముచేయునపు డతనితోగూడ తపాలాఫీ సుండును. దానిద్వారా వారమున కొకసారి ఉత్తరప్రత్యుత్తరములు జరుగును. "మిల్లము", తక్లాకోటనుండి ముప్పది మైళ్ల దూరమున నున్న "గర్బ్యాంగు" అను నీగెండును మానసఖండమునకు దగ్గరగానున్న తపాలాఫీసులు. గర్తోకు బ్రిటిషుట్రేడుఏజెంటు హిందూదేశస్థుడు. గ్యాన్సీ, యటుంగులలోనివారు ఆంగ్లేయులు. గ్యాన్సీలోనున్న ట్రేడుఏజెంటుక్రింద అయిగువందల భటులుగల సైనికదళము గలదు, ఇతడు పంద్రెండుగుర్రములు ఇక్కడనే యుండును. ఇచ్చట నొక బ్రిటిషుతపాలాఫీసు కలదు. హిందూదేశపు తపాలాఫీసు రేటులకే జాబు లిచ్చుటకు వెళ్లును. ల్హాసా, గ్యాన్సీపట్టణములలో టెలిగ్రాఫు, టెలిఫోను ఆఫీసులు గలవు. డార్జిలింగు దగ్గరనున్న కాలింపోంగు ఇచ్చటకు చాల దగ్గరగానున్న హిందూదేశపు పోస్టాఫీసు.

## —నాణెములు—

"టంకా", లేక "టంగా" యనునది టిబెట్టుదేశమందు వ్యవహారములోనున్న వెండినాణెము. ఇది హిందూదేశపు వెండిపావలా దళసరి గలిగి అర్ధరూపాయి పరిమాణము గలిగియుండును. "జవ" అని పిలువబడు అరటంగాకూడ వ్యవహారములో నున్నది. "కర్మా-గా" (౧/౩ టంగా) "షోగంగు" (౨/౩ టంగా) "ఘేక్క" (౨ టంగా) అను నీ రాగి నాణెములు ల్హాసానగర ప్రాంతమునందే అమలులో నున్నవి. అయిదారు సంవత్సరములనుండి కరెన్సీనోట్లను, వెండిరూపాయలు అర్ధరూపాయలును వాడుకలోనున్నవి. హిందూదేశపు రూపాయ లిక్కడ ధారాళముగ మారును. దీనికి టిబెట్టునాణెములకన్న నెక్కువ గౌరవము నిత్తురు. ప్రస్తుతము మానసఖండమున రూపాయికి ఎనిమిది టంగాలను, ల్హాసాప్రాంతములలో పది, లేక పంద్రెండు టంగాలను ఇత్తురు. హిందూదేశపు రూపాయిని "గోర్కా" అందురు. పశ్చిమటిబెట్టునుండి ల్హాసా పోవు ఉద్యోగస్థులు సౌకర్యార్థము తమదగ్గరనున్న టంగాలకు బదులు హిందూదేశపు కరెన్సీనోట్లను తమతోగూడ గొంపోవుచుందురు.

# రూపాయి-స్టర్లింగు

## యుద్ధానంతరపు మారకపు రేటు

•

= శ్రీ సీతంరాజు వెంకటసుబ్రహ్మణ్యశర్మ =

ఆరేళ్ల యుద్ధం మూలంగా మన రూపాయిమారకపు స్థితిలో అనేకమార్పులు వచ్చినవి. మిత్రరాజ్యాలు ఈ ఆరేళ్లూ మన దేశంలో కొన్న సామాను కంతకూ బ్రిటిష్‌స్టర్లింగ్ రూపంలో చెల్లించాయి. ఆ స్టర్లింగు నిలువలను ఆధారంచేసుకుని మన రిజర్వుబ్యాంకు ఎక్కువ డబ్బును చలామణిలోకి తెచ్చింది. ఎక్కువ డబ్బు చలామణిలో వుండి, కొనుగోలుదారుల వస్తువుల (Consumers' Goods) ఉత్పత్తి తగినంతగా వృద్ధిపొందకపోవటము, అసలు వున్న వస్తువులలో కొన్ని సైనికావసరములకు వినియోగింపబడటము, రవాణాపరిస్థితులు సరిగా లేకపోవటము, దేశపరిస్థితులలో విశ్వాసం తగ్గిపోవటంవలన వచ్చిన చీకటిబజార్లు, అనవసరంగా వస్తువులను దాచివేయటం మొదలైన కారణాల మూలంగా వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి అంటే రూపాయివిలువ దేశంలో తగ్గిపోయిందన్నమాట. యుద్ధానికి పూర్వం ఒక్కరూపాయితో మనం ఎన్నివస్తువులు కొనగలిగేవారమో ఈనాడు అన్నివస్తువులు కొనలేకపోతున్నాము. ఇది మన దేశంలో పరిస్థితి.

ఇక విదేశాలలో చూస్తే మనరూపాయి చాలా బలంగా వుంది. మన రిజర్వుబ్యాంకులో ౧౫౦౦ కోట్ల రూపాయీలకు పైగా స్టర్లింగునిలువ వున్నది. కాబట్టి ఏవిదేశపునాణెములోనికి మార్పుటకైనా రూపాయి మారకపురేటు పెరుగుటకు అవకాశమున్నదికాని తగ్గుటకు అవకాశములేదు. కాని రూపాయి-స్టర్లింగుమారకపురేటు శాశ్వతముగా నిర్ణయింపబడుటచే రూపాయి మారకపురేటు హెచ్చలేదు. అంటే యీనాడు ఒక రూపాయి విదేశాలలో యుద్ధానికిపూర్వం ఒక రూపాయి కొన్న వస్తువులకంటె ఎక్కువ వస్తువులను కొనగలదుకాని కొన్నికారణములచే యుద్ధానికి పూర్వం ఉన్నట్లుగానే ఉంచివేయబడింది. కాబట్టి ఒకే మారు మన రూపాయి విదేశాలలో మంచి బలంగానూ, స్వదేశంలో అమితబలహీనంగానూ ఉంది. పైకి ఇది విచిత్రంగా కనిపించినా నిజానికి చాలా గడ్డుసమస్య. ఇట్టి పరిస్థితులలో రూపాయిమారకపు విలువ పెంచటమా, తగ్గించటమా? రూపాయిని స్టర్లింగుతో ముడివేయటం నిజంగా అవసరమేనా? ముందుపరిస్థితి ఏ విధంగా వుంటే మన దేశానికి ఎక్కువలాభకరం అనే ప్రశ్నలు వస్తాయి.

యుద్ధకాలంలో ఒక్కవిషయం తేలిపోయింది. ఇకముందు మన రూపాయికీ, వెండికీ ఏమీ సంబంధం వుండదని. వెండిధరలోని మార్పులనుబట్టి రూపాయి విలువ ఇదివరకు మారుతోవుండేది. కాని రూపాయిలోని వెండిమొత్తమును తగ్గించివేయటంతో వెండిధరతో మన ద్రవ్యసమస్యలకు వుండే సంబంధం తగ్గిపోయింది. ఇదివరకు వెండిధర పెరిగినప్పుడు రూపాయలను కరగించి వెండిగా మార్చి అమ్ముకునేవారు. కాని ఇప్పుడు వెండిధర ఎంత పెరిగినా రూపాయిలను కరగించటం లాభకరం కానేరదు.

ఇప్పుడు మనకు వున్న ౧౫౦౦ కోట్ల రూపాయీల స్టర్లింగు నిలువలుకూడా "స్వేచ్ఛ"గా లేవు. వాటిని మనం ఏవిధంగా కావలిస్తే ఆవిధంగా ఉపయోగించుకోవటాన్కి వీలులేదు. అసలు వాటిలో ఎంత భాగం మనం ఎప్పుడెప్పుడు ఉపయోగించుకోవచ్చునో ఇంకా నిర్ణయింపబడలేదు. కాని వాటిద్వారా మన దేశపు ఆర్థిక సంపత్తిని వృద్ధిపొందించుకోవటానికి

తగిన వస్తువులను కొనుక్కోవాలని మాత్రం మనం ఉద్దేశ్యపడుతున్నాము. ఒకవేళ ఆ స్టర్లింగునిలువ అంతా ఒకేమారు ఉపయోగానికి వచ్చినా, అలా ఉపయోగించుకోవటము మనకే నష్టము. విదేశాలలో - ముఖ్యంగా బ్రిటనులో ధరలు మనదేశంలో ధరలంత పెరుగలేదు. యుద్ధకాలంలో బ్రిటనులో ధరలు ౧౦౦ నుండి ౧౬౬ వరకు పెరిగితే మనదేశంలో ౧౦౦ నుండి ౪౮౭ వరకు పెరిగినవి. అంటే వస్తువులు ఈనాడు మనదేశంలోకంటె బ్రిటనులో చాలాచవుక అన్న మాట. రూపాయి మారకపు రేటును పెంచివేస, అల్లాంటి చవుకవస్తువులు ఈస్టర్లింగు నిలువల ఆధారంతో మనం కొనితస్తే మనదేశంలోని పరిశ్రమలకు ఎంతో నష్టం. ఎన్నో ఫాక్టరీలు మూసివేయబడతవి. ఎంతోమంది నిరుద్యోగులు లైపోతారు. దేశంలో అన్ని వస్తువుల ధరలూ ఒక్కసారిగా పడిపోతవి. అందులో ముఖ్యంగా వ్యవసాయ పరిశ్రమకు చాలా దెబ్బతగులు తుంది. కాబట్టి తాత్కాలిక కారణాలవల్ల పెరిగిన యీ స్టర్లింగు నిలువలను ఆధారంచేసుకొని శాశ్వతంగా మన రూపాయి మారకపు రేటును పెంచటంవల్ల మనకే నష్టం కలుగుతుంది. మన మారకపు రేటులో మార్పు దీర్ఘకాలంలో మన దేశంలో రూపాయియొక్కయు, బ్రిటనులో స్టర్లింగుయొక్కయు కొనుగోలుశక్తినిబట్టి జరగాలికాని తాత్కాలిక కారణాలవల్ల ఏర్పడ్డ నిలువలనుబట్టి మాత్రం కాదు.

మన రూపాయి మారకపురేటును పెంచకూడదు అంటే తగ్గించవలెనని మాత్రం అర్థంకాదు. మన దేశంలో ధరలు విపరీతంగా (విదేశాలలోని ప్రస్తుతపు ధరలతో పోల్చిచూచినా, మన దేశంలో యుద్ధంముందు ధరలతో పోల్చిచూచినా) పెరిగిపోవటంవల్ల రూపాయి విలువ పడిపోయింది. కాబట్టి రూపాయి మారకపు రేటును తగ్గించాలి అనే వాదం మన దేశంలో వుంది. రూపాయి మారకపురేటును తగ్గించటంవల్ల మన దేశంలో ప్రస్తుతం వున్న హెచ్చుధరలను శాశ్వతంగా వుంచటానికి వీలౌతుంది. త్వరలో మన దేశం ఆర్థికంగా పురోగమించగలదు అని వారు చెబుతారు. అందు వలననే రూపాయిమారకపు విలువను ౧ షి. ౬ పె. నుండి ౧ షి. కుగాని, అంతకన్న తక్కువకు గాని తగ్గించిన బాగుండునని కొంతమంది యీమధ్య సూచించారు. పైకి ఆకర్షణీయంగా కనుపించినా ఈ సూచనలో లోట్లు లేకపోలేదు.

మన దేశంలో ధరలు పెరగటానికి కారణాలు ఇదివరకే కొంతవరకు గమనించాము. మన రూపాయి స్టర్లింగుతో ముడిపెట్టబడివున్నది కాబట్టి రూపాయి మారకపురేటులో మార్పుచేసేముందు బ్రిటను దేశములోని పరిస్థితులనుకూడ మనము గమనింపవలెను. ఆ దేశంలో యుద్ధం మొదటినుండి కంట్రోళ్లు విధింపబడియున్నవి. కొన్ని వస్తువుల ధరలను ప్రభుత్వం తక్కువకు నిర్ణయించి వచ్చేనష్టాన్ని తానే భరిస్తోంది. ఇలాంటి సౌకర్యాలు వుండటంవల్ల ఆ దేశంలో ధరలు ౧౦౦ నుండి ౧౬౬ వరకు మాత్రమే పెరిగాయి. కాని యుద్ధం ముగిసింది కాబట్టి ఆ కంట్రోళ్లు సడలించటంతోను, సబ్సిడీలు మానివేయటంతోను బ్రిటనులో ధరలు కొంతవరకు పెరుగు ననుకోవచ్చును; కాని ఇప్పటికన్న తగ్గుటకు మాత్రం అవకాశం లేదు. కాని మన దేశంలోనో? మిత్రరాజ్యాల ఖర్చు తగ్గిపోయి, కంట్రోళ్లు సడలించి, పరిశ్రమాభివృద్ధి చేసి, చీకటిబజార్లు తగ్గిపోయి, విదేశాలనుండి దిగుమతులు జరపటంతో ధరలు తప్పక తగ్గగలవు. తాత్కాలిక కారణాలవల్ల ధరలలో వచ్చిన పెరుగుదల శాశ్వతంగా వుంటుందని భావించి రూపాయి మారకపువిలువను ఆమట్టమునకు తగ్గించటం సమంజసం కాదు.

ప్రస్తుతము ధరలు హెచ్చుగా ఉండుటవలన రైతులు చాలా బాగుపడినారు. పరిశ్రమలు చాలా వృద్ధిపొందినవి. కాబట్టి యిప్పటి ధరల మట్టమును తగ్గకుండ చేయవలయును. కాబట్టి రూపాయిమారకపు రేటును తగ్గించవలె నను ఆలోచన కొందరికి తట్టవచ్చును. ఈసూచననుగురించి కొంతవరకు పరిశీలించవచ్చును. వ్యవసాయదారుల విషయమును ఉదాహరణకు తీసుకొందము. యుద్ధకాలములో వారి పంటలకు మంచిధరలు వచ్చినవి. వారి ఖర్చులుకూడ చాల హెచ్చెను. శాంతికాలములో విదేశములనుండి వస్తువులు దిగుమతిచేయుటచే వారు కొనెడి వస్తువుల ధరలు

తగ్గవచ్చును. అప్పుడు వారి పంటల ధరలుకూడ కొంత వరకు తగ్గినప్పటికీ మొత్తముమీద వారికి నష్టముండదు. కాని రూపాయిమారకపువిలువ తగ్గింపబడితే వారు కొనే వస్తువుల ధరలు తగ్గవు. కాని వారు అమ్మే పంటల ధరలుమాత్రం తగ్గను. ఎందువలనవంటే, మన దేశంలోనికి వ్యవసాయపుపంటలయొక్క దిగుమతి చాలా తక్కువ. వ్యవసాయపు పంటలయొక్క ధరలు దిగుమతి అయ్యే పంటల ధరలనుబట్టికాక దేశములో ఆ పంటలయొక్క ఉత్పత్తి, అవసరములపై ఆధార పడియుండును కాబట్టి రైతుదృష్టితో చూస్తే రూపాయి మారకపువిలువ తగ్గించటం కూడదని తేలుతుంది. నిజానికి రైతులకు కావలసింది ఇప్పుడున్నంత హెచ్చు ధరలు కాదు; వ్యవసాయపుపంటల ధరలకు, పరిశ్రమల వస్తువుల ధరలకు ఇప్పుడున్న సంబంధమును ఇకముందు కాలములోకూడ వుంచుట. ప్రస్తుతం వ్యవసాయ పంటల ఘాతమాదీసంఖ్య ౨౧.౨ వుంటే పరిశ్రమల వస్తువుల ఘాతమాదీసంఖ్య ౨౪.౩ మాత్రమే వుంది. వ్యవసాయపుపంటల ధరలు పరిశ్రమల వస్తువుల ధరలకంటె హెచ్చుగా నున్నంతకాలము రైతునకు లాభము వుంటుంది. కాబట్టి రైతులు కోరదగినది వ్యవసాయపుపంటల ధరలకు, పరిశ్రమల వస్తువుల ధరకు ప్రస్తుతమున్న సంబంధమునే ముందుకాలములో ఉంచటము; అందుకొరకు అవసరమైనచో ప్రభుత్వము వారి పంటలకు కనీసధరలు నిర్ణయించి వచ్చే నష్టమును తానే భరించుకోవటము.

ఇక పరిశ్రమాధికారుల దృష్టితో చూస్తే, రూపాయిమారకపువిలువను తగ్గించి, ధరలను హెచ్చు మట్టములో వుంచుట ప్రతి పరిశ్రమను, దాని పాత్రతను గమనించకుండా ప్రోత్సహించటమే అవుతుంది. అంతకంటె ఏఏపరిశ్రమలు ప్రత్యేకరక్షణకు తగునో విచారించి! వాటికి ప్రత్యేక ప్రోత్సాహమిచ్చుట మంచిదిగదా. ప్రభుత్వానికి పన్నులు చెల్లించేవారి దృష్టిలోకూడా యిలాంటి మార్గమే బాగుంటుంది.

ఇక సెలసరి జీతగాళ్లు రూపాయివిలువ పడిపోటానికి అసలే వప్పుకోరు.

యుద్ధకాలంలో ధరల పెరుగుదలవల్ల లాభం పొందినవారు చాలా తక్కువమంది. వర్తకులు, పరిశ్రమాధికారులు, జమీందార్లు, పెద్దపెద్ద రైతులూ చాలా లాభం పొందారు. చిన్నచిన్న రైతులు, పంటదారులుకాని కూలీలు, సెలసరిజీతగాళ్లు మొదలైన వారికి ఏమీ లాభంలేకపోయింది. దేశంమొత్తంమీద సౌభాగ్యం పొందినప్పటికీ, ఆభాగ్యం కొద్దిమంది చేతులలోనే నిలిచిపోయింది. ఒక్కమాటలో చెప్పాలంటే, యీధరల పెరుగుదలవలన భాగ్యవంతులు మరీ భాగ్యవంతులైనారు; పేదలు మరీ పేదలైనారు. దేశసౌభాగ్య పంపకములోని యీ అన్యాయమైన వ్యత్యాసము ప్రస్తుతము తాత్కాలికముగనే యున్నది. కాని రూపాయిమారకపురేటును తగ్గించి ధరల మట్టమును ఇదేవిధముగా ఉంచుటవలన ఈ అన్యాయమైన వ్యత్యాసము శాశ్వతంగా వుండిపోతుంది.

రూపాయి మారకపురేటును తగ్గించటమంటే మన దేశంలోనికి దిగుమతి అయ్యే ప్రతివస్తువు ధరను పెంచివేయుట యన్నమాట. మన దేశంలోనికి దిగుమతి అయ్యే వస్తువులలో పరిశ్రమాభివృద్ధికి ముఖ్యంగా కావలసిన యంత్రసామగ్రి వుంటుంది. యుద్ధానంతర కాలంలో యీ సామగ్రి మరింత ఎక్కువ కావలసి వుంటుంది. అప్పుడు వాటి ధరను పెంచివేస్తే మన పరిశ్రమలు త్వరగా వృద్ధిపొందలేవు. అట్టి పరిస్థితులలో పరిశ్రమలను వృద్ధిపొందించాలంటే ప్రభుత్వము ఎక్కువడబ్బును చలామణిలోనికి తెచ్చి ఇన్ఫ్లేషనునైనా వృద్ధిచేయాలి; లేకపోతే యింకా అప్పయినా చేయాలి. కాబట్టి రూపాయి మారకపురేటు తగ్గించటం వలన మన ఆర్థికాభివృద్ధి కుంటుపడనైనా పడుతుంది; లేదా ఎక్కువ నష్టకరమైనా అవుతుంది.

ప్రస్తుత పరిస్థితులలో చేయవలసింది యుద్ధకాలపు ధరలను నిలబెట్టటమూ కాదు; అందుకొరకై రూపాయి మారకపు విలువ తగ్గించటమూ కాదు. విదేశాలలో-ముఖ్యంగా బ్రిటన్‌లో ధరలలోని మార్పులను గమనించి వీలైనంతవరకు ఆ ధరలమట్టమునకు మన దేశములోని ధరలమట్టమును తగ్గించాలి. అందువలన మారకపు రేటులో మార్పుచేయవలసిన అవసరం పోతుంది. ఉదా

వారణకు: బ్రిటన్‌లో యుద్ధానంతరం ధరల ఘాత సూచీసంఖ్య ౧౬౦-౧౮౦ లో నిలిచిపోవచ్చును. అప్పుడు మన దేశంలోని ధరల మట్టమునుకూడ ఘాత సూచీ సంఖ్య ౧౮౦-౧౯౦ వరకు తగ్గిపోవునట్లు దించి అచ్చట నిలుపుటకు తగుప్రయత్నము చేయవలెను. యుద్ధం పూర్వము ధరల ఘాతసూచీ సంఖ్య ౧౦౦ కాబట్టి ఇప్పుడు మనం నిలుపగల మనుకొన్న ఘాత సూచీ సంఖ్య ౧౮౦-౧౯౦ కాబట్టి ఆ వచ్చిన ౮౦-౯౦ పెరుగుదలను పైన సూచించిన ప్రకారం పంటల ధరలు, పరిశ్రమల వస్తువుల ధరల మట్టములలో సవరించవచ్చును. అప్పుడు పంటలధరల ఘాతసూచీ సంఖ్య ఏ ౨౦౦ లోనో వుండి పరిశ్రమల వస్తువుల ఘాతసూచీ సంఖ్య ౧౫౦ వుంటే వ్యవసాయం చక్కగా అభివృద్ధి పొందటానికి అవకాశం వుంటుంది.

ఇంతవరకున్నూ రూపాయి - స్టర్లింగు సంబంధం వుంటుందనే మనం భావించాము. బహుశః యుద్ధానంతరం కొంతకాలంవరకు వేరుమార్గం లేకపోవచ్చును. ఈనాడు రూపాయిని దేశంలో బంగారంలోనికి మార్చటానికి తగినంత బంగారం మనవద్ద లేదు; వున్నప్పటికీ అట్లా చేయటం ఆర్థికవిషయాలలో వెనక్కుపోవటమే అవుతుంది. అంతర్జాతీయంగా, అంతర్జాతీయ బ్యాంకులో మనకు సభ్యత్వము ఉండనేవున్నది. కాబట్టి రూపాయికి వెండితో పోయిన సంబంధంగాని, బంగారంతో లేని సంబంధంగాని కల్పించటం అనవసరం. రూపాయిని అమెరికను డాలరుతో ముడిపెట్టవచ్చునని కొందరంటారు. కాని మన దేశానికి బ్రిటిషు సామ్రాజ్యంతో ఎక్కువ వర్తకం ఉంది; మనకు పెద్ద స్టర్లింగు నిలువలు ఉన్నవి; యుద్ధానంతరం డాలరువిలువ ఎంత నిలకడగా వుంటుందో స్టర్లింగు విలువ అంతే నిలకడగా వుంటుంది. మన రూపాయిని ఏ ఇతరనాణెంతోనూ ముడిపెట్టకుండా స్వతంత్రంగా వుంచాలనేది నిజంగా మన అందరి కోరిక. కాని స్టర్లింగునిలువల విషయం తేలేవరకూ, మారకపునిధికి తగినంత బంగారమూ, విదేశనాణెముల నిలువలూ మన రిజర్వుబ్యాంకులో లేనంతకాలమూ అది సాధ్యపడదు. కొద్దికాలంలో అది సాధ్యపడకపోదు. అప్పుడు ఆసియాఖండంలోకల్లా రూపాయి మిక్కిలి బలవంతమై, నిలకడైన మారకపువిలువ గలదైన నాణెమై వుంటుందని మనం ఆశించవచ్చును. కాని అంతవరకూ మనము స్టర్లింగును అంటిపెట్టుకుని ఉండవలసినదే. కాని వెంటనే చేయవలసిన పనిమాత్రము ఒకటి ఉన్నది. అది రిజర్వుబ్యాంకులో ఉండదగిన స్టర్లింగుయొక్క మొత్తమును నిర్ణయించుట. ఇట్టి కట్టుబాటు లేకపోవుటవలన రిజర్వుబ్యాంకు స్టర్లింగును అంతులేకుండా నిలువచేయుంచి, మన దేశములో చలామణిలో ఉన్న ద్రవ్యమును పెంచివేయుటకు వీలగుచున్నది. కాబట్టి జాతీయప్రభుత్వం యొక్క మొదటివిధి రిజర్వుబ్యాంకులో ఉండదగిన స్టర్లింగు మొత్తమును నిర్ణయించుట. అట్టి నిర్ణయము చేసినచో రూపాయిమారకపువిలువ స్టర్లింగులో ముడిపెట్టబడినను మనకు నష్టము లేదు.



# కామయ్య

[కథానిక]



— శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న —

"పాపం, ఎంత గౌరవంగా బ్రతికినవాడికి యెలాంటి గతి పట్టింది! అబ్బ! పరాయి వాడికయినా వద్దు బాబూ యిటువంటి కష్టం! అసలు యిటువంటి పరిస్థితులు వాస్తవికంగా తటస్థిస్తాయని అనుకోలేదు సినీమాలలో చూడడమే తప్ప—" యీ మోస్తరుగా అనుకుంటున్నారు ఆవేళ సిటీక్లబ్బులో. సంగతి తెలుసుకుని నిశ్చేష్టుణ్ణి అయిపోయేను.

కామయ్యగారు హైస్కూల్లో తెలుగు మేష్టరు. ఆకీతిగా వచ్చే నలభైరాళ్ళకీ ప్రయివేట్లవల్ల మరో పదిహేహేణాలు జమచేసి యెలాగో సంసారవారధి కడుతూ ఉండేవాడు. ఏడాదికి రెండు ఖద్దరుధోవతుల చాపులు, నాలుగు లాల్చీలు, రెండు తుండుగుడ్డలతో సరిపోయేది అతనికి. సంసారం చాలా గుట్టుగా జరిగిస్తూ ఉండడంవల్ల నయితేనేం, తన సుగుణ సంపదవల్ల నయితేనేం, సాటివారిలో 'ఓ' అనిపించుకున్నాడు యిన్నాళ్లూను. మూడో పది దాటిందో లేదో కాని మూడు యాత్రైలు గడిపినవాడికయినా వుండదు అతనికి ఉన్న చాకచక్యం, వ్యవహారజ్ఞానమున్నూ. ఎటువంటి మేష్టరుకయినా స్టూడెంట్లు పునర్నామకరణం చేసి పీఠిని పెట్టకమానరు. కాని కామయ్యగారికి మాత్రం ద్వితీయ నామకరణ మహోత్సవం జరగలేదు; సరికదా ఆయనంటే అందరికీ ఎంతో భక్తి, గౌరవమున్నూ. ఛందస్సు చెప్పమని కొందరు, తమ వ్యాసాలు దిద్దిపెట్టమని యింకొందరు, కావ్యకళాచర్చలతో మరికొందరు—యథాభిరుచిగా ఆయనకి పనికలిగించి ఆయన సహోథుం వల్ల కృతార్థులయేవారు. రసికతగూడా ఎరిగినవాడవడంవల్ల ఆయనకి తరుచుగా భావకవులతోటీ, అధివాస్తవికతావాదులతోటీ వాగ్వివాదాలు జరుగుతూ వచ్చినా, ఆ చర్చలవల్ల ఉభయపార్టీలకీ విజ్ఞానదోహదమే ఏర్పడేదికాని యీమాత్రమయినా విరోధభావం ఉండేదికాదు. అంచేత మావూళ్లో విద్యాసంస్థల సభలు అతని ఉపన్యాసం లేకుండా జరిగేవి కావు యెప్పుడూను.

అన్నివిధాలా అతనికి తగిన యిల్లాలు లింగమ్మగారు. కాపరానికి వచ్చిన యీ పది పన్నెండు యేళ్లనుంచీ ఆమె ఎవ్వరినీ పల్లెత్తుమాట అనిగాని, అనిపించుకునిగాని ఎరగదు. వాకట్లోది సహితం లింగమ్మగారి యింటిపని చేస్తేనేగాని యింకేపనీ ముట్టుకునేది కాదు. ఇక స్కూలుపిల్లలకి మాతృభక్తి! ఆదివారం మధ్యాహ్నాలు మేష్టరుగారింటికి వెళ్లినవాడు ఎవ్వడూ ఉప్పుపిండో, జంతికలో, పొంగరాలో నములుతూగాని విద్యావ్యాసంగం చేసేవాడు కాడు. ఆ ఉప్పుపిండిలో పడ్డ కరివేపాకు, కొబ్బరికోరు, జంతికల్లో జీలకర్రపాయ, పొంగరాల్లో పచ్చిమిరపకాయ తలుచుకుని లింగమ్మగారి పేరు ఎంతమంది చెప్పుకోలేదు! ఆ సందర్భంలో హోటేళ్లలో తాము డబ్బు తగలేస్తున్నామని ఎంతమంది విసుక్కోలేదు!

కాని యింతట్లోకే యుద్ధం వచ్చిపడింది. గొప్ప భాగ్యవంతులనిపించుకున్నవాళ్లు కూడా "కాటకం" అంటూ తహతహలాడిపోయేరు. ఈ ఇస్కూలు మేష్టరు ఒక లెఖ్ఖా! రెండేళ్లనుంచీ మరీ దుర్భరమయిపోయినాయి ఆర్థికపరిస్థితులు. అప్పటికప్పుడే లింగమ్మగారి

కంచె, గట్టిగడియాలు రెండుసార్లు తాంకుకు వెళ్లి ఎలా
గో తిరిగివచ్చి, మళ్లీ మూడోమారు వెళ్లి యింక యింటి
పట్టు చేరమని శిక్షించుకొంటున్నాయి. నానాటికీ
అప్పులపా లయిపోయినాడు బ్రాహ్మణుడు. మార్వాడీ
వాళ్లు మన మేనమామకొడుకులా ఏమిటి? భార్య
మెడలో కట్టవలసిన పుస్తె బంగారం మెళ్లో కడతారు
వాళ్లు. పొద్దస్తమానం లెక్కలు సరిచూచుకోవడమూ,
రావలసిన బాకీలు రాబట్టుకోడానికి యత్నించడ
మున్నూ. అవి కాస్తా వసూలుకాకపోతే కోర్టుకెక్కు
తారు. పైగా పాముపగ! చూస్తూఉండగా కామయ్య
గారి కేసు విచారణకావడం, ఆరునెలలు శ్రీ కృష్ణజన్మ
స్థానప్రాప్తి లిఖితమయిపోవడమూ జరిగేయి. లింగమ్మ
గారి చెవి నీవార్త పడగానే శిలాప్రతిమ అయిపో
యింది. యిటువంటి మనఃప్రవృత్తినేకాబోలు అశ్రువుల
కందని విచారం అన్నాడు వర్డ్సువర్తు. రెండునిముషాల
వరకూ చైతన్యరాహిత్యమే నంటే నమ్మండి. తరవాత
ఏడుపులూ, ఓదార్పులూ యథాక్రమంగా జరిగేయి.
విద్యార్థులే తోడుపడ్డారు చాలావరకు; తలుచుకుంటే
వాళ్లు చెయ్యలేనిది ఏముందికనక; కిష్కింధ!

ఎవ రెన్నివిధాల సాయపడితేనేం? ఆవుని
గోలెందగ్గరికి తీసుకువెళ్లగలంకాని కుడితి త్రాగించ
గలమా? లింగమ్మగారు నాటినుండీ గతం, ప్రస్తుతం
తలుచుకుని ప్రాణాహుతులుకూడా పరిత్యజించింది.
కంటికీ మంటికీ సంతతధారగా అశ్రుకణాలు రాలుస్తూ
అశోకవృక్షంక్రింద సీతామ్మవారిలాగ కూర్చునేది.
మంగళసూత్రం గళభాగాన్ని అలంకరించిందిమొదలు
ఆమె పతిసేవ చేసుకునిగాని ఏ పనీ ముట్టుకునియెరగదు.
అటువంటి మహాయిల్లాలికి భర్తృవదనావలోకనమే
కరువైపోయింది. ఆయన యింట లేడు. బయట వారిని
చూడాలంటే మూడుమైళ్లు ప్రయాస, పాదచారం చేసి
రావాలి. అప్పుడయినా లభ్యముహూర్తం అరుణోద
యాన్న అరఘంట, సూర్యాస్తమయాన అరఘంట
మాత్రమే. ఇహ జెయిలుకావలివాళ్లయితే సాక్షాత్తూ
యమకింకరులే. కర్ణకఠోరంగా 'ఖణేల్'మని బయట
గేటు యినుపతలుపుల చప్పుళ్లు ఆమెకి హృదయవిచ్ఛేద
కంగా పరిణమించడం నిత్యానుభవ మయిపోయింది.
అయినా అమాయకురాలు, పతివ్రత; తన భర్తనిర్దోషి
త్వాన్ని త్రికరణశుద్ధిగా విశ్వసించింది. కాని కాలం
కాలకూట విషస్వరూపంగా వచ్చి, పావకతుల్యుడయిన
పతిని పతితునిగా మార్చివేసింది. "ఏమీ అప్పు కాదనడం
లేదు. నెమ్మదిగా తీరుస్తాను. నా చేతుల్లో ఉన్నంత
వరకూ ప్రయత్నంచేస్తూనేవున్నాను" అని వారు ఎన్నో
విధాల బ్రతిమాలుకున్నారు. కాని వారి నిష్కాల్మష్యం
లోకం కనిపెట్టలేదు. న్యాయస్థానంలో అన్యాయం
ప్రబలింది. ఔదార్యకాంధులకు ధనమదాంధుల సంప
ర్కం కలిగితే యింకా పట్టపగ్గా లుంటాయా!

ఆమే, ఆ ఆరేళ్ల చిన్నపిల్లడూ అనునిత్యమూ
అక్కడికి పోతూఉండడంవల్లనేకాబోలు ఆ జెయిలు
చాపరాళ్లు అరిగిపోయి అక్కడక్కడ గుంటలుపడ్డాయి.
తీరా వచ్చినతరవాత, వచ్చినంతకాలమయినా, కాం
తుని కాంతిరోచిస్సులలో వున్నట్టగపడదు. యింత
లోకే చెవులు గింగురుమనేటట్లు గంట మ్రోగుతుంది.
నీలియూనిఫారంసిపాయి, కోరమీసాలు ఎగదువ్వు
తుంటూ నిప్పులుకక్కే కళ్లతో హెచ్చరిస్తాడు వెళ్లిపో
మని; లాఠీతో గేటువైపు చూపిస్తాడు. క్షణకాలం
జాలమయితే దైన్యానికి తోడు మానభంగం కూడా
తప్పదు. భర్తనిర్దోషిత్వం, నిస్సహాయత, అవ్యాజాను
రాగం రిక్తచూపులోనే కనపిస్తుంది. రాతిగుండెతో
చాపరాతి మెట్లు దిగేదిగడంతోనే కాలమేఘాలు ఉరిమి
నట్టు ధ్వనించి జెయిలుగేటు సతీపతులను ఎడబాటు
చేస్తుంది. ఎన్నోసార్లు, దినమల్లా ఆవేదనాభరితహృద
యంతో బాధ పడిపడి, బహుఆత్రుతతో భర్తృసన్నిధి
నాశించివచ్చి, తీరా వచ్చేకక్షయింకా ఒక ఘంటవుగాని
ఆమె లోనికి పోవీలుకాదని తెలుసుకుని నిట్టూర్చేది.
అటువంటి సమయాల్లో దిక్కుమొగంతో నదీతీరానికి
పోయి, వంతెనకిట్టగోడమీద పిల్లడిని కూచోబెట్టి,
నదీమతల్లిగర్భాన్న ప్రవహించే ప్రశాంతతరంగాలనీ,
వాటిపై వస్తుసంచారభారంతో వయ్యారంగా తేలి
యాడుతూన్న తెప్పలనీ చూపించి ఎలాగో కాల
యాపన చేయగలిగేది ఆ మాతృహృదయం. కాని పిల్ల
వాని చూపుల్లోగాని, చేష్టల్లోగాని ఏమీ మార్పు కన
పడకపోగా పొంగిపొరలే వేడికన్నీళ్లని పైటచెరగులో

దాచుకో ప్రయత్నించేది.' ఎన్ని వింతవస్తువులు చూపించినా, ఎన్ని మరిపింతాలు పెట్టజూచినా, వచ్చీరాని జ్ఞానం గల ఆ అర్భకుని స్మృతిపథంలో ఏమీ చలనం కనపడేది కాదు. ఎంతసేపూ తండ్రి దగ్గిర లేడనీ, తల్లి కటికదరిద్రం అనుభవిస్తున్నదనీ చెప్పరాని, చెప్పలేని ముద్ర పడిపోయినట్టుండేది ఆ బాల హృదయం. రాత్రింబవళ్లు ఆ అమాయికుడు తల్లి ఒడిలో కూర్చుని, ముక్తాఫలాలవంటి ఆమె అశ్రుకణాలను చూచిచూచి, ఇంక భరించలేక ఏమూలకో పోయి వెక్కివెక్కి ఏడ్చి ఆ ఏడుపులోనే నిద్రపోయేవాడు. జ్ఞానం వచ్చినదగ్గరనుంచీ, ప్రాపంచికదురవస్థలన్నీ—ఆకలిదారిద్ర్యాలతో సహా—వెంటబట్టిపోయేయి అతనికి. అతనికి బాల్యావస్థలక్షణాలు పట్టినా, ఆ వుండవలసిన కోమలహృదయం, ఆ దరహాసచంద్రిక, ఆ తళుకు కన్నులమాత్రం లుప్తమయినాయి అతనిలో.

రోజురోజూ దుర్భరగర్భవేదనగా పరిణమిస్తూన్న యీ పసిపాపని అవస్థాభేదాలు తల్లిదండ్రులు గుర్తించకపోలేరు. ఉదయసాయాహ్నాలు కలుసుకున్నప్పుడు వారి దీనదృష్టులే పరస్పరంగా హృదయకుహరాల్లో మానని గాయాలను కల్పించేది. పైకి మాత్రం ఏమాటా అనడానికి ధైర్యం చాలేది కాదు. ధీశాలి, శక్తిమంతుడు, మేధావి, భర్త; చీకటి కోణంలో ఆ అనారోగ్యపరిసరాలలో యినుపకమ్మీల వెనక యెందుకూ పనికిరాకుండా పోతున్నాడు. ఆ కృశాంగికోమలహృదయం భౌతికమానసిక బాధలతో క్రుంగిపోతోంది. బాలుని వదనారవిందం వాలిపోతోంది.

ఆనాడు కార్తికపౌర్ణమి. తెల్లవారుఝామునుంచీ స్త్రీసమూహంతో నదీతీరం కిటకిటలాడుతోంది. స్నానాలు చేసుకుని, అరటిదొప్పలలో దీపాలు పెట్టి నదీమతల్లి గర్భమందుంచి తమతమ భక్త్యతిశయాన్ని నివేదించుకుంటున్నారు అందరూను. అవ్యక్తమధురంగా వుంది పాటలు పాడుతూన్న స్త్రీజనకంఠధ్వని. దీపసాన్నిధ్యాన్ని బంగారుకలువమొగ్గలలాగ ప్రకాశిస్తున్నాయి దొప్పలలోని దీపికలు. కఱుకుదనపు శీతవాయువులు పెదిమలు కొరుకుతుంటూ, శృంగసంగీతంతో విటపంచారాన్ని సాగిస్తున్నాయి. ఇదంతా చూసీ, పెల్లుబ్బుగా వచ్చుచున్న దుఃఖాతిశయానికి బలైరై, నిర్జీవమయిన యంత్రపు బొమ్మలాగ వెళుతోంది లింగమ్మగారు. దుక్కిదున్నినట్టు పాదాలు ధూళిధూసరితపూరా అయినాయి; చలిగాలికి పగుళ్లు వేసి మడమలు రక్తాలుకారుతున్నాయి; అతిశీతలమయిన శీతలానికి అవయవాలు తిమ్మిరిలెక్కాయి. అయినా ప్రకృతికీ, తనకూ సంబంధం లేనట్టే నడచిపోతోంది ఆమె; వెళ్లినకొద్దీ దూరానికి అంతు కనపడడం లేదు. అదుగో, అరుణోదయరాగంలో జెయిలు యినుపగేటు శ్మశానవాటికలో కుండపెంకులాగ కనిపిస్తోంది.

సరిగా దరిచేరుకునేసరికి తలుపులు తెరిచేరు. ఈమె ఒంటరిగా రావడం చూచి అక్కడ వున్న ముసలిజవాను ప్రశ్నార్థకంగా చూచేడు. రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుని విసవిస వెళ్లిపోయింది శిశువిహీన. అప్పుడర్థమయిందతనికి తొలినాటి సాయంకాలం యీమె యెందుకు రాలేదో! కుప్పలాగ కూలబడి పోయేడు సెంట్రీ...... "చచ్చి స్వర్గాన వున్నాడు. బ్రతికి యేం బావుకోవాలికనక?" అంటుంది మూర్ఖప్రపంచం. లోకం గ్రుడ్డిది, జ్ఞానరాహిత్య మయినదిన్నీ. ఖర్మంచాలక, పరిస్థితుల ఒత్తిడి కలిగినంతమాత్రాన తనని తృణీకరించి నిరసించి క్షూణపరిచింది అది- మొదట్లో తనవల్ల మేలుపొందీకూడాను. నా అన్నవారు యెవ్వరూ లేక, సాటివారిలో తల యెత్తుకు తిరగలేక, అన్యాయమయిన అవమానాన్ని హృదయం చంపుకుని భరించుకువస్తూన్న ఆదంపతులకు ఆ చంటి పాపడి జిలిబిలిపలుకులే ఉపశమనవచనాలు. ప్రపంచమంతా పగబట్టినా తమ శిశువుమాత్రం నిష్కల్మషమయిన భక్తి అనురాగాలతో మెలుగుతున్నాడనే అనిర్వచనీయమయిన తృప్తభావమే వారికి ఒక పట్టుగొమ్మ, ఒక్క ఆశాలత, ఒక సౌఖ్యం, ఒక వెర్రిఆనందం! ఆ బాలుని ముఖం చూచి ప్రాతికూల్యాలన్నింటినీ ప్రతిఘటించగలిగేవారు వారు. అతని గురించేకదూ అన్ని యిక్కట్లూ పడుతూన్నదీ! కాకపోతే యింత

అవమానం జరగకమునుపే యీ దుష్టులోకానికి దూరంగా తొలగిపోయేవారు. ఆ అభ్యాసే లేకపోతే యింక బ్రతకడ మెందుకూ?

మర్నాడూ, మూడోనాడూ ఆమె రాలేదు. నాలుగోనాటి సాయంత్రం కామయ్యగారిని విడుదల చేసేరు. పేరు చెబితేనేగాని ఫలానా అని పోల్చు కోలేం. మోకాళ్లపైకి అడ్డదిడ్డంగా వున్న పంచెకట్టూ, బొత్తాములు లేని లాల్చీ, బూజుపట్టి చిందరవందరగా వున్న జుట్టూ ఎక్కడో విన్నులుపడ్డ చోటు లేదేక ధ్యానంతో పరధ్యాన్నంగా చూసే ఆ వెర్రిచూపూ, అవకతవకనడక, గమనంలో తీవ్రతా—కావ్యరసామృతాన్ని కడుపారా శ్రావించి, శిష్యులకు చెలిమికాడై శిష్టజనాగ్రగణ్యుడయి, విజ్ఞానప్రబోధం చేసిన ఆ మేష్టరుగారేనా యీయన! ఆ కామయ్యగారేనా!

గడపదగ్గర నిలుచుని చెయ్యివేసేసరికి నిశ్శబ్దంగా, జాలిగా తెరుచుకుంది కవాటం. ఎలుగురాని డగ్గుత్తిక కంపస్వరం ప్రలపించింది. కిటికీలోంచి పడుతూన్న వెన్నెలకిరణాలు వెలవెలబారి అత్మచ్ఛాయతో నున్న అర్ధాంగిని అతనికి నివేదించేయి. ఆమెపై వొరిగి, ఆ నిస్తేజముఖాన్ని తిలకించి అతను అలాగే ఆమె ప్రక్కనే అనంతవాయువుల్లో ప్రాణవాయువులను లీనంచేసేడు.



# కళ్యాణి

[నాటకం]

— శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి —



రెండో అంకం

[ప్రతాపవర్మ శిబిరం. ఆయుధాలు గదిలో విరజిమ్మివుంటాయి. ప్రతాపవర్మ ఒక బల్లదగ్గిర నించుని కాగితాలు సవరిస్తున్నాడు. సేవకుడు ప్రవేశం]

సేవ—స్వామీ! తమకి లేఖ!

ప్రతా—లే...(చదివి) ఆఖరి ఆజ్ఞ. ఉదయమే సైన్యం ముందుకు నడపమని ఆజ్ఞ! లేకపోతే నాకు ఖైదుట!! సరే. ఈ రాత్రంతా వ్యవధి వుంది కదా. ఖైదు? వాళ్లకేం తెలుసు? ఈ జీవితంలోనే స్వర్గసుఖం అనుభవించబోతున్న నన్ను ఈ బెదిరింపులు భయపెడతాయా? ఖైదు, విచారణ, తీర్పు, మరణదండన - ఏమిటిదంతా! ధైర్యముంటే, శక్తుంటే, చాలా కాలంకిందటే చేసుండురు ఆపనంతా!

సేవ—శక్తసింహుడు స్వయంగా లేఖని తీసుకొచ్చాడు. కొద్దిసేపట్లో తమ దర్శనానికి వొస్తానన్నాడు. తమతో అత్యవసరమయిన విషయాలు మాట్లాడాలిట!

ప్రతా—సింహాన్ని గుహలోనే పట్టడానికి సాహసిస్తున్నాడే? చివరికి గుండెనిబ్బరం చేసుకున్నాడన్నమాట! మా సమావేశంవల్ల చాలా విషయాలు తేలిపోతాయిలే...శిబిరందగ్గిర కాపలా ఎవరు?

సేవ—అంతరంగిక సైన్యంలో వాళ్లే...

ప్రతా—మంచిదే. నరకంలోకయినా నన్నే వెంబడిస్తారు...చీకటిపడుతోంది...దీపం వెలిగించు...జ్ఞానసింహుడు ఇంకా తిరిగిరాలేదు కాదూ?

సేవ—రాగానే తక్షణం మన సైనికులు లోపలికి తీసుకొస్తారు.

ప్రతా—నా మరతుకి ఒప్పుకోకపోతే, ఈ పాటికి వొచ్చేసేవుండును. నా జీవితమంతా ఈ ఘడియ మీదనే ఆధారపడివుంది. నా భవిష్యత్తంతా ఇదే నిర్ధారణచేస్తుంది. ఒక వ్యక్తి, తన పేరుప్రతిష్ఠలు, భవిష్యత్తు- అన్నీ ఒక్క స్త్రీప్రేమకోసం త్యాగం చెయ్యటం వింతగా లేదూ? నన్ను మించిన శక్తి, నాకు వశంకాని మహాశక్తి ఏదో నన్ను ఈడ్చుకుపోతోంది. లేదా, నా బ్రతుకు నాకే హాస్యాస్పదంగా కనిపించివుండును. జ్ఞానసింహుడు తిరిగిరాలేదు. అంటే ఆవిడ వొస్తుందన్నమాట. మరతు అంగీకరించినట్టు సంజ్ఞ లేమయినా కనిపిస్తున్నాయేమో చూడు. తన ప్రజలకోసం త్యాగం చేస్తూ, అదేసమయంలో నాకు ప్రాణదానం చేస్తున్న ఆ వీరవనిత రాక సూచించే దివ్యజ్యోతి ఆ నగరంలో వెలిగిందేమో చూడు!...వొద్దు...ఇక్కడే వుండు...నేనే వెళ్లి చూస్తా...నాబాల్యం నించీ ఈ గడియకోసమే పలవరిస్తూ, ఎదురుచూశాను. ఆవిడకి నా నేత్రాలే ప్రథమస్వాగత మివ్వాలి!...(శిబిరంతెర పైకెత్తి)...నా భాగ్యం పండింది. చూడు. చీకట్లో ఆ మంట ఎలా మెరుస్తూ నృత్యం చేస్తోందో! ఆ నగరంలో మరో కాంతే లేదు.

సేవ—లోపలికి వెళ్లండి. శక్తసింహుడు ఈ దారినే రావాలి.

ప్రతా—అవును...మనం ఇంకా...సమావేశం త్వరలోనే ముగిసిపోతుందిలే.

(లోపలికొచ్చి బల్ల సవరిస్తూ)

మా ఉత్తరాలూ వున్నాయా?

సేవ—రెండే వున్నాయి.

ప్రతా—నే అడ్డంకొట్టినవి రెండు. ఈనాటి ఆజ్ఞాపత్రం మూడోది.

సేవ—(రెండుత్తరాలు చేతికిస్తూ) మొదటి రెండూ ఇదిగో...మూడోది మీ చేతిలోనే వుంది. నలిపేస్తున్నారు.

(పైన మనుష్యులు నడుస్తున్నట్టు చప్పుడు)

ప్రతా—అదుగో. వొస్తున్నారు.

(సైనికుడు తెర యెత్తితే శక్తసింహుడు లోపలికి ప్రవేశం)

శక్త—ఆమంట చూశావా? శత్రుదుర్గంలో నించి సంజ్ఞలు చేస్తున్నట్టుంది.

ప్రతా—సంజ్ఞలే అంటావా?

శక్త—సందేహం లేదు...నీతో మాట్లాడాలి.

ప్రతా—కానీ...(సేవకుడితో) బయటికి వెళ్లు ...ఆట్టేదూరం వెళ్లకు. త్వరలో నీ అవసర ముంటుంది.

శక్త—నీ మీద నా కెంత గౌరవమున్నదీ నీకు తెలుసు. చాలాసార్లు నీకు ప్రత్యక్షంగా రుజువు చేశాను. నీ పుట్టుపూర్వోత్తరాలు ఎవరికీ తెలియక పోయినా, నీ చిన్నవయస్సులోనే నీకు సేనానాయకత్వం లభించడానికి చాలావరకు నేనూ కారణం. చేసిన పనికి విచారించవలసిన అవసరమూ లేకపోయింది. కాని కొన్నిరోజులనించీ మన కో ప్రతికక్షి ఏర్పడింది. నువ్వు శత్రుదుర్గం పట్టకుండా, వెనకముందులు చూస్తున్నావనీ, పోమరివనీ మన శత్రువులు కొందరు నీ మీద నిందారోపణ చేశారు. కొందరు నువ్వు విశ్వాసపాత్రుడవే కాదన్నారు. చాలా జాగ్రత్తగా కథలు అల్లి, అపవాదులు ప్రచారం చేస్తున్నారు. వాటివల్ల నీమీద మోపిన నిందలు సహేతుకా లన్న అనుమానం చాలా మందికి కలుగుతోంది. మొదటినించీ మనమీద కిట్టని వారికి ఈ నాడు అవకాశం లభించింది. నిన్ను శిక్షింపించాలని కొందరు అప్పుడే నిశ్చయించారు. కాని అదృష్టవశాత్తూ, సమయం మించిపోకముందు నాకు తెలిసింది. నేను నీ పక్షాన్ని వాదించాను. నీకు హామీగా నిలిచాను. నా విశ్వాసం సార్థకంచెయ్యడం ఇప్పుడు నీ విధి. నువ్వు ఈ సమయంలో చొరవతీసుకోకపోతే మన ఉభయులకీ పతనం తప్పదు. నీ ఆయుధానికి ఎదురులేదు. ముందుకి సాగమని నీసేనకి ఆజ్ఞ అందితే చాలు- శత్రుదుర్గం పట్టుపడిపోయినట్టే. శత్రువుని శిక్షించి, అతివైభవంగా మనం మన నగరప్రవేశం చెయ్యొచ్చును. నీ ప్రతికక్షులు నీకు దాసానుదాసు లవకతప్పరు!

ప్రతా—ఇంతేనా చెప్పదలచినది?

శక్త—అన్నమాటే!...నీ మీద నాకున్న ఆదరానురాగాలనిగురించి నీతో పూర్తిగా చెప్పలేదనుకో.

ప్రతా—ఇప్పుడు నా కందిన ఆజ్ఞాపత్రం నీ దస్తూరీయేనా?

శక్త—ఆ.

ప్రతా—నీ స్వదస్తూరీయే?

శక్త—సందేహం లేదు. ఎందుకీ ప్రశ్న?

ప్రతా—మరి...ఈ రెండుత్తరాలూ?...గుర్తుపట్టావా?

శక్త—ఏమో తెలియదు. ఏ ముంది వుత్తరాల్లో ...నేను మొదటచూసి.

ప్రతా—అవసరం లేదు. నాకు తెలుసు.

శక్త—ఓహో, నువ్వు అడ్డంగొట్టిన రెండుత్తరాలూనా? నువ్వు అలా చెయ్యాలనే నా ఉద్దేశమూనూ. నీ శ్రద్ధ కనిపెట్టడానికి నే చేసిన పరీక్ష అది.

ప్రతా—జ్ఞానం తెలియని పసిపిల్లలతో నువ్వు మాట్లాడ్డం లేదు. పిచ్చిపిచ్చి అబద్ధాలాడకు. వృథాకాలయాపన చేసి లాభం లేదు. ఎంత త్వరలో ఈ సమావేశం ముగిస్తే అంత మంచిది...ఈ వుత్తరాల్లో, నా ప్రతి చేష్టకీ అపార్థాలు తీసి చాలా నీచాతినీచమైన నిందలు మోపావు. నా మీద ఈర్ష్యవల్లనే ఈ కార్యం చేశావో, విజయం సాధించిన ప్రతిసేనాపతినీ ఏదో ఓ మిషమీద నాశనం చెయ్యాలన్న ఉద్దేశంతోనే చేశావో తెలియదు. కాని ఒక్కొక్కప్పుడు నా నిర్దోషిత్వాన్ని నేనే సంశయించుకునేటంత నేర్పుతో నా ప్రతిచేష్టకీ అపార్థం తీశావు. యుద్ధం ప్రారంభమయిన మొదటివారంనించీ షెడి జరుగుతూనేవుంది. నా చర్యలకి నువ్వు తీసిన అపార్థాలే నిజాలని అధికారులు విశ్వసించారు. నీ వాదన అంగీకరించారు. ప్రత్యేకంగా ని

న్నీ కార్యానికి అధికారులే నియమించారు కనక, నా చర్యలు సమర్థించుకునే నిమిత్తం నాకు అవకాశ మివ్వకుండానే, అసలు నా వాదన వినటాన్నా వినకుండానే, నా పరోక్షంలోనే నా నేరాలు విచారించి, మరణశిక్ష విధించారు. నువ్వు అల్లిన వ్యూహం దుర్భేద్యం. నీ పన్నాగంనించి నన్ను తప్పించగలవారెవరూ లేరని నే నెరుగుదును. నా అదృష్టవశాత్తూ ఈ కుట్రసంగతి నాకు తెలిసింది. ఆ నిమిషంనించీ నీ అనుమానం వృథా కానివ్వకూడ దని నిశ్చయించాను. ఇప్పుడు ద్రోహం తల పెట్టాను నిజంగా. ఆ నిమిషందాకా మోసం చెయ్యలేదు. ఈ రెండు త్తరాలూ నాకు దొరికిన తరవాతనే మోసం తలపెట్టాను. మీ వినాశానికి కృషిచేశాను. ఈ రాత్రి నిన్నూ, నీ యజమానుల్నీ శత్రువుకి అమ్ముతున్నాను...నాకు చేతనయినంత గట్టిదెబ్బ తీస్తాను, మీరు మళ్లీ తలెత్తకుండా!...లేవొద్దు. అనవసరంగా సంజ్ఞలు చెయ్యకు. లాభంలేదు. ఆ ఏర్పాట్లన్నీ ముందే జరిగాయి...నీ ప్రాణం నా అరిచేతుల్లో వుంది.

శక్త—అప్పుడే కాదు. నా చేతుల్లో శక్తున్నంత కాలం...(అని బాకు తీసి విసురుతాడు. ప్రతాపవర్మ దెబ్బ తప్పించుకోబోతాడుకాని, మొహానికి గాయం తగులుతుంది.)

ప్రతా—(శక్తసింహుణ్ని మణికట్టుదగ్గిర పట్టుకుని) ఈ దౌర్జన్యానికి సిద్ధపడలేదు!...ఎలా పట్టుకున్నానో చూడు. ఒక్క చేత్తో నలిపెయ్యగలను. బాకు కిందికి దింపితే చాలు. మాట్లాడవేం? భయం లేదూ!

శక్త—ఊహుఁ. నా ప్రాణాలు నీ చేతిలో వున్నాయని నాకు తెలుసు. నీ యిష్టమొచ్చినట్టు చేసుకో. అది నీ హక్కు.

ప్రతా—(వొదిలిపెడుతూ) వింతగా వుంది, మృత్యువుని స్వయంగా ఆహ్వానించేవారు సైనికుల్లోనూ అట్టేమంది వుండరు. నే అనుకోలేదు, ఈ నిస్సారమైన దేహంలో...

శక్త—సైనికులకి తప్ప మగవరికీ ధైర్యసాహసాలుండవని సైనికులు దురభిప్రాయపడడంలో వింతలేదు!

ప్రతా—కావొచ్చును. నువ్వు ప్రస్తుతం ఖైదులోనే వుండాలి. అయినా నీకు అపాయం వుండదు. మన యిద్దరమూ సేవకులమే...యజమానులుమాత్రం వేరు. (మొహంమీద రక్తం తుడుచుకుంటూ) దెబ్బలో చాకచక్యం చూపించకపోలేదు. కొంచెం తొందరపడ్డావు. బలానికే లోటులేదు. చూపువాసి గురితప్పింది. చెప్పు, నిన్ను చంపడానికి సిద్ధపడిన శత్రువు నీ చేతికి చిక్కినప్పుడు ఏం చేస్తావు?

శక్త—క్షమించను.

ప్రతా—అర్థంకావడం లేదు నీ సంగతి. ఇలాటి వుత్తరాలు వ్రాయడం నీచంకాదూ?

శక్త—నా కర్తవ్యం నేను నిర్వహించుకున్నాను. రెండుమూడువిజయాలతో ఉబ్బిపోయి, సేనానాయకుడు, దేశంకంటె తానే గొప్ప అన్న వుద్దేశంతో తన్ను నియమించిన అధికారుల ఆజ్ఞలు ధిక్కరించవచ్చును. ఆ ప్రమాదస్థితి రాకుండా కాపాడ్డం నా కర్తవ్యం. ప్రజలు నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నారు. ప్రజానీకం ఆరాధించే విగ్రహాలు పగలకొట్టడమే నా విధి. తమ అభిమానపురుషుణ్ణి పదచ్యుతుణ్ణి చేసినందుకు ప్రజలకి తాత్కాలికంగా కోపం రావచ్చును. కాని అది లెక్కచెయ్యక దృఢంగా చర్యతీసుకునేనిమిత్తమే ప్రభుత్వం మమ్మల్ని నియమించింది. నీ జీవితంలో ఆ ప్రమాదసమయం ఆసన్నమైందని నాకు తోచింది. జాగర్త అని హెచ్చరించాను. నా ఆసత్యాల స్వభావం పై అధికారులకి తెలుసు.—

ప్రతా—ఆ ప్రమాదసమయం రాలేదు. రాకనే పోవును. నువ్వు ఈ లేఖలు వ్రాయకపోతే.

శక్త—ఆ సమయం ఎప్పుడో ఒకప్పుడు రావొచ్చుట. ఆ అవకాశం చాలు మాకు.

ప్రతా—ఎప్పుడో తిరగబడడానికి అవకాశముందని తోచినమాత్రాన్ని, ఓ నిర్దోషిని అన్యాయంగా బలివ్వడం న్యాయమా?

శక్త—దేశక్షేమంతో పోల్చిచూస్తే, ఒక వ్యక్తి జీవితం ఎంత? నే పట్టుబడ్డానని సంతోషించకు. నీ శిక్షాసమయం ఆగకపోదు.

ప్రతా—అలానే కానీ.

(చప్పట్లు చరిచి నౌకర్ని పిలుస్తాడు)

సేవ—(ప్రవేశించి) దెబ్బ తగిలిందే! రక్తం కారుతోంది.

ప్రతా—భయం లేదు. సైనికుల్ని పిలు. (సేవకుడు బయటికి వెళతాడు. సైనికు లొస్తారు)

ప్రతా—(సైనికులతో) ఇతను నావిరోధే కాని, ఇతనిమీద నా కనురాగం పోలేదు. ఇతని కే విధమైన అపాయమూ రాకూడదు. నా ఆజ్ఞ లేనిదేమాత్రం విడుదల కూడదు.

(సైనికులు శక్తసింగ్ ని తీసుకువెళిపోతారు)

ప్రతా—(అద్దందగ్గిర నించుని, గాయం పరీక్షించుకుంటూ) గాయం లోతుగా లేదు కాని మొహం తినేసింది. ఎవరు అనుకోగలరు. అంత బలహీనుడు...

(సేవకుడు తిరిగొస్తాడు)

ప్రతా—చెప్పినట్టు చేశావా?

సేవ—ఆ. కాని ఇది మన వినాశానికి...

ప్రతా—వినాశమా! నా జీవితాంతం దాకా ప్రతినిత్యమూ ఇలాటి వినాశం కలుగుతూ వుంచే ధన్యుణ్ణి. వినాశమా! నా మీద పన్నిన కుట్రకి ఈ నాడు ప్రతీకారం చెయ్యబోతున్నాను. కాని ఈ ప్రతీకారంద్వారా నా కీనాడు లభించే సౌఖ్యం ఈ లోకంలో ఇదివరకెన్నడూ ఎవరికీ లభ్యమయివుండదు. ఈ శుభదినంకోసమే నాకు ఊహ తెలిసినప్పటినించీ పలవరిస్తున్నా! నా జీవితమంతా వేచి, తపస్సుచేశాను. ఆ సౌఖ్యం అనుభవించడానికి అర్హత సంపాదించాను. నా గ్రహం మారింది. ఆనందముహూర్త మాసన్నమయింది. వినాశమంటావు నువ్వు! ప్రేమామృతం చవిచూడని మనుష్యుల కేం తెలుసు? హృదయంలో వెచ్చదనం లేనివారి కేమర్థమవుతుంది? నా అదృష్టానికి దేవతలే ఈర్ష్యపడుతున్నారని తెలియదూ? మనుష్యుడు భరించలేని ఆనందసౌఖ్యా లున్నాయి. వాటిని సాధించ యత్నించిన శక్తి సాధనలోనే అణిగిపోవొచ్చును. కాని సాధించగలిగాడా...?

సేవ—రక్తం ఇంకా కారుతోంది. కట్టు కట్టనివ్వండి. (అని సమీపిస్తాడు)

ప్రతా—తప్పదూ? సరేకానీ ... కళ్ళుమాత్రం కప్పెయ్యకు. (అద్దంలో చూచుకుంటూ) శస్త్రవైద్యుడి కత్తికి భయపడి నక్కుతున్న రోగిలా వున్నానుకాని, కొద్దినిమిషాల్లో, తన ప్రేమైకనిధానానికి స్వాగతమివ్వబోయే ప్రియుడి కళకనిపించడం లేదు...నీసంగతేమిటి?

సేవ—నా యజమానితోటిదే నా జీవితమూను.

ప్రతా—కాదు. నువ్వు నన్ను విడిచివెళ్లాలి. నేను ఎక్కడికి వెళతానో, నా గతి ఏమవుతుందో తెలియదు. నువ్వు తప్పించుకు పారిపో. నిన్నెవరూ అనుమానించరు. ఈ పెట్టెలో బంగార ముంది. నా కవసరం లేదు. బళ్లు సిద్ధంగా వున్నాయా? పసుల మందలు?

సేవ—శిబిరానికి ఎదురుగానే వున్నాయి.

ప్రతా—సరే...నే సంజ్ఞ చెయ్యగానే బయలుదేరాలి. (పైన తుపాకిచప్పుడు) ఏమిటది?

సేవ—కాపలావాళ్లు తుపాకి పేల్చారు!

ప్రతా—ఎవరిచ్చారు ఆజ్ఞ? ఆవిడమీద పేలిస్తే? నువ్వు చెప్పలేదూ?

సేవ—ఆవిడమీద పేల్చడం అసంభవం! రాగానే మీ సముఖానికి తీసుకురమ్మని భటులని నియమించాను.

ప్రతా—వెళ్లి చూడు.

(సేవకుడు వెళతాడు. ఒక్కనిమిషం నిశ్శబ్దం. ఆతరవాత తెర రెత్తి సేవకుడు మెల్లిగా 'స్వామీ' అని అంటాడు. కళ్యాణి లోపలికొస్తుంది. ద్వారం దగ్గిరే ఆగిపోతుంది. ప్రతాపవర్మ శరీరం కంపించిపోతూవుంటుంది. సమీపిస్తాడు)

కళ్యాణి—(గద్గదకంఠంతో) మీ ఆజ్ఞానుసారం వొచ్చాను.

ప్రతా—చేతిమీద రక్తముంది. దెబ్బ తగిలిందా?

కళ్యా—భుజాన్ని రాసుకుపోయింది; పెద్ద గాయమేమీ లేదు.

ప్రతా—ఏమిటీ? ఎప్పుడు?

కళ్యా—శిబిరం సమీపిస్తున్నప్పుడు.

ప్రతా—తుపాకి పేల్చింది ఎవరు?

కళ్యా—తెలియదు. పారిపోయాడు.

ప్రతా—బాధగా వుందా?

కళ్యా—లేదు.

ప్రతా—కట్టు కట్టించనా?

కళ్యా—అవసరం లేదు. ఇదో లెక్కలోది కాదు.

(ఒక్క నిమిషం నిశ్శబ్దం)

ప్రతా—మనసు నిశ్చయంచేసుకున్నావా?

కళ్యా—ఆ.

ప్రతా—షరతులు జ్ఞాపకంచెయ్యనా?

కళ్యా—అవసరం లేదు.

ప్రతా—చేసిన పనికి విచారించవుకదా!

కళ్యా—విచారించకూడదని ఒక షరతా?

ప్రతా—నీ భర్త అంగీకరించాడా?

కళ్యా—ఆ.

ప్రతా—ఇష్టం లేకపోతే వెళ్ళిపోడానికి ఇంకా వ్యవధి వుంది.

కళ్యా—అవసరం లేదు.

ప్రతా—ఎందుకు చేస్తున్నట్టు ఈ త్యాగం?

కళ్యా—అక్కడ ప్రజలు ఆకలితో మాడిపోతున్నారు కనక.

ప్రతా—మరేమీ కారణం లేదూ?

కళ్యా—ఏం కారణం వుండగలదు?

ప్రతా—ఓ సుగుణవతి అయిన స్త్రీ...

కళ్యా—ఊ...

ప్రతా—భర్తను ప్రేమించినది...

కళ్యా—ఊ...

ప్రతా—గాఢంగా?

కళ్యా—ఆ.

ప్రతా—నిరాయుధగానే వొచ్చావా?

కళ్యా—ఆ.

ప్రతా—శిబిరంముందర బళ్లూ, మందలూ చూశావా?

కళ్యా—ఆ.

ప్రతా—ధాన్యంతో నిండినవి రెండువందల బళ్లు. ముప్పయిబళ్ల ఎండుసామాను, ఆరువందల పశువు, పన్నెండువందల గొర్రెలు బయలుదేరడానికి నీ ఆజ్ఞకోసం సిద్ధంగా వేచివున్నాయి. బయలుదేరడం చూస్తావా?

కళ్యా—ఆ.

ప్రతా—ద్వారందగ్గిరకి రా.

(తెర యెత్తి సంజ్ఞచేసి ఆజ్ఞ యిస్తాడు. మందలూ, బళ్లూ కదలిన ధ్వని. ప్రతాపవర్మ, కళ్యాణి నిశ్చలంగా నించుని బళ్లు బయలుదేరడం చూస్తారు.)

ప్రతా—ఈ రాత్రినించీ నీ పుణ్యాన్ని, మీ విద్యానగరంలో ఆకలిదప్పు లుండవు. మిమ్మల్ని జయించగలిగిన మొనగాడు లేడిప్పుడు. రేపు మీకు విజయంతప్పదు. స్వప్నంలోనైనా అనుకోని ఆనందం రేపు లభిస్తుంది. సంతృప్తిగా వుందా?

కళ్యా—ఆహా!

ప్రతా—అయితే తెర దింపెయ్యనీ! పగలు వేడిగా వున్నా, రాత్రి వొణికించేస్తుంది...విషంగాని, ఆయుధాలుగాని దాచలేదు కదా!

కళ్యా—భయంగా వుంటే పరీక్షించుకోవొచ్చును.

ప్రతా—నా నిమిత్తంకాదు భయం, నీకోసమే.

కళ్యా—నా ప్రజల ప్రాణసంరక్షణకి మించిన కర్తవ్యం నాకు లేదు.

ప్రతా—మంచిపని చేశావు... స్త్రీ సుకుమార స్పర్శ అనుభవించని ఈ వ్యాఘ్రచర్మంమీద కూచో. నా ప్రథమవిజయానికి లభించిన పారితోషిక మిది!

(కళ్యాణి శాలువ కప్పుకుని, నిశ్చలంగా కూచుంటుంది)

ప్రతా—ఈ దీపపు కాంతి నీ మీద పడుతోంది. ఆరపనా!

కళ్యా—ఎలా వున్నా ఒకటే.

ప్రతా—(మోకరించి, కళ్యాణిని చెయ్యిపట్టుకుని) కళ్యాణీ!

(కళ్యాణి ఝల్లుపడి తేరిపారజూస్తుంది)

ప్రతా—కళ్యాణీ! నిన్నీవిధంగా పిలవడం నాకూ అలవాటేసుమా! నీ పేరు ఉచ్చరిస్తూవుంటే

నా శరీరం కంపించిపోతోంది. ఇన్నాళ్లూ నా హృదయంలో ఖైదీగా వుండడంవల్ల, నా హృదయం ఛేదించుకునిగాని బయటకి రాలేకపోతోంది. నీ పేరు ఉచ్చరిస్తూవుంటే నా ప్రాణాలు నానించి ప్రవహించి ఎగిరిపోతున్నట్టు అనిపిస్తోంది.

కళ్యా—ఎవరు నువ్వు ?

ప్రతా—గుర్తుపట్టలేదూ ? నీ కేమీ జ్ఞాపకం రావటం లేదూ ? ఎంతటి మహోత్తరానుభవాలన్నా కాలగర్భంలో మరుగుపడిపోతాయికదా !

కళ్యా—నన్నెరుగుదువయితే ? ఎవరు నువ్వు ?

ప్రతా—నీ కేమీ స్మరణకి రావటం లేదూ ?

కళ్యా—ఊహూ. గుర్తుందని అనుకోను.

ప్రతా—అవును. మరిచిపోయావు. నువ్వు మరిచిపోయావనికూడా నాకు తెలుసు. మొదట నేను నిన్ను కలుసుకున్నప్పుడు నీకు ఎనిమిదేళ్లు. నాకు పన్నెండు.

కళ్యా—ఎక్కడ ?

ప్రతా—జయపురంలో. అది జ్యేష్ఠమాసం. ఆదివారం. మా నాన్న మీ తల్లిగారి కంఠహారం చేసి తీసుకొచ్చాడు. నేను తోటలోకి ఆడుకోడానికి పారిపోయాను. తోటలో నువ్వు కనిపించావు, కొలనుదగ్గిర ఏడుస్తూ. నీ వుంగరం కొలనులో పడిపోయింది. అమాంతంగా లోపలికి వురికి, మెరుస్తూవున్న వుంగరం తీసి, నీ వేలికి పెట్టాను. కొంచెమైతే నేను మునిగిపోయేవాడినే. నువ్వు ఎంతో సంతోషించావు. ఆ నాడే నీ ప్రథమపరిచయం.

కళ్యా—నువ్వా అది !

ప్రతా—అవును.

కళ్యా—నిన్ను ఇప్పుడు ఎవరుగుర్తుపట్టగలుగుదురు ? పైగా మొహమంతా కట్టుతో కప్పడిపోయింది. నీ కళ్లుమాత్రమే కనిపిస్తున్నాయి.

ప్రతా—కట్టు పక్కకి జరపనా ? (జరిపి) ఇప్పుడు ? ఏమైనా గుర్తు తెలుస్తోందా ?

కళ్యా — (ఆలోచిస్తూ) అవునుకాబోలు ... కాని గాయం తగిలింది నీకు. రక్తం కారుతోంది.

ప్రతా—ఇది నా ప్రథమగాయం కాదు. కాని, నీకు తగలడం...

కళ్యా—కట్టు సరిచెయ్యనీ ! తిన్నగా లేదు. (విప్పి, తిన్నగా కట్టి) ఈ యుద్ధంలో గాయపడినవారికి చాలామందికి సేవచేశాను. అవునవును. జ్ఞాపకమొస్తోంది. కళ్లముందర ఆ తోట మళ్లీ ప్రత్యక్షమవుతోంది. దానిమ్మలు, గులాబులు చాలామారులు ఆడుకున్నా మక్కడ. మండువేసవి, మిట్టమధ్యాహ్నాలు ఎన్నో గడిపేశా మక్కడ ఆటల్లో.

ప్రతా—మొత్తం పన్నెండుమాట్లు. మనం ఆడిన ప్రతిఆటా, నువ్వాడిన ప్రతిమాటా ఇప్పుడు చెప్పగలను !

కళ్యా—ఒకనాడు నీ కోసం కాసుకు కూచున్నాను మామూలుప్రకారం. నువ్వంటే నాకెంతో యిష్టంగా వుండేది. ఎంతో శాంతంగా, గంభీరంగా వుండేవాడివి ! నేనో మహారాణినయినట్టు నన్ను గౌరవించేవాడివి. నువ్వు ఆ నాడు రానేలేదు.

ప్రతా—మా కుటుంబమంతా తీర్థయాత్రకని బయలుదేరాము. ఎడారిలో దారి తప్పిపోయాము. మహమ్మదీయులు నన్ను ఖైదీగా పట్టుకున్నారు. చాలాకాలం బానిసగా కాలంగడిపాను. తప్పించుకుని నే జయపురం చేరుకునేసరికి మీ తల్లి చనిపోయింది. తోట ఎండిపోయింది. నీ కోసం అహోరాత్రాలు గాలించాను. నిన్ను ఒక్కమారు చూసినా నీ అందమెవరూ మరవలేరుకనక, చివరికి నీ జాడ తియ్యగలిగాను.

కళ్యా—శిబిరంలోకి రాగానే నన్ను గుర్తుపట్టావా ?

ప్రతా—పదివేలమంది స్త్రీలు, నీ కవలిక, నీ అందంతోనే, నీ వేషంతోనే లోపలికొచ్చినా, లేచి, నీ చెయ్యే పట్టుకుని నువ్వే నా కళ్యాణివని చెప్పగలుగుదును. ప్రేమించిన స్త్రీరూపం నా హృదయంలో అలా హత్తుకుపోయి, అల్లా సజీవపరిణామం చెందడం వింతగా లేదూ ? అయినా నిన్ను చూడగానే ఒక్కనిమిషం నా నేత్రాలు నన్ను మోసగించాయని భ్రమపడ్డాను. నీ

అందం నా హృదయంలో నాటుకుపోయి, జీవించి, దిన దినాభివృద్ధి కాంచిందికాని, నీ నిజసౌందర్యం ఊహించుకో లేకపోయాను. నా నేత్రాలయెదుట సాక్షాత్కరించిన సౌందర్యమంతా నీలో వుండేవుంటుం దని ఊహించడానికి ధైర్యం నాకు చాలకపోయింది.

కళ్యా—బాల్యావస్థలో సాధారణంగా ప్రేమించేటంత ఉద్రేకంతోనూ ప్రేమించా నన్నమాట. నువ్వు జయపురాని కొచ్చి నా జాడ తెలుసుకున్న తరవాత జరిగిన కథ చెప్పు. అంత గాఢంగా ప్రేమించిన స్త్రీని చూసేటందుకే ప్రయత్నం చెయ్యలేదూ?

ప్రతా—మీ తల్లి చనిపోయిందనీ, మీ ఆస్తి అంతా పోయిందనీ, నువ్వు ఓ సంస్థానాధీసుని వివాహ మాడబోతున్నావనీ విన్నాను. నువ్వతనికి రాణివై పూజలందుకుంటూవుంటావు. నేనో? ఇల్లూ వాకిలీ లేని దేశదిమ్మరిని. నీ కేసౌఖ్య మివ్వగలను? నిన్ను చూడా లన్న కోరిక అపరానిదై, నీకు లభించిన సౌఖ్యం నాశనంచెయ్యడానికి నన్ను ప్రేరేపిస్తుందేమోనన్న ఆవేదనవల్ల మీ నగరసమీపానికి రావడానికే భయ పడ్డాను. ఎన్నిరోజులు నగరప్రాకారాలచుట్టూ తిరుగుతూ, లోపలికి రాకుండా వుండిపోయానో! చివరికి నా భుజబలం పరుల సేవకి విక్రయించాను. రెండుమూడు యుద్ధాల్లో విజయం సాధించాను. నా పేరుప్రఖ్యాతులు లోకంలో పాకిపోయాయి. నిన్ను చూడగల ఆశ పూర్తిగా నశించినా, ధైర్యం విడనాడక, నా అదృష్ట దేవతని నమ్ముకుని కాలం గడుపుకొచ్చాను.

కళ్యా—ప్రేమించినప్పుడు పురుషులు ఎంత బలహీనులు, పిరికిపందలు అవుతారు! నన్ను తిన్నగా అర్థంచేసుకో. నేను నిన్ను ప్రేమించడం లేదు. ఒకప్పుడైనా ప్రేమించివుండునేమో చెప్పలేను. కాని ప్రేమ ఏ విధంగా వుండాలని నా ఆశయమో, ఏ రీతిగా నేను ప్రేమించగలనని నా విశ్వాసమో, ఆ విధంగా నన్ను ప్రేమించినట్టు నువ్వు చెబుతున్నావు. నువ్వు చూపినంతకంటె ఎక్కువ ధైర్యసాహసాలు లేకపోవడం హృదయదారుణంగా వుంది.

ప్రతా—ధైర్యం కాదు నాకు తక్కువయింది. ధైర్యాతీతమయిన ఆత్మవిశ్వాసబలం కావలసొచ్చింది. పైగా కాలం మించిపోయింది.

కళ్యా—నువ్వు జయపురం విడిచివెళ్ళేసరికి కాలం మించిపోలేదు. పైగా మన జీవితమంతా సఫలం చెయ్యగల ప్రేమ లభ్యమయినప్పుడు, సమయం ఎన్నడూ మించిపోదు. ప్రేమ ఎన్నడూ ప్రయత్నం విడువదు. ప్రతిఫలం కోరదు. నిరాశ చెందదు. ఆశాశూన్యమయిన తరవాతకూడా ప్రయత్నం మానదు. నువ్వు ప్రేమించానని చెప్పినట్టు, నేను ప్రేమించివుంటే ఏ విధంగా ప్రవర్తించివుందునో నే చెప్పలేనుగాని, ఒక్క విషయం మాత్రం నిశ్చయం. విధి నాతో హోరాహోరి పోరి గాని నా సౌఖ్యం చెడగొట్టలేకపోయివుండును. "నా జోలికి రాకు" అని విధినే శాసించివుందును. ప్రపంచాన్నంతా నా పక్షానికి తిప్పుకునివుందును. నే ప్రేమించిన వ్యక్తికి నే నీవిధంగా ప్రేమించిన సంగతి తెలియజేసి వుందును. అతనే నిర్ణయించివుండును మా భవిష్యత్తు.

ప్రతా—(చేతిని నిమురుతూ) అయితే, నువ్వు అతన్ని ప్రేమించడం లేదూ?

కళ్యా—ఎవరిని?

ప్రతా—భీమసింగ్‌ని!

కళ్యా—(చెయ్యి వెనక్కి లాక్కుంటూ) ముట్టుకోవొద్దు. హృదయపూర్వకంగా అంగీకరించలేను. ఆయన నన్ను వివాహంచేసుకోకముందు నేను ఈ లోకంలో ఏకాకిని; దీనని. ఒంటరిగా వున్న దీనస్త్రీ మీద లోకాపవాదులు తప్పవు. అందులో అందంగా వుంటే అసలే తప్పవు. ఈ అపవాదులు ఆయన నమ్మలేదు. ఆయనకి నా మీద విశ్వాస ముంది. ఆయన విశ్వాసం నన్ను సంతోషపెట్టింది. అసాధ్యమయిన ఆనందంకోసం వెతుకుతూ కాలం పుచ్చనవసరం లేకుండా, దొరికినదానితో తృప్తిపడి, సుఖపడవొచ్చునని నా అనుభవం. నీకు నచ్చచెప్పగలను. ఈ నాడు నా భర్తని ప్రేమిస్తున్నాను. నీ ప్రేమఅంత విపరీతమయినది కాకపోవొచ్చును. కాని నిశ్చలమయినది. నా ప్రేమలో ఉద్రేకంకంటె విశ్వాసమే హెచ్చు. విధి నాకు

ప్రసాదించిన ప్రేమామృత మిది. స్వీకరించి కళ్ల కద్దుకున్నాను. నాకు మరో ప్రేమ అనవసరం. చేతులారా, నేనై మా ప్రేమసౌధం కూలదోయ్యను. చూశావా? నన్ను తిన్నగా అర్థంచేసుకోలేదు. నువ్వు చేసిన పని 'తప్పు' అని నే చెప్పినప్పుడు, నీ ఒక్కడి విషయమై కాదు నే మాట్లాడినది. ప్రతిహృదయానికీ ఒక్కసారి సాక్షాత్కరించి, అదృశ్యమయే ప్రథమప్రేమానురాగాల విషయమై చెప్పాను. అటువంటి ప్రేమ ఏ వ్యక్తి కయినా లభించిందో, లేదో తెలియదుకాని, నీకూ నాకూ లభ్యం కాలేదు. ఆ ప్రేమైకజీవులు వర్తించే విధంగా నువ్వు ప్రవర్తించలేదు.

ప్రతా—నన్నూ, నా యీ ప్రేమనీ అతికఠినంగా విమర్శిస్తున్నావు. నే ప్రేమించినవిధంగా ఈ లోకంలో మరెవరూ ప్రేమించివుండరు. నేను ప్రతిఫలం కోరనివాడిని. ప్రతిఫలం కావాలన్న ఆశ అయినా లేనివాడిని. విశ్వసించు. నువ్విప్పుడు నా శిబిరంలో వున్నావు. సాధారణప్రియులు ఆశించే సౌఖ్యాలన్నీ చెయ్యిజాపితే నా అధీన మవుతాయి. కాని, నా ప్రేమ కోరేది వేరు. అది నీకూ తెలుసు. విశ్వసించమని కోరుతున్నాను. నమ్మలేవనే ఉద్రేకంతోనే నిన్ను స్పృశించినది. మరి తాకను. నా ప్రేమనిజతత్వం ఇప్పుడైనా నీకు బోధపడుతుంది. అసాధ్యమయిన కార్యానికి మాత్రమే నా ప్రేమ జంకింది.

కళ్యా—ప్రేమ సాధించలేని కార్య ముందా అనే నా సందేహం. కాని నీ ప్రేమ సంపూర్ణంగా విశ్వసించడానికి సిద్ధమే. నీ పేరుప్రతిష్ఠలు, నీ భవిష్యత్తు, ప్రపంచంలో నీ కున్న సర్వస్వమూ ఒక్క గడియ కాలం నాతో గడిపేటందుకు ధారపోశావంటే, నీ ప్రేమ మహత్తరమయినదని ఒప్పుకోవాలి.

ప్రతా—కానేకాదు. నా ఆఖరిచర్య అసలు నా ప్రేమని కొంచమైనా రుజువుచెయ్యదు.

కళ్యా—ఏం?

ప్రతా—నీకు నిజం తెలియడమే నా కోరిక. నిన్ను ఇక్కడికి రప్పించడంలో నీ పేరు మీదుగా మీ నగరం సంరక్షించడంలో నే చేసిన త్యాగమేమీ లేదు.

కళ్యా—అర్థంకావడం లేదు. దేశద్రోహం చెయ్యలేదూ? నీ పూర్వవిజయాల ఫలితమంతా ధారపోయ్యలేదూ? నీ భవిష్యత్తు సంపూర్ణంగా నాశనం చేసుకోలేదూ? నీకు దేశాంతరవాసమో, మరణమో తప్పదుగదా!

ప్రతా—మొదటి విషయం. నాకు ఓ దేశమంటూ లేదు. లేకపోతే నా ప్రేమ ఎంత తీవ్రమైనదైనా, దేశద్రోహం చేసేవాడిని కాను. నేను ఓ సేవకుడిని. నమ్మినంతకాలం విశ్వాసపాత్రుడిని. నన్ను మోసంచేసినప్పుడు నేనూ ద్రోహంచెయ్యడానికి వెనుదియ్యను. అకారణంగా, అన్యాయంగా నా మీద నిందారోపణ చేశారు. సమర్థించుకోడానికి నాకు అవకాశమైనా ఇవ్వకుండా, విచారణ లేకుండా శిక్ష విధించారు. నాకు పతనం తప్పదని నాకు తెలుసు. నే నీనాడు చేసిన ద్రోహం నాకు అధఃపతనం కలిగించడానికి బదులు నా రక్షణకి కారణ మవొచ్చును.

కళ్యా—ఈ నాడు నువ్వు చేసిన త్యాగమేమీ లేదన్నమాట.

ప్రతా—లేదు. అబద్ధమాడి నిన్ను ప్రసన్నం చేసుకోడం నాకు ఇష్టం లేదు.

కళ్యా—వేరు దృష్టాంతరాలతో నీ గాఢానురాగం రుజువుచెయ్యవలసిన అవసరం లేదు. నీ విశ్వాసమే నాకు పదివేలు.

ప్రతా—నీకు తెచ్చిపెట్టిన విషమపరీక్షకి క్షమిస్తున్నా వన్నమాట!

కళ్యా—నీ స్థితిలో నే వుంటే, నేనూ నీలాగే ప్రవర్తించివుందును. మరీ దుడుకుగా ప్రవర్తిద్దునేమో కూడాను!

ప్రతా—నువ్వు ఇక్కడికి రావడానికి అంగీకరించినప్పుడు నే నెవరినో తెలుసునా నీకు?

కళ్యా—ఎవరికీ తెలీదు. అనేకవదంతు లుండేవి. ప్రతాపవర్మ ముసలివాడనీ, చూపులకే భయంకరుడనీ కొందరనేవారు. యవ్వనుడనీ, మన్మథుడనీ మరికొందరన్నారు.

ప్రతా—జ్ఞానసింహుడు నన్ను చూశాడు. అతనేమీ చెప్పలేదూ?



వర్షానిశి

= చిత్రకారుడు: శ్రీ హెచ్. వి. రామగోపాల్ (మద్రాసు ఆర్టుస్కూలు) =

కళ్యా—ఊహుం.

ప్రతా—నువ్వు అతన్నేమీ అడగలేదూ?

కళ్యా—లేదు.

ప్రతా—నువ్వు నిస్సహాయవై తెలియని క్రూరుడి శిబిరంలో ప్రవేశించేసరికి నీ గుండె ఆగిపోలేదూ?

కళ్యా—త్యాగం చెయ్యవలసిన అవసరమొచ్చింది!

ప్రతా—నన్ను చూసినప్పుడు?

కళ్యా—కట్లతో మొహం కప్పడిపోయింది మొదట!

ప్రతా—తరవాత? కట్లు జరిపిన తరవాత?

కళ్యా—అప్పటి సంగతి వేరు! అప్పటికే నీ సంగతి తెలుసుకున్నానుగా! నే లోపలికి ప్రవేశించినప్పుడు, నీ మనస్సులో వున్న ఊహాలేమిటి? నన్నిక్కడికి రప్పించడంలో నీ వుద్దేశమేమిటి?

ప్రతా—ఎలా చెప్పగలను? నా పని అయిపోయిందని నాకు తెలుసు. నాతోపాటు లోకాన్నంతనీ అధఃపాతాళానికి లాగెయ్యాలన్న, ఆపుకోలేని కోరిక పుట్టింది. కాని నిన్ను చూడగానే, ఇది ఎంత కూడని పనో బోధపడింది.

కళ్యా—నిన్ను చూడగానే నాకూ అర్థమయింది. మాటలతో నిమిత్తం లేకుండానే, ఉభయులమూ, పరస్పరం అర్థంచేసుకున్నాము. నాకు భయమే లేకపోయింది. చాలా వింతగా వుంది.

ప్రతా—నా పూర్వపు ఉద్దేశాలన్నీ దురుద్దేశాలయినట్టూ, మనుష్యులందరూ, ముఖ్యంగా నేనే మారిపోయినట్టూ కనిపించింది.

కళ్యా—నాలోనూ మార్పు కనిపించింది. నీతో నా వాగ్ధోరణి చూస్తే, నాకే ఆశ్చర్యంగా వుంది. నీ నేత్రాలు నన్ను భయపెట్టలేదు. నిన్ను చూడగానే చిరపరిచితుడవని తోచింది-ఎక్కడ చూసినదీ జ్ఞాపకం రాకపోయినా!

ప్రతా—నా అదృష్టదేవత సకాలంలో నన్ను నీ దగ్గిరకి పంపించివుంటే నన్ను ప్రేమించివుందువా?

కళ్యా—ఈ నాడు నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పడంవల్ల ఎంత ఫలితముందో, ఆ నాడు నిన్ను ప్రేమిద్దునని చెప్పినా అంతే ఫలితముంది. రెండూ అసంభవమేనని మనిద్దరికీ తెలుసును......ఈ లోకంలో మన యిద్దరమే వ్యక్తులమున్నట్టు సంభాషించుకుంటున్నాము. మన పూర్వగాథలు తలచుకుని ఆనందిస్తూ ఈ నాడు మరో వ్యక్తికి బాధపడుతున్న సంగతి మరిచిపోతున్నాను. నా భర్తనేత్రాల్లో నిరాశ, దుఃఖం... ఆ పాలిపోయిన వదనం తలచుకుంటే...ఇక్కడ ఆగలేను. తెల్లవారుఝాము అయివుండాలి. అక్కడి పరిస్థితులు తెలుసుకోవాలని చాలా ఆత్రుతగా వుంది. కాలిచప్పుడు వినిపిస్తోంది...పైన ఎవరో నడుస్తున్నట్టుంది.

(సేవకుడు పైనించి 'స్వామీ' అంటాడు)

ప్రతా—ఏం?

సేవ—త్వరగా ప్రయాణమవాలి. మరికొంతమంది గూఢచారులూ, సైన్యమూ వొచ్చి చేరుకున్నారు. మీరు స్వామిద్రోహులని ప్రకటించేశారు. శక్తిసింగ్ కోసం గాలిస్తున్నారు. మీ రిక్కడ పట్టుబడితే చాలా ప్రమాదం.

ప్రతా—(కళ్యాణితో) రా!

కళ్యా—ఎక్కడికి?

ప్రతా—విశ్వాసపాత్రులయిన భటుల్ని తోడిచ్చి, నిన్ను మీ నగరం చేరుస్తాను.

కళ్యా—నువ్వేం చేస్తావు?

ప్రతా—తెలియదు. ఈ విశాలప్రపంచంలో తల దాచుకోడానికి నాకు తావు దొరక్కపోదు. నే ఎక్కడ కాలం గడిపినా ఒకటే.

సేవ—జాగ్రత్తగా వుండాలి. నగరం చుట్టూ కాపలా వేశారు. దేశంనిండా గూఢచారులే!

కళ్యా—మా నగరానికి రా!

ప్రతా—నీ వెంటనా?

కళ్యా—అవును!

ప్రతా—రాలేను.

కళ్యా—కొద్దిరోజులకే...నీ ఆచూకీ రహస్యంగా వుంచేటందుకు.

ప్రతా—నీ భర్త ఏ మంటాడు?

కళ్యా—అతిథిసత్కారంలో అశ్రద్ధ చెయ్యడు.

ప్రతా—నువ్వు చెప్పినది నమ్ముతాడా?

కళ్యా—ఆ! నేను చెప్పినప్పుడు నమ్మకపోతే! ...నమ్ముతాడు. నమ్మితీరాలి...రా!

ప్రతా—రాను.

కళ్యా—ఏం? భయమెందుకు?

ప్రతా—నిన్నుగురించే నాకు భయం.

కళ్యా—నా కోసమా? నేను వంటరిగా తిరిగి వెళ్లినా, నీతో వెళ్లినా, ప్రమాదం ఒక్కటే. నీ క్షేమం కోసమే మేము భయపడాలి. మానగరాన్ని నువ్వు రక్షించావు. ఇప్పుడు మా నగరం నిన్ను కాపాడ్డం ధర్మం. నువ్వు నా రక్షణలో వొస్తున్నావు. నీ క్షేమానికి నేను ఉత్తరవాదిని...

ప్రతా—అలాగే కానీ...పద.

కళ్యా—నీ ప్రేమకి వేరే ఉత్తమ నిదర్శనం చూపలేవు...మరి ఆలస్య మెందుకు?

(సేవకుడు తెర యెత్తుతాడు. పైన ఆయుధాల కలకలం. దూరాన్నించి కోటని మించిన గంటలధ్వని)

ప్రతా—అటుచూడు.

కళ్యా—ఏమిటది? తెలిసింది. విద్యానగరవాసుల ఆనందాతిరేకాలు వెలిబుచ్చడానికి వెలిగించిన జ్యోతుల కాంతి ఆకాశమంటుతోంది. దుర్గప్రాకారాలు ఎలా దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాయో చూడు! కోటబురుజులు నక్షత్రాలతో మంతనాలాడుతున్నాయి. నిర్మలాకాశదర్పణంలో విద్యానగరం ప్రతిబింబిస్తోంది. సాయంకాలం నే నడిచివొచ్చిన బాట గుర్తుపట్టగలను! అవసానదశలో, విద్యానగరానికి తిరిగి ప్రాణమిచ్చింది. అతిత్వరితంగా రమ్మని మనకి సంజ్ఞ చేస్తోంది నగరదేవత! ఆ శంఖారావాలూ, ఆ మంగళధ్వనులూ విన్నావా? నా వివాహసమయంలో జరిగిన మహోత్సవాలు స్ఫురణకొస్తున్నాయి. నాకు అపరిమితానందంగా వుంది. నన్ను ప్రాణాధికంగా ప్రేమిస్తున్న నీ వల్ల మా నగరసంరక్షణ జరగడం మరీ సంతోషంగా వుంది. సోదరీప్రేమతో, హృదయపూర్వకంగా చెయ్యగల సత్కార మిదే.

(అని వొంగి పాదాభివందనం చేస్తుంది)

ప్రతా—(లేవదీసి, శిరస్సు నిమురుతూ) చెల్లీ! ఉత్తమోత్తమ మయిన ప్రేమామృతం నాకు లభించింది. చూడు. వొణుకుతున్నావు. కాళ్లు తడబడుతున్నాయి. నా మీద ఆనుకుని అడుగు వెయ్యి...

కళ్యా—భయం లేదు. కొంచెం అలిసిపోయాను. కళ్లు తిరిగాయి. సహాయం చేస్తావా? సౌఖ్యభారంతో నే వేసే అడుగులకి ఎవరూ అడ్డురాకూడదు!...రాత్రి ఎంత సుందరంగా వుంది. త్వరితంగా అడుగులు వేద్దామా? అట్టే వ్యవధి లేదు. ఆనందోద్రేకం చల్లారక మునుపే చేరుకోవాలి...

(అంటూ ముందుకి నడుస్తుంది. తెర)

(సశేషం)



# ఆర్థిక ప్రణాళికలు



= శ్రీ కె. సన్యాసయ్య =

అర్వాచీనప్రపంచమహాసంగ్రామములో ధనప్రాణ నష్టములు అపారములు. యుద్ధరంగమున యువకు లెందరో ఆత్మబలిదాన మొనర్చినారు. ఏ మహాశయములకొరకై ఘోరమారణహోమమును ఉపక్రమించినట్లు ప్రకటితమో, ఆ ఆశయములు సిద్ధింపలేదనుట నగ్న సత్యము. యుద్ధకాలములో శత్రువినాశమునకు వెచ్చించిన కోట్లకొలది ధనరాసులలో లవలేశమైనను నిర్ణీత నిర్మాణపథమున వెచ్చించిన యుద్ధానంతరము స్మశానవాటికగా మారిన భూగోళము భూలోకస్వర్గముగా వెలిగిపోయెడిదని చెప్పుట సత్యదూరము కాదు. యుద్ధకాలములో లయకార్యమునకు ఉపకరించిన సాధనసంపత్తి ఏవిధముగా లభించినది? శాంతిసమయములో కూడ సాధనసంపత్తులతో నిర్ణీతపథకములో ఆర్థికవ్యవస్థను తీర్చిదిద్దిన మానవసౌభాగ్యము పెంపొంది లోకకళ్యాణోదర్కమగును. ఈ జిజ్ఞాసయే ప్రస్తుతము ప్రచారములో నున్న ఆర్థికప్రణాళికాసూత్రముల కన్నిటికిని మూలబీజము.

సృష్ట్యాదినుండియు మానవుని బుద్ధికుశలత, శాస్త్రవిజ్ఞానము అభివృద్ధినొందుచున్నవి. మానవుడు నాగరకతాభివృద్ధితోబాటు ప్రకృతిని జయించి, ఆకాశగమనము, నౌకాయానము, శీఘ్రయానము, దూరశ్రవణము మున్నగు శక్తులను సంపాదించినాడు. దివ్యహర్మ్యమాలికలను నిర్మించుకొనగలుగుచున్నాడు. వస్తుసంపదను యంత్రసహాయముతో అపరిమితముగా సృష్టింపగలుగుచున్నాడు. ఇక ఈపాటికి భూప్రపంచము స్వర్గలోకముగా మారియుండవలసినది. కాని అట్లు కాలేదు. విజ్ఞానముతో, నాగరకతతో, వస్తుసంపదతోబాటు దారిద్ర్యదైన్యము ఇనుమడించుచున్నదనుట అద్యతన నాగరకతలోని పెద్ద విరోధాభాసము. ఈ దారిద్ర్య నిర్మూలనమునకు, సర్వమానవాభ్యుదయమునకు సమష్టికృషి ఏసూత్రములను అనుసరింపవలెను? అను జిజ్ఞాసల పరిణామమే ఆర్థికప్రణాళికలు.

ప్రస్తుతము మన దృష్టి నాకర్షించుచున్న సాంఘికకష్టములకు మూలకారణము ఆర్థికవ్యవస్థ. ప్రస్తుతము రష్యాదేశమువినా, అన్ని దేశములందును గల ఆర్థికవ్యవస్థకు ధనికవాదము (Capitalism) ఆద్యప్రకృతి. ఈవిధానములోని ముఖ్యాంశము ప్రత్యేకవ్యక్తులకు ఆస్తి కలిగియుండు అధికారము. ఈ ప్రాచీనాచారము చిరకాలమునుండి పురాతనతతోబాటు పవిత్రతను కూడ సంపాదించికొని, సంఘమును ఆవరించి నిలిచినది. ఈ పద్ధతిలో ధనవంతులకు, ధనహీనులకు మధ్య గల భేదము ప్రస్ఫుటముగా ఏర్పడినది. అమానుషముగా ప్రబలినది.

ధనికవాదములో ఉత్పత్తి ప్రజావసరముల ననుసరించి కాక లాభముకొరకు జరుగును. లాభము వస్తూత్పత్తికి ఏకైకలక్ష్యము. ప్రజోపయోగకరములైన వస్తువులైనను, లాభదాయకములు కానియెడల ధనికులు వాని ఉత్పత్తికై ప్రయత్నింపరు. ఆహారపదార్థములు ప్రజలకు ముఖ్యావసరములు. ఆహారపదార్థములను ఉత్పత్తి చేయుటకంటె విలాసవస్తువులను నిర్మించిన ఎక్కువ లాభము సిద్ధించిన పక్షమున, ధనికవాదములో అవియే ఎక్కువగా ఉత్పత్తియగును. ప్రజోపయుక్తములైన ఆహారపదార్థములు కూడ ఆర్థికకారణములచే విధ్వంస మొనర్చుట ధనికవాదమున అపూర్వవిషయము కాదు.

ధనికవాదములో ఆర్థికాభ్యుదయము, ఆర్థికమాంద్యము ఊయలఊపుగా పరివర్తించుచుండును. దీనికి అనుషంగికఫలము నిరుద్యోగసమస్య. ధనికవాద

ములో లాభములన్నియు పెట్టుబడిదారులకే సంక్రమించును. అధికలాభములు తిరిగి ఉత్పత్తిసాధనములలో మూలధనముగా మారును. ఉత్పత్తిసాధనములు హెచ్చయినకారణమున ఉత్పత్తి హెచ్చును. ఆ సమయములో సరకులను కొను శక్తి జనసామాన్యమునకు లేనియెడల తయారైన సరకులు విడుదలకావు. ధనికవాదములో ఉత్పత్తి జనసామాన్యజీవితసౌభాగ్యముకంటె శీఘ్రతరముగా అభివృద్ధిచెందును. అందువలన ఉత్పత్తి తగ్గించవలసిన అవసరము కలుగును. కావున ఆర్థికాభ్యుదయమునకును, ఆర్థికమాంద్యమునకును ధనికవాదములో అవినాభావసంబంధము ఏర్పడుచున్నది. నిరుద్యోగసమస్య లేనియెడల పెట్టుబడిదారుల లాభములు విశేషముగా పెరుగుటకు వీలుండదు. నిరుద్యోగులు ప్రబలినప్పుడే తక్కువ జీతములతో హెచ్చుమందివద్దనుండి ఎక్కువపని చేయించుకొనవచ్చును. పెట్టుబడిదారులు స్వలాభాపేక్షచే నిరుద్యోగసమస్యను వారించుటకు త్రికరణశుద్ధిగా సహకరింపరు.

పూర్వోక్తములైన సమస్యలను పూర్తిగా పరిష్కరింపవలెననిన, ధనికవాదము అంతరింపవలెను. లేదా, ప్రస్తుతమున్న ఆర్థికవ్యవస్థలో ఈ సమస్యను పరిష్కరింపజాలు మార్పులు రావలెను.

క్రిందటి శతాబ్దిలో స్వతంత్రవ్యాపారసిద్ధాంతము (Lainez Faire), స్వేచ్ఛావ్యాపారపద్ధతి (Free trade) విరివిగా వ్యాప్తిలో నుండెడివి. ఆర్థికపరిణామము లన్నిటికిని అంతర్వాహినులుగా అలంఘ్యములగు ఆర్థికసూత్రము లుండునని ఆనాటివారి విశ్వాసము. ఆర్థికరథము దైవనిర్ణీతమగు పథము ననుసరించుననియు, దానిని మానవమార్గములలో మరల్పబూనుట వృథాప్రయాస యనియు వారి అభిప్రాయము. దీనికితోడు వ్యక్తిస్వాతంత్ర్యము కావలెనను కోరిక వృద్ధిపొందిన రోజు లవి. ప్రభుత్వముయొక్క విధినిషేధములన్నియు వ్యక్తిస్వాతంత్ర్యము నరికట్టునను వాదము విశేషముగా చెలరేగినది. ఎవరి భాగ్యమును పెంపొందించుకొనుటకు వారే యత్నింపగలరనియు, అట్టి వ్యక్తిప్రయత్నములకు ప్రభుత్వము అంతరాయములు కల్పింపకుండిన సమష్టిదేశసౌభాగ్యము . ఆనుషంగికముగా అభివృద్ధిపొందు . ననియు ఆనాటివారి దృఢవిశ్వాసము.

కాని, కాలము గడచినకొలది ఈ సిద్ధాంతము లందు నమ్మకము సడలసాగినది. నిరవధికమగు వ్యక్తిస్వాతంత్ర్యము బీదసాదల, బలహీనుల పాలిటి గొడ్డలిపెట్టు అయినది. వారి హక్కులను సంరక్షించుటకొరకు ఆ కాలమునందే యంత్రాలయశాసనములు (Factory Laws) మొదలైనవి విధింపకతప్పినది కాదు. ప్రథమప్రపంచమహాసంగ్రామారంభమువరకును సాంఘికవ్యవస్థను రక్షించుటకు మాత్రము యూరోపాఖండములోని ప్రభుత్వములు పూనుకొన్నవి. కాని యుద్ధము ముగిసిన వెనుక జాతీయజీవనము పునరుద్ధరించుకొనుటకై ప్రతిదేశమును ప్రయత్నించినది. అట్టి ప్రయత్నములందు ప్రభుత్వములే ప్రముఖపాత్రను ధరింపవలసివచ్చినది. ఆ తరువాత ఆర్థికమాంద్యము నెదుర్కొనుటకు వివిధదేశముల ప్రభుత్వములు ఆర్థికవిధానమును సరిదిద్దుకొనవలసివచ్చినది. అర్వాచీనప్రపంచసంగ్రామములో అన్నిదేశములలోను మహత్తరపరివర్తనము కలిగినది. యుద్ధప్రభావము మూలమూలలకును ప్రాకినది. ఈ కాలములో ప్రతిదేశప్రభుత్వము సర్వవిషయములలోను జోక్యము కలుగజేసికొని, అధికారమును చెలాయించినది. సంగ్రామానంతరము ఆర్థికపునర్నిర్మాణమునకై అన్నిదేశములును ఆర్థికప్రణాళికలను నిర్మించుకొన్నవి.

నిరుద్యోగనిర్మూలనమును, జీవితసౌభాగ్యక్రమపరిణామవికాసమును (Progressive increase in the standard of living) ఆర్థికపునర్నిర్మాణములోని ప్రధానలక్ష్యములు. ఈ రెండు లక్ష్యములు ధనికవాదములో సిద్ధింపవనుట స్పష్టము. స్వతంత్రవ్యాపారపద్ధతి, ఆర్థికవిషయములలో వ్యక్తిస్వాతంత్ర్యము సమష్టిసంఘాభివృద్ధికి నిర్వికల్పముగా తోడ్పడవనుట సువిదితము. ఈ కారణములవలన ప్రభుత్వము ఆర్థికవిషయములలో జోక్యముకలుగజేసికొని, నిర్ణీతవిధానములను నిర్బంధముగా అనుష్ఠించునట్లు చేయవలసియున్నది. అనగా ఒక నిర్ణీతకార్యక్రమము ననుసరించు సర్వతస్సమగ్రప్రణాళికననుసరించి ఆర్థికపునర్నిర్మాణము జరుగవలసియున్నది.

ఆర్థికప్రణాళిక నిర్మించవలెననిన, ఇతఃపూర్వము ఈ ప్రపంచమంతయు అవ్యవస్థితముగా, తలక్రిందు

లుగా నున్నదని చెప్పుట కాదు. ఆర్థికప్రపంచమును ఎచ్చటనైనను ప్రస్తరించిన, అంతర్గతముగా ఏవోకొన్ని సూత్రములు లభించును. నిర్ణీతప్రణాళికాబద్ధము గాని ఆర్థికవ్యవస్థలో చరమలక్ష్యము అగమ్యము. అసలు చరమలక్ష్యమే లేదు. పెట్టుబడిదారుడు వ్యష్టిగా ఉత్పత్తిచేయును. ఇట్లే ప్రత్యేకవ్యక్తులు వివిధలక్ష్యములతో ఉత్పత్తి సాగింతురు. ఈ లక్ష్యములు అన్యోన్యవైరుధ్యముతో అవ్యవస్థితముగా పరిణమించును. కావున వ్యష్టిలాభముగాని, సమష్టిసౌభాగ్యముగాని సంపూర్ణముగా సిద్ధింపవు. నిర్ణీతప్రణాళికాబద్ధము గాని ఆర్థికవ్యవస్థకు వ్యక్తుల వాంఛాప్రవృత్తి ఆద్యప్రాతిపదిక (Fundamental basis). ప్రత్యేకవ్యక్తులు సమష్టిమీద పరోక్షముగా ఉత్పత్తిసంపదలకు రూపరేఖలను దిద్దుచున్నారు. సమష్టిపరముగా అందరపై ఉత్పత్తి ఆధారపడియుండుట సత్యముగాని, ఏ వ్యక్తియు ఉత్పత్తిని నిర్దేశించలేదు. ఆర్థికప్రణాళికాబద్ధమైన వ్యవస్థ అనిన నిర్ణీతఆశయసంసిద్ధికొరకు సమష్టి సమ్యక్సాన్నవ (Total conscious preparation) నిర్ణీత ఆశయసంకల్పము లేనిదే ఆర్థికప్రణాళిక అనవసరము. కావున వ్యవసితార్థము ఏమనగా—ఆర్థికప్రణాళిక అనిన, అధికారాయత్తమైన సమష్టిసాధనతో ఉత్పత్తిప్రాధాన్యక్రమములను, వినియోగపద్ధతిని నిర్ణయించుట.

ప్రపంచమందలి ఆర్థికసంపద, దేశమందలి ప్రకృతిసంపద పరిమితములు. ప్రజలందరియొక్కయు అన్ని అవసరములకు సరిపోవునట్లుగా ఉత్పత్తి జరుగదు. ఏ ఏ పరిశ్రమలు ముందుగా అభివృద్ధి చెందవలెనో, ఏ ఏ పదార్థములను ఎంతెంత ఉత్పత్తిచేయవలెనో సూచించు పారిశ్రామికప్రాధాన్యక్రమములను నిర్ణయించుట ఆర్థికప్రణాళికలలోని ముఖ్యాంశము. ప్రస్తుతము ఉత్పత్తి నియమములు లాభదృష్టితో నడచుచున్నవి. కాని ఆర్థికప్రణాళికలు ఉత్పత్తిని లాభము ననుసరించికాక, ప్రజల అవసరములను అనుసరించి నడపును.

ఆర్థికప్రణాళికలను సాధించుటకు సామ్యవాద ప్రభుత్వము (Socialist Govt.) ఉండనక్కరలేదు. ముఖ్యపరిశ్రమల నన్నిటిని ప్రభుత్వము స్వయముగా ప్రత్యక్షముగా, పరోక్షముగా నిర్వహింపవచ్చును.

ఆర్థికప్రణాళికలు దేశములో నున్న ప్రకృతి సంపదనంతయు సక్రమముగా ఉపయోగించి, జనావసరములను తీర్చుటకొరకై ప్రతిఉత్పత్తిసాధనమును, ప్రతి ఆర్థికసంస్థను, ప్రతిపరిశ్రమను ఆర్థికవ్యవస్థలోని ఒక ఉపాంగముగా పరిగణించును. ఉత్పత్తియందు నిమగ్నమైన ప్రతిపరిశ్రమయు ఆర్థికప్రణాళికపై ఆధారపడియుండవలెను. సర్వపదార్థముల ఉత్పత్తి, వినిమయములకు సామరస్యము (Co-ordination) ఉండవలెను. ఈ లక్ష్యములనన్నిటిని సాధించుటకు ఒక కేంద్రసంస్థ ఉండవలెను. అనగా ఆర్థికప్రణాళికల ప్రధానలక్ష్యములు మూడు: ౧. దేశముయొక్క ప్రకృతిసంపద సర్వస్వమును వశపరచుకొనుట, ౨. ఉత్పత్తికిని, ఉపయోగమునకును సామరస్యమును కల్పించుట, ౩. ఆర్థికజీవనములో ఒడుదొడుకులు లేకుండ అభ్యుదయము కల్పించుట. ఈ పరమార్థములను సాధించుట కొరకే ఒక కేంద్రసంస్థను ఏర్పాటుచేయవలెను.

వస్తువుల వినియోగము ఆర్థికప్రణాళికల ముఖ్యాశయమైనచో, ఉత్పత్తి ఆ ఆశయమును సాధించుటకు మార్గము. ఉత్పత్తి లేనిదే వినియోగమునకు అవకాశము లేదు. కాని ఆధునికఆర్థికరంగమున ఉత్పత్తికంటె ఉత్పన్నమైన పదార్థముల వినియోగమే ఎక్కువ సమస్యలను రేకెత్తించినది. ప్రస్తుతము వినియోగము ధనము ద్వారా జరుగుచున్నది. ఆ ధనము ఉద్యోగమువలన (Employment) దొరకుచున్నది. ఈ వినిమయములో లోటులు రెండు: ౧. అందరకును పనిచేయుటకు, అనగా ఉద్యోగములు సంపాదించుటకు తగిన అవకాశములు లభించుటలేదు. ౨. జీతములు కృషికి తగినట్లుగా కాక, ఉత్పత్తిచేసిన వస్తువుల ధరలప్రకారము వచ్చుచున్నవి. ఈ రెండును పరస్పరాశ్రయములు. నిరుద్యోగము, అక్రమవినియోగము, రెండును వస్తువులు అవసరములకు తగినట్లుగా ఉత్పత్తి కాకుండుటచే ఏర్పడినవి. కొన్నివస్తువులు అవసరములకు మించి ఉత్పత్తి అగుచున్నవి. మరికొన్ని అవసరములకు తగినట్లుగా ఉత్పత్తి అగుట లేదు. మొదటిపక్షములో

ఉత్పత్తిలో పాల్గొనువారికి తక్కువగాను, రెండవ పక్షములో హెచ్చుగాను జీతములు ముట్టుచున్నవి. ఏలన ప్రథమవర్గములోని వస్తువులకు తక్కువధర, ద్వితీయవర్గములోని వస్తువులకు హెచ్చుధర ఉండుట సహజము. కావున ఆర్థికప్రణాళికాకర్తలు కార్మికులకు వేతనములు నిర్ణయించుట, వస్తువులకు ధరలు నిర్ణయించుట చేయవలసియున్నది.

ఉత్పత్తిసాధనములలో జనావసరములను అనుసరించి మూలధనమును వినియోగించిన, ఈ రెండు నష్టములను కొంతవరకైనను తీర్పవచ్చును. దేశములోని సంపద అంతయు సక్రమముగా ఉత్పత్తిసాధనములలో వినియోగించిన, ఒక పరిశ్రమలో అధికోత్పత్తియు, మరియొకదానిలో అల్పోత్పత్తియు ఉండదు. ఏ వస్తువులు ఎంత ఉత్పత్తి కావలెనో, మొట్టమొదటనే నిర్ణయము జరుగును.

ఆర్థికప్రణాళికలు దేశావసరములనుబట్టి మారుచుండుట సహజము. దేశదేశముల సమస్యలు విభిన్నములు. కావున ఒక దేశమునకు పనికివచ్చిన ప్రణాళిక వేరొక దేశమునకు పనికిరాకపోవచ్చును. అంతర్జాతీయ ప్రణాళిక నిర్మించి, తదనుగుణముగా దేశదేశముల ఆర్థిక వ్యవస్థను తీర్చిదిద్దుట ఎంత వాంఛనీయమో, నేటికాలమున అంత అసాధ్యము. ప్రథమసంగ్రామానంతర ఆర్థిక చరిత్ర ప్రతిదేశమును అన్యోన్యసహకారము నెఱపవలసిన ఆవశ్యకతను నిరూపించుచున్నది. ప్రతిదేశమును తమతమ అవసరములను మాత్రమే దృష్టియందిడుకొని, ఇతరదేశస్థితిగతులను గమనింపనియెడల ఆ దేశములు తమ ఆర్థికసౌష్ఠవమును నిలుపుకొనలేకపోవుటయే కాక, ఆర్థికసమస్యలను లేవదీయును.

అంతర్జాతీయార్థికసహకారావశ్యకత ౧౯౨౯లో ఆరంభించిన ఆర్థికమాంద్యము నిరూపించినది. ఆర్థిక ప్రణాళికలు, ఆర్థికపునర్నిర్మాణము ఆనాటినుండియే మరింత ప్రాముఖ్యములోనికి వచ్చినవి. అంతకుముందు రష్యాలో ప్రథమపంచవర్ష ప్రణాళిక ౧౯౨౮ సంవత్సరములో ఆరంభించినది. ఆనాడు రష్యా ఆర్థికముగా చాల హీనస్థితిలో నుండెను. విప్లవసంక్షోభము ౧౯౩౨ నాటికి సమసిపోయినను, ఆర్థికఆంక్షలు (Economic Sanctions) రష్యాపై ఉన్నవి. ఇతర దేశములు రష్యాతో వర్తకముచేయ నిరాకరించినవి. అట్టి విషమస్థితిలో రష్యాప్రభుత్వము పంచవర్ష ప్రణాళికను ఆరంభించినది. అంతర్జాతీయస్థితి సుముఖము కాకపోయినను, ఆ ప్రణాళిక జయప్రదముగా కొనసాగినది. వెంటనే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆరంభమైనది. రష్యా ఆర్థికముగా, పారిశ్రామికముగా ఈ ప్రణాళికల వలన అభ్యుదయమార్గగామి అయినది. రష్యాలోని ఈ ప్రణాళికలు ఇతరదేశములలో ఆశలను రేకెత్తించినవి. పారిశ్రామికముగా వెనుకబడిన దేశములలో నిర్ణీతప్రణాళికల ప్రకారము ఆర్థికపునర్నిర్మాణము జరిగిన ఎంత త్వరలో ఆర్థికాభ్యుదయము కలుగునో అను విషయమునకు రష్యాలోని పంచవర్ష ప్రణాళికల విజయము ఉదాహరణప్రాయమైనది. ప్రతిదేశమందును తమ తమ ఆర్థికవిధానములకు రూపురేఖలను దిద్దుటకు సంఘము లేర్పడినవి. ౧౯౨౯లో ప్రారంభమైన ఆర్థికమాంద్యము దేశదేశముల ఆర్థికవిధానములను మూకటివేళ్లతో పెళ్లగించినది.

మన దేశమందుకూడ రష్యాలో ఆర్థికప్రణాళికల విజయము ఆశాంకురములను రేకెత్తించినది. ఆర్థిక పునర్నిర్మాణమునకు ముందు రష్యాకూడ మన దేశము వలెనే ఆర్థికముగా చాల వెనుకబడియుండెను. ఒక్కసారిగా రష్యా ఈ పంచవర్ష ప్రణాళికలవలన ఆర్థికౌన్నత్యమును సంపాదించినది. మన దేశములోకూడ అట్లే జరుగుటకు అవకాశములు కలవని మన జాతీయనాయకులు గుర్తించినారు. ౧౯౨౯ లో ప్రారంభమైన ఆర్థిక మాంద్యము వ్యవసాయిక దేశములకు హెచ్చుగా తగిలినది. వ్యవసాయిక పదార్థముల ధరలు పారిశ్రామికపదార్థముల ధరలకంటె విశేషముగా పడిపోయినవి. మన దేశము ప్రాయికముగా వ్యవసాయిక దేశమైయుండుట వలన నిస్సహాయత వ్యక్తమయినది. మన దేశములోకూడ పరిశ్రమాభివృద్ధి జరుగవలయు ననువిషయము సువ్యక్తమయినది. దానితో ప్రభుత్వము చిరకాలము నుండి అవలంబించిన స్వతంత్రవ్యాపారపద్ధతి మన కొనర్చిన నష్టమును, ఆర్థికప్రణాళికల ఆవశ్యకతయు వ్యక్తమయినది.

౧౯౩౫ నూతనరాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చినపుడు వివిధరాజకీయపక్షములు తమ ఆర్థికసిద్ధాంతములను ప్రతిపాదింపవలసిన తరుణము ఆసన్నమయినది. వివిధరాష్ట్రములలోని ప్రజానాయకులు మంత్రిపదవులను స్వీకరించినపుడు సంపాదించిన అనుభవము ఆర్థిక ప్రణాళికలను నిర్మించుటకు దోహదము కల్పించినది. వివిధరాష్ట్రములలోని కాంగ్రెసుపరిశ్రమశాఖామాత్యులు సమావేశమై వివిధ ఆర్థికసమస్యలను చర్చించినారు. కాంగ్రెసువారు జాతీయప్రణాళికాసంఘము నొకదానిని (National Planning Committee) ఏర్పరచినారు.

ఆర్థికనిర్మాణము ఒక నిర్ణీతప్రణాళికను అనుసరింపవలయు ననుట సర్వసమ్మతము. కాని ప్రణాళికల స్వరూపనిరూపణమున భేదాభిప్రాయములు తీవ్రముగా నున్నవి. ఈ భేదముల చర్చ విషయాంతరము. కాని దిఙ్మాత్రముగా వానిని ఈ వ్యాసమున సూచింపవచ్చును.

ఆర్థికప్రణాళికలు ప్రస్తుతసాంఘిక వ్యవస్థలో, అనగా ధనికవాదములో ఆచరణసాధ్యములా ? సామ్యవాదమందే ఆర్థిక ప్రణాళికలు కార్యరూపమును దాల్చునుగాని, ధనికవాదమునందు నిరర్థకమగు నని ఎవ్వరును చెప్ప సాహసింపరు. కాని ధనికవాదములోని ఆర్థికప్రణాళికల లక్ష్యము వేరు; సామ్యవాదములో వేరు. జర్మనీ ఇటలీదేశములలో ఫేసిజం (Fascism) అను నిరంకుశరాజ్యాంగవిధానము అమలులో నుండెను. ఆ విధానములో ప్రభుత్వము సర్వపరిశ్రమలమీదను అధికారము నిర్వహించును. కొందరు పోటీలేకుండా పరిశ్రమలలో లాభము తీయగలరు. ఈ విధానములోకూడ ఉత్పత్తి లాభాపేక్షతోనే జరుగును; కార్మికులకు తక్కువవేతనము లిచ్చి, వారిని సంఘములుగా ఏర్పడనీయక, కొందరకుమాత్రము లాభము కల్పించును; ఈ లాభములు యుద్ధసామగ్రి నుత్పత్తిచేయుటకు ప్రభుత్వము ఉపయోగించును. యుద్ధసామగ్రి ఉత్పత్తిలో పాల్గొనని పెట్టుబడిదారులకుగాని, కార్మికులకుగాని ఇది లాభదాయకము కాదు. నిరంతరము అధికమగుచున్న ఉత్పత్తివిక్రయముకొరకై తయారైన యుద్ధసామగ్రిసహాయముతో అట్టి రాజ్యాంగవ్యవస్థకల రాజ్యములు యుద్ధసన్నాహములు చేయక తప్పదు. అందువలననే ప్రపంచసంగ్రామములను ఫాసిస్టురాజ్యములు ప్రారంభించినవి. ఈ స్థితిగతులే ఇంగ్లాండు, అమెరికా దేశములందు ప్రస్ఫుటముగా కాకపోయినను, అంతర్గర్భితముగానైనను కన్పించును. ఈ పద్ధతిలో సామాన్యమానవుల ఆర్థికసౌభాగ్యము వృద్ధిపొందలేదనుట సుస్పష్టము. అమెరికాలో అధ్యక్షుడు రూజువెల్టు అవలంబించిన న్యూ డీల్ (New Deal) మరియొక పద్ధతి. ఇది ఉత్పత్తివిషయమై జోక్యము కలిగించుకొనదు. పారిశ్రామికులకు చౌకగా పెట్టుబడి సరఫరాచేయుటయు, సామాన్యజనుల కొనుబడిశక్తి హెచ్చించుటకొరకై వారి వేతనములను హెచ్చించుటయు దీనిలోని ముఖ్యసూత్రములు. ఈ మార్గము ననుసరించిన, ఆర్థిక విధానములో ఏ మార్పును కలుగదు. సామాన్యజనుల కొనుబడిశక్తి హెచ్చించినపక్షమున, పెట్టుబడిదారులకు లాభములు తగ్గనిపక్షమున, ఉత్పత్తికి దోహదము కలుగును. ఈ పద్ధతిని అమెరికాలో ప్రభుత్వము వ్యాపారమునకు, పరిశ్రమలకు చేయూత నిచ్చినది. కాని ౧౯౩౭ నాటికి ప్రభుత్వము ధనోల్బణమును తగ్గించిన వెనువెంటనే మరియొక ఆర్థికమాంద్యము ఏర్పడినది. యథార్థమునకు ఈ న్యూడీల్ మొదటి ఆర్థికమాంద్యము నెదుర్కొనుటకు చేసిన తాత్కాలికోపశమనము కాని ఆర్థిక ప్రణాళిక కాదు.

లాభములే లక్ష్యములుగా నుంచుకొని జరుగు ఉత్పత్తివలన అధికోత్పత్తికాని, జీవితసౌభాగ్యాభివృద్ధిగాని జరుగదు. జర్మనీ, ఇటలీదేశములలోని ఆర్థిక ప్రణాళికలవంటివి సామ్రాజ్యవాదమునకు ప్రాతిపదిక లగుటవలన భయంకరయుద్ధములకు దారితీయును. అమెరికాలోని న్యూడీల్ ఆర్థికప్రణాళికక్రింద పరిగణింపవలనుపడదు. ఒక్క రష్యాలోమాత్రము ఆర్థికప్రణాళికలు జయప్రదముగా సాగినవి. అనగా ఆర్థికప్రణాళికలు సామ్యవాదసిద్ధాంతములు అమలులో నున్న దేశములలో మిక్కిలి జయప్రదము లగును.

ఉత్పత్తిసాధనము లన్నియు ప్రభుత్వమే వశము చేసికొని, పరిశ్రమల నన్నిటిని నిర్వహించుట వేరు

మన దేశములో సాధ్యము కాకపోవచ్చును. వ్యక్తి
స్వాతంత్ర్యమునకుకూడ అద్యతనభారతదేశమున చాలవరకు
వీలున్నది. మన దేశము ఆర్థికముగా అభివృద్ధికాకపోవుట
వలనను, పారిశ్రామికాబద్ధముగాని ప్రకృతిసంపద విరి
విగా నుండుటచేతను, ఉత్పత్తిఅయిన వస్తువుల విక్రయ
మునకు బహుశావకాశము లుండుటచేతను, మన దేశ
ములో కొంతవరకైనను ధనికవాదమునకు భవిష్యత్తు
కలదని పలువుర అభిప్రాయము. అది దేశమునకు లాభ
దాయక మనికూడ వారి విశ్వాసము. స్వదేశపరిశ్రమలకు
రక్షణలిచ్చి, యథోచితవ్యక్తిస్వాతంత్ర్యమును ప్రోత్స
హించి, మనము లాభము పొందవచ్చును. కాని ఆర్థిక
ప్రణాళికల విజయము ప్రభుత్వవైఖరిమీదనే ఆధారపడి
యుండునని మాత్రము విస్మరింపరాదు.

భారతదేశము పాశ్చాత్యదేశములవలెనే పరి
శ్రమాభివృద్ధిని పెంపొందింపవలయునా, లేక కుటీర
పరిశ్రమలద్వారా, గృహపరిశ్రమల మూలమున ప్రతి
గ్రామమును స్వయంపరిపోషకముగాను, స్వయంసమృ
ద్ధముగాను చేసి, ప్రాచీనార్థికవిధానమును పునర్నిర్మించ
వలెనా ? ఈ సూచన వేరొకవ్యాసమున చర్చనీయము.
కాని గాంధీమహాత్ముని ఆదేశానుసారము యంత్రాలయ
ములనుగాక చేతిపరిశ్రమలను, కుటీరపరిశ్రమలను వృద్ధి
చేసినయెడల, సామాన్యజనుల ఆర్థికసౌభాగ్యము వృద్ధి
యగునని ఆర్థికశాస్త్రవేత్తలకు నమ్మకము లేదు. ప్రధా
నముగా నేడు పరిష్కరింపవలసిన సమస్య దారిద్ర్య
సమస్య ; దరిద్రనారాయణుల వాంఛాపరితృప్తి. అతు
రుల ఆర్థికవాంఛలు పరితృప్తినొందుటకు అధికోత్పత్తి
అవశ్యకర్తవ్యము. అధికోత్పత్తి యంత్రపరిశ్రమలద్వారా
గాని లభింపదు. మన దేశములో దారిద్ర్యము అంత
రింపవలెననిన విషయవాంఛాసంయమప్రబోధముకంటె
యంత్రపరిశ్రమలద్వారా అధికోత్పత్తి ముఖ్యావసరము.

ఈ దృక్పథమునుబట్టి మన దేశములో తయారు
కావలసిన ప్రణాళికకును, ఇతరదేశములలోని ఆర్థిక
ప్రణాళికలకును భేదమున్నది. ఇతరదేశములు ఆర్థిక
ముగా అభ్యుదయపథమం దున్నవి. అచ్చటి ప్రధాన
సమస్య నిరుద్యోగనిర్మూలనము, సమానవినిమయము ;
మన దేశములో జీవితసౌభాగ్యాభివృద్ధి ప్రథమలక్ష్యము,
ప్రధానలక్ష్యము. పాశ్చాత్యదేశములలో జీవితసౌభా
గ్యము ఇదివరకే హెచ్చుగా నున్నది. మన దేశములో
అనేకులకు ప్రాథమికావసరములకు సరిపోవు ఆదా
యము లేదు. మన దేశములోని ఆర్థికప్రణాళికల జమిలి
లక్ష్యములు అధికోత్పత్తి, జీవితసౌభాగ్యాభివృద్ధి అనుట
సర్వజనీనాశయము. అధికోత్పత్తి వ్యక్తిస్వాతంత్ర్యములో
కూడ కలుగవచ్చును ; కాని సత్వరముగా కాదు ; ఒక
అవధిని దాటికూడ పోలేదు. అందువలన మనము ఒక
నిర్ణీతకార్యప్రణాళికను అనుసరింపకతప్పదు.

జీవితసౌఖ్యము ధనసంపదపై, వస్తుసముదాయ
ముపై మాత్రమే ఆధారపడియుండ దనుట నిశితసత్య
ము. ధనసంపద సాధనముకాని సిద్ధి కాదు. పురుషార్థ
ములలో (Human values) అర్థము ఏకదేశమే ;
అర్థము సాధింపలేని ఆనందానుభవములు ఎన్నిగో
కలవు. ఈ పారమార్థికానుభవములకు ధనచిందితమైన
విలువ కట్టలేము. ఐహికాన్వేషణలో అతిలోకమైన
ఈ అనుభవములను విస్మరింపరాదు. పురుషార్థములను
గణితశాస్త్రమునుబట్టి నిర్వచింపలేము. కావున ఆర్థిక
ప్రణాళిక అనిన, పురుషుడు పురుషార్థములను నిర్వహిం
చుటకు వలసిన భౌతిక, మానసిక శక్తులను, పూర్ణవికాస
మునకు తోడ్పడు వస్తుసంపదను వినిర్మించు కార్య
క్రమమే. ప్రణాళిక పరమలక్ష్యమును సాధించు సాధ
నమే. ఆర్థికాశయములు పారమార్థికాశయములకు వైరు
ధ్యము కల్పింపరాదు. ఆర్థికప్రణాళికలు పారమార్థిక
పురుషార్థసాధనమునకు పూర్వరంగము.



# గూడూరి శాసనమందలి పల్లవరాయడు



— శ్రీ కొత్త భావయ్యచౌదరి —

తెలింగాణాశాసనసంపుటములోని గూడూరుశాసనమునుబట్టి కాకతిరాజగు బేతభూవిభుడు కొరవిదేశమున (ఓరుగల్లుప్రాంతము) పాలించుచు చిన్నవాడై యుండగా, విరియాల యెఱ్ఱనృపాలుని భార్య కామసాని యాతనికేతబట్టి, యాతనిమీదికి యుద్ధమునకు వచ్చిన కొండయనాయకుడను పల్లవరాయని జంపి, బేతభూవిభుని తిరిగి కొరవిదేశమున పునఃప్రతిష్ఠించినట్లు విశదపడుచున్నది. కాని యీశాసనమును తిరిగి హైదరాబాదు పురాతత్వశాఖవారి ౧౩ వ ప్రచురణములో ప్రకటించిన శ్రీ డాక్టరు శ్రీనివాసాచార్యులుగా రిందలి గాథ కల్పితమైయుండు నని యీక్రిందివాక్యములలో తెలిపియుండిరి :

"While the Gudur inscription seems to be an early forgery of an ambitious Viriyala Chiftain who schemed to foster and perpetuate a tradition that his ancestors have saved the ruling Kakatiya dynasty in a critical moment''

(Hy. Arc. Ser. No, 13, Part I, p. 15.)

ఈగాథ నిజమైన దగునేమో యనుటకు ఏమైన ఇతరాధారములు దొరకునేమో యని పరిశీలించుటయే యీవ్యాసమునకు కారణము.

త్రిభువనమల్ల బేతరాజు (బేత II) మొదట పశ్చిమచాళుక్యచక్రవర్తియగు త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యసామంతుడై యాతని బిరుదము వహించెను. ఆతని కుమారుడగు రెండవ ప్రోలరాజుకాలములో విక్రమాదిత్యునితర్వాత రాజ్యమునకు వచ్చిన తైలపదేవుని బంధించి, విడిచిపెట్టి యప్పటినుండియు నతడు స్వతంత్రు డయ్యెను. బేతరాజుకాలమునుండియు నీ వంశీయులు స్వతంత్రులగుటకు ప్రయత్నించుచుండి రని మన మూహించుట సత్యేతరము కాజాలదు. ఇట్టి ప్రయత్నములందు బేతరా జున్నప్పుడు, త్రిభువనమల్లుడగు విక్రమాదిత్యుడు ఆతని నణచివేయుటకై తన సేనాధిపతులనో, సామంతులనో యుద్ధమొనరించి రమ్మని పంపుట యసంభవముగాదు. పల్లవనృపాలు రెవ్వరైన ఈ విక్రమాదిత్యుని సామంతులుగా నున్నారేమో విచారించినయెడల నీవిషయము స్పష్టపడగలదు. గూడూరుశాసనము జూచినచో నం దొక పల్లవనృపాలుడు గన్పడుచున్నాడు. గూడూరులో జినాలయముండెను. ఆ జినాలయమునందలి కనకసేనభట్టాచార్యుల ను గురువునకు గూడూరుపల్లకరస యను పేరుగల వాడును, త్రిభువనమల్లుని సామంతుడు నగువాడు చాళుక్యవిక్రమ ౩౦ సం॥లో (క్రీ. శ. ౧౧౦౬) కొంత భూమి నొసగి శాసనము వ్రాయించెను. ఆప్రదేశము పల్లవరాజస్వాధీనములో నుండి, త్రిభువనమల్ల విక్రమాదిత్యుని కతడు సామంతుడైనట్లు అందలి యీ క్రింది పంక్తులు తెలుపును:

"౪. నిత్యపూజాలయ స్సర్వాం శ్రీపల్లవజినాలయం । స్వస్తిస

౫. మస్తభువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభమహారాజాధిరాజపరమే

౬. శ్వర పరమభట్టారక సత్యాశ్రయకులతిలక చాళుక్యాభరణం

౭. శ్రీమత్త్రిభువనమల్లదేవరు కళ్యాణపురదనెలె విడినోళ్ సుఖ సంకథా

* * ౧.* * (ఈ పంక్తులు వదలితిమి)

౧౪. వామాదిసమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామణ్డలేశ్వరం గూండూ

౧౫. రహల్లకరసర్ | స్వస్తిశ్రీ చాళుక్యవిక్రమ వర్షేడ

౧౬. ౨౯ నెయ ప్రభవసంవత్సర పౌష్యన అమావాశే ఆదిత్యవార

* * * * *

౨౪. ఇన్తినీరుమం ద్రవిళసంఘాశ్రయ మప్ప పల్లవా

౨౫. జినాలయకొట్టి * * *

౨౬. * * * *

౨౭. * * * * స్వస్తిశ్రీ జగతీతైకతిళ

౨౮. కే త్రిభువంద్రన (ం) క్షే పురే శ్రీమత్పల్లవ రాజఖడ్గజలతో

౨౯. దుగోణ యశే స్పోదరే | చూతారామను సుగన్ధశాలివనకే సంతిష్ఠ"

(తె. శా. పుట ౧౨౮, ౧౨౯)

ఈ పల్లవసామంతుడుగాని, యిట్టి మరియొక పల్లవసామంతుడుగాని చేతరాజు తిరుగబడిన కాలములో సారవ విక్రమాదిత్యుకు పంపగా, వాతడు విరియాల కుటుంబమువారిచే జంపబడియుండవచ్చును. అందుచేత గూడూరిశాసనమందలి విషయము చారిత్రాంశ మనియే నమ్ముటకు వీలున్నది. కాని డాక్టరుగా రూహించి నట్లు కేవలము కల్పితము మాత్రము కాదనవచ్చును.



# శుల్బసూత్రములు



= శ్రీ గొబ్బూరు వెంకటరఘునాథకృష్ణారావు =

శుల్బసూత్రములనుగూర్చి తెలిసికొనుటకు ముందు ఒక ముఖ్యాంశము గమనింపవలసియున్నది. ప్రాచ్యప్రతీచీసంస్కృతులకు, విజ్ఞానమునకు గల వ్యత్యాసము ఒక మన స్తత్త్వములోనే కాదు, ఆదర్శములోనే కాదు, జాతి-మేధాశక్తులలోనే కాదు—అది అనేకశతాబ్దముల వ్యత్యాసము. బి. సర్కారుగారు* చెప్పినటుల అతిప్రాచీనకాలమున హైందవులు తమ ప్రకృతిమాతను, బాహ్యప్రపంచమును ఎంతో చేర్పుగా రహస్యముల నడిగి తెలిసికొని, ఆవిధముగా సంపాదించి సాధించిన విషయములను-విజ్ఞానమును హిందూ ప్రాచీనగ్రంథములలో చిరస్థాయి నొనర్చిరి. సంగతులు తెలిసి సమన్వయించుకొనగలిగినకాలదిని, ఈనాటి విజ్ఞానానికి అది మూలాధారమని స్పష్టమగుచున్నది.

హిందువుల వైజ్ఞాన, సంస్కృతివాఙ్మయములు వేదకాలమునాటికి అవినాభావసంబంధము గల్గియుండెను. వారిది ప్రపంచనాగరికతలో మహోన్నతమగు స్థానము. శుల్బసూత్రముల-అనగా ఆపస్తంబుడు మొదలగువారు సూత్రప్రాయముగా గ్రంథస్థమొనర్చిన రేఖాగణితవిశేషములకాలమున నిత్యకృత్యములలో, మతకర్మలకొరకు వారు రేఖాగణితాంశములను కనిపెట్టిరి. విజ్ఞానము కేవలము విజ్ఞానముగానే ఉండిపోలేదు- హిందువుల మతకర్మలతో నది మిళితమైపోయెను. ఇట్లు వేదకాలమునుండి హిందూమతము, విజ్ఞానములకు అవినాభావసంబంధము పొడచూపుచున్నది.

శుల్బసూత్రము లనగా నేమో తెలిసికొనుట అవసరము. ఇవి ఏవో మూలపడి, ఎవరో ధ్యానపరులు పనిలేక చదువుచుండెడి సంస్కృతగ్రంథములని సామాన్యులు అభిప్రాయపడుచున్నారు. కాని బ్రజేంద్రనాథ సీలు, తిలకు, సర్కారు మొదలగు మహానుభావుల కృషివలన "ప్రాచీనహైందవవిజ్ఞానము మిథ్యావాదము కాదు"అని తెలిసి కొనవచ్చును. శుల్బసూత్రములయం దేదేని విశిష్టత గలదా అని ఆలోచించినపుడు — దానిని గూర్చి జిజ్ఞాస నొనర్పబూనినచో అది హైందవ రేఖాగణితమునకు మూలమని తేలుచున్నది. ఈసూత్రములు రేఖాగణితములో ప్రారంభమున నొనర్పబడిన శోధనల సంపుటి. వీనితో ముఖ్యముగా ఆపస్తంబుడు, బోధాయనుడు, కాత్యాయనుడు—వీరిపేళ్లు సంబంధించియున్నవి. తమ గణిత విజ్ఞానమును మతకర్మలకు, యజ్ఞవేదులకు ఉపయోగింపవలసివచ్చినపుడు ప్రాచీనహైందవులు శుల్బసూత్రములను కన్గొనిరి. సూత్రములలో 'శుల్బ' మను మాట విశేషముగా వాడలేదు. త్రాడునకు 'రజ్జు' అనియే వ్యవహరించిరి.

'జర్నల్ ఆఫ్ ది ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాలు'నందు డా. థిబాట్ (Dr. Thibaut) గారు రచించిన ఒక వ్యాసమునందు (Sulba Sutras) తాము హిందూ విజ్ఞానమునకు గల ప్రత్యేకతను కన్గొనుట కీసూత్రములు చాల ఉపయోగించినవని చెప్పినారు.

"While unable positively to assert that the treasure of the mathematical knowledge contained in the Lilavati, Bija Ganita and similar treatises has been accumulated by the Indians without the aid of foreign nations we must search whether there are not any traces pointing to a purely Indian origin of those sciences.

* B. C. Sirkar : " Positive Sciences of the Ancient Hindus "

And such traces we find in a class of writings called Sulba Sutrams i.e. Sutras of the Cord which prove that the earliest geometrical and mathematical investigation among the Indians arose from certain requirements of their sacrifices."

ఎ. సి. బర్నెల్ గారు Catalogue of a collection of Sanskrit manuscripts నందు "కల్పసూత్రములలోని శుల్బఅధ్యాయములే బ్రాహ్మణములలో రేఖాగణితమునకు ప్రాతిపదిక" అని చెప్పినారు.

ఈసూత్రములు కొలతలతో ప్రారంభమైనవి. సరియగుచోట అగ్ని నుంచుటకేమి, ఆయా క్రతువులకు తగు వేదుల నుంచుటకేమి, నిర్దిష్టమును సరియగు కొలతలవుసరములైనవి. అనేకములగు చితుల నిర్మాణములలో రేఖాగణితపు సహాయము అత్యంతఅవసరమై, అవివ యొకనిర్మాణములను చేయవలసివచ్చెను. చతురశ్రశ్యేనచితి మొదలగువాని నిర్మాణములో చతుర్భుజములోని భుజములు సరిగా ఒకదానితో నొకటి లంబకోణమును చేయవలసియుండెను. రెండు చతురశ్రముల మొత్తము వైశాల్యమునకు సరియగు వైశాల్యము గల మరియొక చతురశ్రము నొనర్పవలసియుండెను. దీర్ఘచతురశ్రములను చతురశ్రములుగాను, చతురశ్రములను దీర్ఘచతురశ్రములుగాను, ఒక వృత్తమునకు సరియగు వైశాల్యము గల చతురశ్రమును నిర్మింపవలసియుండెను.

పైనిర్మాణముల నెట్లొనరించుట అనెడి ప్రశ్నకు సమాధానము కొంతమటుకు శుల్బసూత్రముల పరిభాషసూత్రములలో చూడగలము.

ఆ నాడు వారు సాగించిన ఈ రేఖాగణితవిషయికమగు శోధనలలో ముఖ్యమయినది — సమకోణ త్రిభుజియందలి కర్ణమునుగూర్చి: ఈ నాడు పైథాగరసుసూత్ర (Theorem of Pythogaras) మని దీనిని అనుచున్నారో అది నిజమునకు ప్రాచీన ఆచార్యులకు తెలియును. దానికి వారు ప్రతిపాదించిన ఉపపత్తిని గూర్చికూడ కొంత ముచ్చటింతము.

ఈ విషయమును గూర్చి మదరాసు క్రైస్తవ కళాశాలలో ప్రొఫెసరు డా॥ కిచిల్, యం. ఏ., పి. హెచ్. డి. గారితో మాటలాడినపుడు వారు విచిత్రమగు మరియొక సంగతి తెలియజేసిరి. పైథాగరసునకు Oriental traits గలవనియు, అతని జీవనవ్యాపారములనుబట్టి చూడ హిందూదేశపు Priesthood నకు చెందినట్లు స్పష్టముగ నున్నదనియు వారు చెప్పిరి. విశేషించి "India in Greece" అనెడి అమూల్యగ్రంథములో ఎడ్వర్డు పోకాకు దొరగారు పై విషయమును సాలంకషముగా ఋజువుచేసియున్నారు. అస లాతని నిజనామము బుధగురు డనియు, ఈ దేశమునుండి వలస పోయెననియు వాదమున్నది. దీనినిగూర్చి ఇంకను కొంత తెలిసికొనవలసియున్నది.

ఏదేని తుదకు సారాంశ మేమనగా-అసలు సమకోణ త్రిభుజికి ఆలక్షణము గలదని వారికి తెలియుననుట నిర్వివాదాంశము. యజ్ఞయాగాది కర్మలు (Ritual) నిత్యకృత్యములలో ముఖ్యమగు భాగమగుటచేత (ఏలనో నేను చెప్పజాలను) వారు చక్కగా సరియగునటుల వానిని నెరవేర్చుట కుపయోగించునంత వరకు రేఖాగణితపు ఊత తీసికొనిరి. వ్యవహారమునకు తగినటుల ఆచరణస్వరూపము నిచ్చిరి. వారికి అవుసరమగునవి - మచ్చునకు :

i. ఒక చతురశ్రమునకు రెండింతల వైశాల్యము గల మరి యొక చతురశ్రము నిర్మించుట.

ii. రెండు చతురశ్రముల మొత్తము వైశాల్యమునకు సరియగు వైశాల్యము గల ఒక చతురశ్రము నిర్మించుట.

దీనినిబట్టి, అడిగిన ప్రశ్నకు సమాధానమునకు వలె వారు కృషిచేసి, రేఖాగణితమును సాధించి, సూత్రీకరించిరి.

(చూ. పుట ౨౩౩.) బోధాయన: 'సమచతురశ్రస్యాక్ష్ణయా రజ్జు ద్విస్తావతీం భూమిం కరోతి'

ఆపస్తంబ: 'చతురశ్రస్యాక్ష్ణయారజ్జుర్ద్విస్తావతీం భూమిం కరోతి'

కాత్యాయన: 'సమచతురశ్రస్యాక్ష్ణయా రజ్జుర్ద్వికరణీ'

తెనుగున చెప్పవలసి వచ్చినచో సమచతురశ్ర కర్ణమునకు సరియగు ఒక త్రాడు సమచతురశ్ర వైశాల్యమునకు రెండింతల వైశాల్యము గల ఇంకొక చతురశ్రభుజము నేర్పరుచుచున్నది - అనగా సమచతురశ్ర కర్ణము వర్గము (అనగా సమచతురశ్రకర్ణము భుజముగా గల ఇంకొక సమచతురశ్ర వైశాల్యము మొదటి సమచతురశ్ర వైశాల్యమునకు రెండింతలు) మిగతా భుజవర్గముల మొత్తమునకు సమానము.

(చూ. బోధాయనుడు: సూ॥ ౪౮) "దీర్ఘచతురశ్రస్యాక్ష్ణయా రజ్జుః[1] పార్శ్వమానీ తిర్యఙ్మానీచ యత్పృథగ్భూతే[2] కురుత స్తదుభయంకరోతి"

దీర్ఘచతురశ్రము కర్ణము నేర్పరిచెడి ఒక త్రాడును తీసికొందము. అది దీర్ఘచతురశ్రములోని పొడవు రేఖపై సమచతురశ్రవైశాల్యమును, పొట్టిరేఖపై సమచతురశ్రవైశాల్యమును - వాటి మొత్తమునకు సరియగు వైశాల్యము గల ఇంకొక సమచతురశ్రపు భుజము అని పై సూత్రమునకు అర్థము. అనగా కర్ణవర్గము మిగతా భుజవర్గముల మొత్తమునకు సమానమని-దీర్ఘచతురశ్ర విషయములో.

అదేసూత్రమును ఆపస్తంబుడు, కాత్యాయనుడును ఇచ్చియున్నారు. కొంత వివరణ లవసరముగాబట్టి ఈ క్రింద వ్యాఖ్యల నిచ్చుచున్నాను.

---

1. అక్ష్ణయారజ్జుః—పిదప దీనినే 'కర్ణరజ్జు' లేక కర్ణ మనిరి. ఇచ్చట వైశాల్యమునకు 'భూమి' అనిరి. దానినే తరువాతివారు 'క్షేత్ర' మనిరి. రానురాను భూమి యనగా త్రిభుజపు ఆధారరేఖ (Base)-లేక ఏదేని సమభుజి ఆధారరేఖ అనుదానికి పర్యాయపదముగా మారెను.

2. పృథగ్భూతే అనునది,రెండుభుజముల మొత్తము యొక్క వర్గము తీసికొనిరాదనుటకై ఉపయోగింపబడెను.(పృథగ్గ్రహణం సంసర్గో మాభూదితి పీఠమర్థం).

పై సంగతులను గమనించినచో పైథాగరసు సిద్ధాంతమునందు వివరింపబడిన (Particular Enunciation) విషయమును రెండువిధములుగా మన సూత్రకారులు విభజించి ప్రత్యేకము తెల్పినట్లు చూడగలము.

మరియు బోధాయనసూత్రమునందు పై అంశము వివరింపబడినది. అనేకములగు 'పైథాగోరీయను' త్రిభుజములు పేర్కొనబడినవి. మూడు భుజములును పూర్ణాంకముల నున్నచో సమకోణత్రిభుజములలో 3, ౪ అంకములు గల్గి లంబకోణమును నేర్పరచు భుజములు ౫ అంకములుగా కొలువబడెడి కర్ణమును చేయును.

(చూ. సూత్రము) "త్రికచతుష్కయోః ద్వాదశికపాంచికయోః పాంచదశికాష్టికయోః సప్తికచతుర్వింశికయోః ద్వాదశికపంచత్రింశికయోః పంచదశషట్త్రింశికయోః ఇత్యేతా సూపలబ్ధిః".

బోధాయనసూత్రములలోని కొలదిసూత్రము ఆపస్తంబునిచే వివరింపబడినవి. నిత్యకృత్యములం దెట్లుపయోగమో తెలుపబడినవి.

పిదప వేదియొక్క వైశాల్యమును కనుగొనటకు సూత్రము లొనర్పబడినవి. ౧౫, ౩౬, ౩౯ భుజములుగా గల త్రికోణము తప్పక దీర్ఘచతురశ్ర త్రిభుజమే నని తెలుపబడినది. (Rectangular triangle) వారి కవసరమైనదేమనగా "ప్రాచీ" యీదను తూర్పు పడమరరేఖ లంబముగా గీయగల్గుట.

అనేకములగు సమకోణ త్రిభుజములను (Pythogorean triangles) పేర్కొనుటయే ఉపపత్తిగా పరిగణించినాడు బోధాయనుడు. ఇది యేమి - చాల మోటుగా నున్నది అని మన మనుకొనవచ్చును. కాని అతి ప్రాచీనకాలమున రేఖాగణితమం దాసూత్రము సాధింపగల్గినవారు-మతము-వైదిక కర్మల కెడదయే లేక రేఖాగణితమునే పెంపొందింప బూనుకొన్నచో ఉపపత్తిని యూక్లిడ్‌మాదిరి ఇవ్వగలిగియే యుందురని నా అభిప్రాయము.

# అహల్య

●

= శ్రీ బొడ్డు బాపిరాజు =

మాయయ్య రామచంద్రుల - లేయడుగుల జివుళ్ల సవ్వడియె నాగుండెల్
మ్రోయుచునున్నది చల్లగ - తీయని కలలట్లు వచ్చు తెలువులలోనన్.

ఒక యాకర్షణకున్ వశంబయి తదీయోత్సేకమున్ నిల్పజా
లక చేజేతుల త్రెంచివైచితి చిరప్రాలంబిసౌశీల్యవ
ల్లిక; నెమ్మోమున ప్రాముకొంటి 'నిశిరాత్రిం'బోని దుష్కీర్తి, దా
నికె ఈ నా బ్రతుకెల్ల వ్రేల్చెద త్రపాగ్నిజ్వాల నిన్నాళ్లుగా.

మలినంబైన చరిత్రతో కటికిహేమంతమ్ము లెన్నెన్ని ని
శ్చలపాషాణతపస్యలో విదళితాశాభిన్నహృత్తంత్రులన్
విలపింతున్ పలవింతు నీకొరకు తండ్రీ! నీపదచ్ఛాయ నా
తల వ్రాల్తున్ ప్రభువా, శమింపగ హృదంతస్తాపముల్ పాపముల్.

బాష్పస్విన్నకపోలనై నిరత మేపాదాగ్రముల్ భావనా
పుష్పార్ఘ్యమ్ముల తోడితెచ్చి తుణికాముక్తవ్యథాశాంతిలో
దుష్పారమ్మగు శాపవార్ధికి రచింతున్ సేతు, వా మత్తపో
నిష్పన్నములు శ్రీపదాంబురుహముల్ నే డిందు వాసించుతన్!

ఎపుడెపుడో ప్రభుం డవతరించు దిలీపుల రాచక్రోవ నం
ద్రపుటాడి చందమామవలె, నాబ్రదుకున్ వెలిగించు నవ్వ ద
న్నపలుకె ప్రాపుగా గడపినాను దినమ్ముదినమ్ము ఈవిమే
మపు కొనదాక; నన్నిక ప్రసన్నుడవై కృప నేలుకోగదే.

కాదనలేక యింద్రియవికారమునం బడి సాధుజీవన
స్వాదుమరందపూర్ణకలశమ్మును భగ్నమొనర్చుకొన్న యు
న్మాదిని యా యహల్య యలనాడె నశించెను స్వామి, నేడు నీ
పాదరజమ్మునం బొడమివచ్చు మరొక్క యహల్య రాఘవా!

నను బ్రోచు రఘురాజనందనా రారమ్ము, పిలుచుచున్నది నిన్ను పేదతబిసి
ఇంత మెత్తని తండ్రి వెందుంటి విన్నాళ్లు? కనరావు నాయింటి కసిడికోత
ఎంత చల్లని పాద మీగుండె కార్చిచ్చు తుడిచినట్లె మంచు తొలకరించు
కడుగ నిమ్మోయయ్య, కన్నీళ్లతో, పొంగు లాగజాల నెడంద వాగులమ్మో
అమృతనిధులైన యీ చిన్ని యడుగుదమ్మి-తుదల నిశ్వాసపవనముల్ పొదవిపొదవి
తావు లెగజిమ్మగల్గునంతటి యదృష్ట- మందుకొనగల్గెలే నీ యహల్య స్వామి!

---

ఈ ఇల్లుమాత్రం తాటాకుతో నేయబడివుండడం చూస్తే తక్కినవారికంటె ఈ ఇంటివారు ధనవంతులని తెలిపో తుంది. ఇంటికెదురుగా ఉన్న ఖాళీస్థలంలో ఓ దూళ్ల పాక; పాకప్రక్కనే ఓ పెద్ద గడ్డిమేటి. చుట్టూ ఎటు చూచినా ఎత్తుగా పెరిగిన పచ్చని కొబ్బరితోట. రంయి మని వీస్తోన్న గోదారిగాలి ననుభవిస్తూ మెల్లి మెల్లిగా పరిస్థితులు జీర్ణంచేసుకుంటున్నాడు తాతగారితో పెళ్లి చూపుల కెళ్లిన భాగ్యం. వీథిలో అరుగుమీద నాలు గైదు ఈతాకుల చాపలు పరువబడివున్నాయి. ఒక దానిమీద భాగ్యం ఓ స్తంభానికి జేర్లబడి కూర్చు న్నాడు. దానిమీదే ఓప్రక్కని భాగ్యంతాతగారుమకం వేసేరు. ఇంకోదానిమీద పిల్లతాలూకు పెద్దలంతా కూర్చున్నారు. మరోదానిమీద ఓ అమ్మాయి కూర్చుని వుంది. ఆ అమ్మాయిబుర్ర భూగర్భంలో పాదుపబడి వున్నది కనుక ఆ అమ్మాయే పెళ్లికుమార్తెఅని భావించ వలసిందిగా మనవి. భాగ్యం తాతగారితో ఆ వూరు చేరుకొనేటప్పటికి సాయంకాలం సుమారు నాలుగు గంట లవుతుంది. ఓ పది, పదిహేను నిముషాలు కూర్చు న్నాక పెళ్లికూతుర్ని ఇంట్లోకి పంపించేసేరు. అక్కడ నుంచి భాగ్యంతాతగారూ, పిల్లతాలూకు పెద్దలూపురా ణాలువిప్పదీసేరు. ఓ! ఒకటేమిటి, తోటలగురించి,పొలాల గురించి, కొబ్బరికాయధరగురించి, దాళవాపంటలు, ఎండలు, వానలు, గోదావరితిప్పలు, తిత్తమ్మతిప్పలు, అంకమ్మ అప్పులు, సోమన్నబోద, విస్సయ్యపిచ్చి మొదలైనవాటినిగురించి తెగమాట్లాడేసేరు కనుచీకటి కమ్మేదాకా. ఎవరితో మాట్లాడాలో, ఏం మాట్లా డాలో కూడా తెలియక, ఎటువైపు చూస్తే ఏం ప్రమాదం వచ్చి కొంపమునుగుతుందోనని బుర్ర వాల్చి కూర్చున్నాడు భాగ్యం. తాతగారు ఓ చెంబూ, నీళ్లూ పుచ్చుకొని బయలుదేరుతూ "ఒరే భాగ్యం! ఓ సారి అలా పోయివస్తాను. నువ్వూ వస్తే రా" అన్నారు. ఆ వూరి చెరువుగట్టుప్రక్కని అకస్తాలన్నీ నిర్వర్తించు కొని, చెరువులో కాళ్లు కడుక్కుని తిరిగివస్తూ తాత గారు భాగ్యంతో ప్రసంగించేందుకు ఉద్యుక్తు లయ్యేరు.

"ఒరే భాగ్యం! చూడు వాళ్లు ఏదో యింత వున్నవాళ్లనడానికి సందేహం లేదు. నీ అదృష్టం బాగానే వుంది. మనం ఏమీ అడక్కుండానే మూడు వేలదాకా ఇచ్చేందుకు వుద్దేశమున్నట్లు సూచిస్తు న్నారు. తరువాత ఎటునుంచి ఎటు వచ్చినా రావ చ్చును. పిల్లకూడా మనకు నచ్చింది కనుక ఇప్పుడే తాంబూలాలు పుచ్చుకొని వెళితే మంచిదికాదూ?"

వినగానే నిర్ఘాంతపోయేడు భాగ్యం. తాతగారు అగ్నిహోత్రంలాంటి మనిషి. అపరిమితమైన కోప మూను. తను పట్టిన కుందేటికి మూడే కాళ్లు అనే రకం. అంటే సాహసమేమీ వుండదు. ఎవరైనా, తాను చెప్పిన దానికి ఒప్పుకోకపోతే అడ్డమైన చివాట్లు పెట్టడమే కాకుండా కొట్టేటంత పనీ చేస్తాడు (కొట్టిన సమ యాలుకూడా వున్నాయి) తనకు తెలిసివున్నంత ఇంక వరికీ తెలియదనీ, తను చెప్పిందంతా వేదమనుకోవాలనీ ఆయనవాదం. అందులోనూ తాతగారంటే భాగ్యానికి చెప్పలేనంత భయం. కాని ఇది జీవితాంతం సంబంధించే సమస్య కాబట్టి అంత చులకనగా 'ఔను, కాదు' అనడం ఎలాగు? ఏమైతే అయింది, కొంతవరకు పెనగు లాడి చూద్దామని నిర్ణయించుకొని అన్నాడు భాగ్యం సాధ్యమైనంత మృదువుగా—

"అయితే మనకు పిల్ల నచ్చిందని మీతో ఎవరు చెప్పేరండీ తాతగారూ? అసలు మీరు పిల్లవైపు ఓసారైనా చూశారా?"

"నచ్చకపోవడం ఏమిట్రా కుర్రనాగమ్మా! విశాల మైన ఇల్లూ, కావలసినంత దొడ్డీ, గేదెలూ, ఆవులూ, మూడువేలకట్నం, పండుగులకు తీసుకొనివెళ్తూ వస్తూ వుంటారు, ముద్దుముచ్చటలు సక్రమంగా జరుగుతా యనడంలో సందేహం లేదు. రత్నంలాంటి సంబంధం. తపస్సు చేస్తేమాత్రం ఇంతకంటే మంచిసంబంధం వచ్చిపడుతుందట్రా నీకు?"

"క్షమించాలి తాతగారూ, ఆపిల్లనుగురించి నేను మాట్లాడుతున్నది."

"ఆపిల్ల కేమొచ్చిందిరా, నిక్షేపంలాగ పిల్లుం టేను! చేతులు లేవనా, కాళ్లు లేవనా? సినీమా తారల్లాగ, కాలేజీ అమ్మాయిల్లాగ టింగురంగా అంటూ వుండాలేమిట్రా మొన్నాడు ఎవరితో లేచిపోయినా

సరే. ఆరిపిడుగా! 'ఇంగ్లీషు చదువుకున్న అప్రాచ్యులకు బుర్ర వుండదయ్యా, వినవయ్యా' అని ఇదివరకు ఎంతమంది నాపాదాలమీద పడి మొర్రెట్టుకున్నా నమ్మలేదుసుమా. ఇప్పుడు అర్థమైపోయిందిలే నిగ్గంతా. నచ్చకపోవడమేమిట్రా నీమొహం! నచ్చలేదుట! ఏం నచ్చలేదో చెప్పరా చూద్దాం."

తాతగారి ముఖం జేవురించింది. భాగ్యానికి భయమేసింది. తాతగారు ఉడుకుతున్నారు. ఆయనతో వాదిస్తే లాభం లేదనుకున్నాడు భాగ్యం.

"చాలా బాగానే వుందండీ తాతగారూ"

తాతగారు చల్లబడ్డారు.

"ఇంకేంరా మరి? అదేరా బాబూ సంసారపక్షం అంటేను! ఏదో తెలియక అన్నావు. దానికేంలే? చూడు, ఏదో కాస్త నాలుగు అక్షరం ముక్కలు చదువుకుందికూడాను. అన్నీ బాగానే వున్నాయి. మరి తాంబూలాల మాటేమిటి?"

"తాతగారూ! మీరు కోప్పడకుండావుంటే ఒకటి చెప్తాను. నాకో చిన్న అనుమానం వచ్చిందండి. ఆ అమ్మాయి అంతసేపు అంతగబగబా చదివినా ఒక్క పేజీకూడా తిప్పలేదేమండీ?"

"ఒరే! చిన్నపిల్ల, ఆడపిల్లానూ! అందులో పెళ్లిచూపులు. సిగ్గుచేతా, భయంచేతా మరచిపోతే పోవచ్చును."

"లేకపోతే ఆ ముద్రణ అక్షరాలే అంత బాగా చిన్నవై వుంటాయిలెండి తాతగారూ."

"జానురా. సందేహం లేకుండా అంతే జరిగి వుండాలి. చూసేవా ఇప్పుడిప్పుడే నీబుర్ర కాస్త పని చేస్తోందన్నమాట. ఇక ఆలోచించవలసినదేమీ లేదు, స్థిరపడిందన్న మాటేకాదూ?"

భాగ్యానికి ఈసంబంధం తప్పిపోయే సూచనలేమీ కనబడలేదు. నిజానికి ఆ పెళ్ళికూతురు అంత అసహ్యంగా లేదనే చెప్పాలి. కాని అప్పట్లో పెళ్ళి చేసుకొనే వుద్దేశం లేదు భాగ్యానికి. అది గమనించే అంతా కలిసి తాతగారి నిచ్చి పంపించేరు. ఈ సంబంధం చేసుకొనేందుకు భాగ్యానికి బొత్తిగా యిష్టం లేదు. ఆతనిలో కొనవూపిరిమాత్రం ఇంకా ఏమూల నుంచో తలచూపుతూవుంది. ఇంటిదగ్గర నాన్నగారూ, అన్నగారూకూడా ఇంత కచ్చితంగా మాట్లాడుతారా! పూర్తి అంగీకారం తెలిపేందుకు ముందు ఒక రోజు వ్యవధి వున్నా ఆరోజులోనూ ఏ అవాంతరమైనా అమాంతంగా ముంచుకురాకూడదూ?

"ఇంటిదగ్గర ఇంకా నాకంటే పెద్దవాళ్లూ, నాసౌఖ్యం వాంఛించేవాళ్ళూ వున్నారు కదాండీ? తాంబూలాలు పుచ్చుకొనేందుకు ఎలాగూ నిర్ణయించుకొన్నాంకనుక ఆ పుచ్చుకొనేది మనయింటిదగ్గరే నలుగురితోనూకూడా ఆలోచించి పుచ్చుకుంటే బాగా వుంటుందని నావుద్దేశం తాతగారూ" అన్నాడు భాగ్యం. సరే నన్నారు తాతగారు.

ఇంటిదగ్గరవారు కొంచెం బిగిసేరు. కట్నం నాలుగు వేలదాకా పెరిగింది. "ఒరే, నిజానికి మనకు వెనక ఆసరా ఏమీ ఆస్తే లేదు. నాలుగురాళ్లు ఎలాగో సంపాదించి ఆపూటకాపూట గడిపేస్తున్నాం. 'మీకేముంది' అనేనా అడగకుండా ఇంతకట్నం ఇస్తామని వచ్చేవాళ్లు మనకి మళ్లీ దొరుకుతారా" అన్నారు భాగ్యంనాన్నగారు. "ఎంతకాలం అలా అకట్టుకొని కూర్చుంటావు? నీకేం తెలియదు. మనం కావాలని అనుకున్నప్పుడు మళ్ళీ సంబంధాలొస్తాయా? జరిగిపోతేనే నయం" అంది భాగ్యంతల్లి. "శుభస్య శీఘ్రం అన్నారు రా నాయనా. మానలుగురికళ్లముందు ఆమూడుముళ్లూ పడిపోతే మాకింకేం బెంగవుండదు" అన్నారు భాగ్యం ముసలమ్మగారు. "బోలెడంత డబ్బు వస్తోంది. ఆ డబ్బు పెట్టి పైన ఏచదువులు చదువుకున్నా చదువుకోవచ్చు. ఆలోచించుకో." అన్నాడు భాగ్యం అన్నగారు. తనవాటాకు వచ్చే లాంఛనాలన్నీ ఏమైపోతాయో అని సందిగ్ధావస్థలో పడి నోరు చప్పరిస్తూ ఒప్పుకోమని వేడుకుంటూన్నట్టు జాలిగా చూస్తూ నిలుచుంది భాగ్యంచెల్లెలు. ఇంట్లో ఏమూలకుపోయినా తనకు తావులేనట్లు తోచింది భాగ్యానికి. మిగిలివున్న ఆశాలేశంకూడా భగ్నమైపోయిన శబ్దం ధ్వనిస్తోంది అతని గుండెలలో. ఆమరణాంతము నిలచి వుండవలసిన పవిత్రవైవాహిక బాంధవ్యాన్ని గురించి

తర్కించుకునేందుకు ఒకక్షణమైనా వ్యవధి లేకపోయింది ఆ పెండ్లి కుమారునికి. పెండ్లి! తన భావి జీవితాని కంతకూ వెలుగునీడలను దర్శింపజేసే అనివార్యమైన అధిదేవత భార్య అని తెలుసు భాగ్యానికి. అంతవరకూ తనకు కాబోయే అర్ధాంగలక్ష్మి అడుగుజాడలలో ఆశాసౌధాలను అనంతంగా నిర్మించుకున్న భాగ్యంకండ్లకు అంధకారం అలముకుంది. ఇంతమంది ఉత్సాహానికి స్వస్తిచెప్పి 'కాదు' అనడానికి మనస్కరించలేదు భాగ్యానికి. ఆమాసంలోనే యథావిధిగా వివాహం జరిగింది.

వివాహమై మూడోనెల తిరగకుండానే పిల్ల పెద్దమనిషి ఐనదని శుభవర్తమానం వచ్చింది.

* * *

భాగ్యం బి. ఏ. చదువు పూర్తికావచ్చింది. సంక్రాంతి పండుగలు యింకా రెండుమూడు రోజులు వున్నాయనగానే మళ్లీ వచ్చేరు భాగ్యంమామగారు అల్లుణ్ణి తీసుకొని వెళ్లేందుకు. భాగ్యానికి ఈ మారు అత్తవారింటికి వెళ్లేందుకు ఎంతమాత్రం ఇష్టం లేదు. ఇప్పటికప్పుడే మూడునాల్గుసార్లు అత్తవారింటికి వెళ్లడం జరిగింది భాగ్యానికి. అప్పటి అనుభవాలు భాగ్యంహృదయంలో ఇంకా నెత్తురుచిమ్ముతూనే వున్నాయి. భాగ్యం రానన్నాడు. వస్తేనేకాని వీల్లేదన్నారు మామగారు. వెళ్లమని ఇంట్లోవాళ్లు పోరు పెట్టేరు.

భాగ్యం బయలుదేరేడు. "అది యింకా చిన్నపిల్ల. కాబట్టి సిగ్గుపడుతూవుండవచ్చు—ఆ. ఇంకా చిన్నపిల్ల ఏమిటి? అప్పుడే వివాహమై రెండేండ్లు కావస్తోంది. నిజానికి ఇప్పుడు దానికి పదిహేనేండ్లు తక్కువకాకుండా వుంటాయి. ఎంతకాలం ఏమిటి ఆసిగ్గు? ఐనాకాని, అంత సిగ్గు ప్రపంచంలో ఎక్కడైనా వుంటుందా! మాట్లాడకపోతే పోవచ్చుకాని ఒక్కసారి పొరబాటునైనా కనిపించడానికేం?— బొత్తిగా పల్లెటూరిపిల్ల కాబట్టి భయపడుతోందేమో? —మాసూర్యంభార్యమాత్రం పల్లెటూరిది కాదూ? ఇలాగే వుండేదా? వివాహమైనప్పటినుంచీ ఎంతో చనువుగా మాట్లాడుతూ తిరిగేది. సమస్తసౌకర్యాలూ తానే స్వయంగా చూస్తూవుండేది భర్తకు. అత్తవారిల్లు ఓపట్టాన్ని వదిలిపెట్టి రాగలిగేవాడా సూర్యం—ఎల్లకాలం అలాగే వుంటుందేమిటి? ఇప్పుడు పూర్తిగా మారిపోకూడదూ—" అత్తవారిల్లు చేరేదాకా ఇవే ఆలోచనలు భాగ్యానికి. కాళ్లు కడుక్కుంటూ వుండగానే వేయవలసిన కుశలప్రశ్నలన్నీ కురిపించేశేరు పెద్దవాళ్లంతా. గదిలోకి వెళ్లి ప్రయాణందుస్తులు మార్చి తెల్లబట్టలు కట్టుకొని కూర్చున్నాడు ఎంతో ఆశతో నిరీక్షిస్తూ. ఇదివరకటిలాగే ఫలహారం, టీ పట్టుకొని వచ్చి దగ్గర వుంచి వెళ్లిపోయింది అత్తగారు. కేవలం ఊహాగానాలతో ఉద్రేకించిన ఉత్సాహానికి టీ ఒక్కటీ చాలుననుకున్నాడా భాగ్యం.

* * *

భాగ్యం పరీక్షలన్నీ బాగానే వ్రాసేడు. కార్యానికి ముహూర్తం నిర్ణయించేరు. పేరటాండ్ర సద్దు పూర్తిగా అణగింది. పట్టెమంచంకోడును ఆనుకొని నుంచుంది చిట్టి (భాగ్యంభార్య అసలుపేరు చిట్టెమ్మ). అప్పటి చిట్టితీరు చూస్తే భాగ్యం అనుకున్నంత సిగ్గ కాని, భయంకాని ఆమెలో ఏకోశానా కనిపించవు. భాగ్యం చిట్టికేసి సావకాశంగా చూడడం మొదలెట్టేడు. భాగ్యం తదేకదృష్టికి చిట్టి బుర్ర వంచుకోలేదు. చూపులలో చూపులు మెలిపెట్టింది. రెండేండ్లకు మళ్లీ యిప్పుడు. చిట్టి చాలా మారింది. నిజానికి అంతే పొడుగు వున్నా ప్రతీ అంగంలోనూ నడుమంత్రపు కలిమి నర్తిస్తోంది. ఏమైనా ఆమె ఆతని భార్య. మెల్లిగా దగ్గర చేరి ఆమెభుజంమీద చెయ్యివేసేడు. ఆమె తప్పించుకునేందుకు ప్రయత్నించలేదు.

"చిట్టీ! నిద్రవస్తోందా?" అన్నాడు కొంటెగా.

"లేదు. నీకు వస్తోందా?"—వెంటనే అడిగింది చిట్టి.

భాగ్యం తెల్లబోయేడు. తాను పొరబాటు వింటున్నాడేమో—

"చిట్టీ! పాలు చల్లారిపోతున్నాయి, త్రాగరాదూ?"

"నాకు ఇష్టంలేదు. నువ్వు త్రాగు." అంది చిట్టి.

ఈ మారుకూడా పొరబాటేనా? భాగ్యానికి ఎంతో ఆశ్చర్యమేసింది. భాగ్యం పురాతనఆచారవ్యవహారాలను అంటిపెట్టుకొని, అవన్నీ బహుమాన్యములని గ్రహించే వ్యక్తి కాడు. అతనిలో విచక్షణాజ్ఞానం వుంది. భార్యలు పూర్తిగా భర్తల అడుగుజాడలకు లొంగి వుండాలనీ, వారు కేవలం పరిచర్యలకే నియమింపబడ్డ దాసీలనీ, వారు తప్పనిసరిగా భర్తలకు అధికమైన గౌరవం చూపాలనీ భాగ్యం ఎప్పుడూ భావించలేదు. అలా అనుకునేవాళ్లను కఠినంగా నిందించేవాడు. కాని చిట్టి అతన్ని ప్రప్రథమంలోనే 'నువ్వు' అని సంబోధించడం అపూర్వంగా తోచింది. "ఎంతో పరిచయరీత్యా చనువు కలిగితేనేగాని 'నువ్వు' అని ప్రయోగించం. మనకంటే ఎంతో తక్కువవాడై వుండి, మనకంటే చిన్నవాడైతేనే కాని 'నువ్వు' అని ప్రథమంలో వాడం. అలాంటప్పుడైనా 'నువ్వు' అని అనాలంటే సంకోచిస్తాం—దాని కింకా చిన్నతనం, తెలియదేమో—ఆమెతల్లి భర్తనెప్పుడూ 'అండీ' అని సంబోధించడం వినడంలేదూ. ఆమెచుట్టాలు, స్నేహితులు అందరూ మర్యాదగానే భర్తల్ని పిలవడం నిత్యమూ వింటూనేవుండే. కడకు ఆమెయింటి దాసీదికూడా "ఇవేళ మా ఆయన వూళ్లో లేరు" అని అంటూవుండే. పోనీ, యీమె వారందరికన్నా ఎక్కువ విజ్ఞానసంపన్నురాలా, కాదే. మరి ఇదేమిటి!—ఏమైతేనేం? అలా పిలవడమే బాగుంది. లేనిపోని మర్యాదలు కల్పించుకొని దూరదూరాలకు విసిరివేయబడడంకంటె ఎంతో చనువుగా 'నువ్వు' అంటేనే ఎంతో హాయిగావుంది" అనుకున్నాడు భాగ్యం.

* * *

అది నిదాఘము. ఆకల్లల్లాడుటలేదు. కిటికీ అయినా లేని గది. క్రొన్నన నూత్నదంపతులు. చెమట విపరీతంగా పోస్తున్నది. ఒక చేతితో చిట్టి నుదుటను చెదరిన ముంగురులు వెనకకుతోస్తూ ఇంకో చేతితో విసురుతున్నాడు భాగ్యం. ఎంతసేపని విసరగలడు! ఆపితే భరించరాని ఉక్క. చేతులు లాగుతున్నాయి. ఇంకా విసిరేడు. చేతులు పట్టులుతప్పేయి. విసినికర్ర క్రిందపడింది. కొంచెంసేపు వూరుకొని—

"ఒక్కసారి నీవు విసురుతావా చిట్టీ?" అన్నాడు భాగ్యం ముద్దుగా.

"నాకు చేతకాదు"—చిట్టి సమాధానం.

* * *

ఏదో పుస్తకం కావలసి అన్నగారి గదిలోకి వెళ్లి వెదుకుతున్నాడు భాగ్యం. ఇంతలో గది తుడవడానికని వచ్చింది వదినగారు. అతన్ని చూచి నవ్వుతూ "ఏమిటి భాగ్యం, ఎంతకాలమైనా మీఆవిడకు ఒక వుత్తరమైనా వ్రాయవు. నీకు సరదాలేదు" అంది. "ఏమిటోనమ్మా బద్ధకం" అంటూ పుస్తకం తీసుకోకుండానే తన గదిలోకి వెళ్లి కూర్చున్నాడు. అతని కండ్లలో నీళ్లు తిరిగేయి. తనకు సరదా లేదూ! నిజానికి ఉత్తరాలు వ్రాయడమంటే ఎంతో ఉత్సాహం భాగ్యానికి. చాలా బాగా వ్రాయగలడు. కవి కూడాను. అతనిదగ్గరనుండి ఉత్తరాలు ఎప్పుడు వస్తాయా అని చాతకపక్షుల్లాగ నోళ్లప్పళించుకొని చూస్తూవుంటారు మిత్రులంతా. భార్య దేశాంతరమందున్నప్పుడు వుత్తరాలు వ్రాసి వ్రాయించుకోడంలో వుండే ఆనందాన్ని వూహించుకోలేకపోలేదు భాగ్యం. ఐతేనేం, పెండ్లి కని చదివిన(చదివినట్లు నటించిన)రెండక్షరాలు ప్రయత్నపూర్వకంగా చిట్టి పూర్తిగా మరచిపోయిన సంగతి అతని వదినగారికేం తెలుసు పాపం! అలాంటి ఆనందాన్ని అనుభవించేందుకు యోగ్యత లేకుండాపోయింది భాగ్యానికి. మిత్రులకుకూడా వ్రాయడం మానుకున్నాడు. "తన భార్యకు కాని ఆనందాన్ని తను ఎలా అనుభవించడం? తనెందుకు చదువుకున్నాడు? తన కెందుకంత పాండిత్యం అలవడింది? తనలో లలితకళ లెందుకు మూర్తీభవించేయి? తన రచనలు తన భార్య చదువుకొని, అర్థంచేసుకొని, ఆనందించలేనప్పుడు తనెందుకు వ్రాయాలి?—లోకం ఆనందిస్తుందికాదూ?—ఎవరా లోకం! తనకు భార్యకంటే ఎక్కువదా?—నే నొక మూర్ఖుడనై, అజ్ఞానినై, నిరక్షరాస్యుడనై, రమ్యరచనావిధానమెఱుగని సామాన్యుడనై పుట్టివుంటే నా భార్యను ఇంతకంటే ఎంతో ఎక్కువగా ప్రేమింపగలిగివుండేవాడినికదా" అని విచారించేడు భాగ్యం.

పెళ్లి భార్యను తీసుకొనిరమ్మని ఇంట్లో పోరు ఎక్కువయింది. సరే ప్రొద్దున్నే బయలుదేరేడు భాగ్యం మధ్యాహ్నానికి ఆవూరు చేరుకోవచ్చుకదా అని. అన్నీ ముచ్చటలూ తీరుతాయి ఆ ప్రయాణంలో. మొదట కారు, తరువాత గోదావరిలో పడవ, ఆపైన పొలాలగట్లవెంబడి నడక. దురదృష్టవశాత్తూ మొదటికారు దాటిపోయింది. రెండో కారులో ఎక్కి దిగేడు. పడవవాళ్లు "ఇప్పుడు గాలి ఎదురు, కెరటం ఎదురు, కట్టేందుకు వీల్లే"దన్నారు. ఏం చేస్తాడుకనుక ? రేవు దాటి నడక పుచ్చుకున్నాడు. సామాన్యమా ? పదిమైళ్లు నడవాలి ఎండలో. దారిలో మంచినీళ్లైనా వుండవు. భోజనం లేదు. ధైర్యం చేసేడు భాగ్యం. సాయంకాలానికి అత్తవారిల్లు చేరుకొన్నాడు. భోజనం చేసి మధ్యాహ్నం బయలుదేరేననీ, పడవలోనే వచ్చేననీ అబద్ధమాడేడు మామగారితో. ఆషాడు అత్తగారు ఇంట్లోకి వచ్చేందుకు వీల్లేకపోగా మామగారే పెండిగ్లాసులతో టీ పట్టుకొని వచ్చి 'పుచ్చుకోవోయ్' అన్నారు.

రాత్రి పదకొండు అవుతుంది చిట్టి గదిలోకి వచ్చేటప్పటికి. భాగ్యానికి మధ్యాహ్నం భోజనం లేదు. రాత్రి భోజనం సహించలేదు. పదిమైళ్లు ఎండలో నడక. బాగా వేడిచేసిపోయింది. కాళ్లు పీకుతున్నాయి. అందులో ఎడంకాలు మరీ అపరిమితంగా లాగుతోంది. నిద్రపట్టటం లేదు. బాధ భరించడానికి శక్యంకాకుండా వుంది. జేబురుమాలు తీసి గట్టిగా పిక్కకు బిగించి కట్టేడు. ఓనిముషం బాధ తగ్గినట్లనిపించింది. తర్వాత కాలు నొక్కుకొని పోయి రెండోబాధ మొదలెట్టింది. కట్టు విప్పేసేడు. బాధ—చిట్టిని ఓసారి పిసకమని అడిగితే?—ఏమైనా అనుకుంటుందేమో ? కాళ్లు పిసికించుకునేందుకే యింత దూరం వచ్చేడేమో అనుకోదూ ?—అలా ఎందుకు అనుకుంటుంది ? బాధపడుతున్నానంటే చూస్తూ వూరుకోగలదా ? దాని బాధ నాబాధ కాదా, నా బాధ దానిబాధ కాదా? కాక ఇదివరకు దానికి కాళ్లు లాగుతున్నాయంటే నేను పిసకలేదూ ? నే నేమైనా అనుకున్నానా ? నా కెంతో ఆనందం అనిపించిందే? ఆమెకుమాత్రం ఎందుకు అలా వుండదు!— బాధ—అడగనా ?—బాధ—

"చిట్టీ! కాళ్లు లాగుతున్నాయి. నీకు పుణ్యం వుంటుంది, ఒక్కసారి పిసుకుతావా ?"

"నాకు నిద్రవస్తోంది" అంది చిట్టి.

ఎందుకు అడిగేను—

"అయ్యో చిట్టీ! నిద్రవస్తోందని ముందే ఎందుకు చెప్పలేదు ? ఈ ఉక్కలో, సుఖంగా నిద్రపడుతుందా ఏమన్నానా ? మెల్లిగా విసురుతాను నిద్రపో" అంటూ విసరడం మొదలెట్టేడు. చిట్టి నిద్రపోయింది.

భాగ్యం పక్కమీదనుంచి లేచి మంచంకోడు నానుకొని నుంచున్నాడు. చిట్టికి తనంటే ఇష్టం లేదేమో ? —అందరూ తాను చాలా అందంగా వుంటాడని అంటారే—మూర్ఖుడనా ? - బోలెడంత చదువుందే—గౌరవం లేదా అంటే - అత్తగారు, మామగారు, చుట్టాలు, వూళ్లో ఆబాలగోపాలం తన్ను నెత్తిమీద పెట్టుకుంటారే. కనబడినపుడల్లా "చిట్టీ! అదృష్టం అంటే నీదేనే. రత్నంలాంటి మొగుణ్ణి సంపాదించుకొన్నావు. మహారాణివి. ఏం నోములు నోచేవో" అననివారు లేరే—తనమీద ఏమైనా అనుమానం వుందా, అదీ లేదే—ప్రేమకు అందం గౌరవం ఏమిటే? దాని మనసు యింకెవరియందైనా లగ్నంకాకూడదూ — ఊరిమొత్తానికి చూద్దామంటే వయసొచ్చిన మగపురుగైనా లేడే. పోనీ ఇప్పటివరకూ ఆవూరుదాటి యింకెక్కడకూ వెళ్లలేదాయె—మరి ఇదేమిటి! ఇదేమిటి!!—

కాలిబాధ. కడుపులో బాధ. బొమ్మలాగ అలాగే నిలుచుండిపోయేడు. కంటినీటితో బట్ట అంతా తడిసిపోవడం గుర్తించేలేదు. తెల్లవారుతోంది. చిట్టి కదులుతోన్నట్టు అనిపించింది. గబగబా కళ్లు తుడుచుకొని నిద్రపోతూన్నట్టు చిట్టిప్రక్కనే పడుకున్నాడు. చిట్టి లేచి, లోపలికి వెళ్లిపోయింది. మళ్లీ ప్రయాణానికి ఆలస్యం అవుతుందేమోనని భాగ్యం కూడా లేచేడు.

ఆనాడు భాగ్యం పుట్టిన రోజు. అతని ఇంట్లోనే అల్పాహారవిందు ఏర్పాటుచేసేరు. మిత్రులు చాలామంది వచ్చేరు. భాగ్యాన్ని పాడమని బలవంత పెట్టేరు. భాగ్యం చక్కగా పాడగలడు. తరచు రేడియోనుండికూడా అతని పాటలు వినబడుతుంటాయి. నాలుగైదు చక్కని భావగీతాలు పాడేక మిత్రులంతా శెలవుతీసుకున్నారు. భాగ్యం లేచి తన గదిలోకి వెళ్లేటప్పటికి చిట్టి ఎదురై "ఏమి టాపాడుపాటలు అస్తమానూను" అంది. "అయితే చిట్టికి భావగీతాలంటే ఇష్టంలేదు కాబోలు!—అసలు చిట్టికి గీతాలేమిటో, భావగీతాలేమిటో, మరొకటి ఏమిటో తెలిస్తేకాదూ? —విచక్షణ ఎవరికి కావాలి? ఆవేవో పూర్వపుపాటల్లాగ లేవు. ఏమిటో క్రొత్తగా వుంది. ఇలాంటివి బయలుదేరేకే మన దేశం, భాష ఇలా తగులడిపోతున్నాయనుకునేవాళ్లు ఎంతమంది లేరు? అలాంటి ఉద్దేశాలు కలదే ఏమో చిట్టికూడా" అని తర్కించుకొని ఇకముందు చిట్టిముందు భావగీతాలు పాడగూడదని అనుకున్నాడు భాగ్యం.

రాత్రి గదిలో. కుర్చీలో కూర్చునివున్నాడు భాగ్యం. తమలపాకులు నములుకుంటూ పక్కమీద కూర్చుంది చిట్టి. చక్కని త్యాగరాజకృతి ఎత్తి హాయిగా పాడడం ప్రారంభించేడు భాగ్యం. సగం వరకూ నడిచింది కృతి. ఆగమని అరచింది చిట్టి. ఆగేడు భాగ్యం. "ఇందాకానే కదూ పాడవద్దని చెప్పింది. ఎందుకు అలా గొంతుక చించుకోడం" అంది చిట్టి. "అతి బాగాలేదూ? పోనీ ఇది చూడు" అంటూ ఇంకోకృతి ఎత్తుకోబోయేడు భాగ్యం. "వద్దు వద్దు నువ్వు ఇంకా పాడదలచుకుంటే నేను బయటికిపోతా" నని లేచింది చిట్టి. భాగ్యం లేచి చిట్టిచేయి పట్టుకొని "క్షమించు చిట్టీ. ఇంక పాడనులే. ఇంక నాజీవితంలో ఎన్నడూ పాడను చిట్టీ. రా. కూర్చో" అని బ్రతిమాలేడు.

"అమ్మా! కొంచెం తలకు నూనె రాస్తావా" అని తల్లిని అడిగేడు భాగ్యం- ఓనాటి మధ్యాహ్నం నిద్ర నుండి లేచేక బద్ధకంగా వుండి. "మీ ఆవిడ వచ్చేక కూడా నేనేనేమిటి రాయడం? దాన్ని రాయమను" అంది భాగ్యంతల్లి. ఇదివరకటిదాకా ఎంతో ఆప్యాయంతో పిలిచి బలవంతంగా నూనె రాసే తల్లి భార్య వచ్చేక, భార్యలే భర్తల సౌకర్యాలన్నీ చూచుకుంటారన్న మామూలుధోరణితో వూరుకుంది. చిట్టి రాయదు. అత డడగడు. "అడిగితే ఇదివరకటిలాంటి సమాధానమే వస్తే?—బలవంతంగా రాయించుకోకూడదూ?—అవిధంగా చేయించుకోడంలో ఆనంద మేముంది? ఆ పని చేయాలన్న ఉత్సాహం, సరదా పుట్టాలి. ప్రేమతో ముసిముసినవ్వులు నవ్వుకుంటూ, వేళాకోళానికి నుదుటనో బుగ్గలనో ఓనూనెబొట్టు రాస్తూ, దువ్వెన చేత్తో పుచ్చుకొని విలాసంగా ఎదురుగా నిలబడి తల నటూ ఇటూ త్రిప్పుతూ 'ఇలా కాదు ఆలా, అలా కాదు ఇలా' అంటూ రకరకాలుగా దువ్వి నవ్వించే భార్యచేతలలోని ఆనంద మెక్కడ? కండ్లవెంబడి నీళ్లు కారుస్తూ 'ఎందుకు వచ్చిందిరా భగవంతుడా' అని దువ్వే భార్య చేతలలోని ఆనంద మెక్కడ?" అనుకున్నాడు భాగ్యం. అతని తల నాలుగురోజులుదాకా నూనె లేకుండానే వుంది.

మధ్యాహ్నం పదకొండు దాటుతుంది. భాగ్యం ఓ చిన్న మూట చేత్తో పట్టుకొని ఇంటికి చేరుకున్నాడు. చిట్టి భోజనం చేసి నిద్రపోతోంది. భాగ్యంకూడా భోజనం చేసి గదిలోకి వచ్చేటప్పటికి చిట్టికి మెలకువ వచ్చింది. భాగ్యం మూటవిప్పుతూ "చిట్టీ! ఇవేళ నీకోసం ఏం తెచ్చేనో చూసేవా" అన్నాడు. భాగ్యానికి చిట్టిని ఏవిధంగా సంతోషపెట్టవచ్చునో ఏమీ అర్థంకావడంలేదు. అసలు చిట్టి సంతోషిస్తోందో విచారిస్తోందోకూడా తెలియడంలేదు. ఆమెను సంతోషపెట్టాలని తలపెట్టిన ప్రతిక్రియా వ్యతిరేకంగా పరిణమిస్తున్నట్టే కనిపిస్తోంది. కొందరుకొందరు స్త్రీలు అవీ ఇవీ కొనిపెడితే సంతోషిస్తారని తెలుసు భాగ్యానికి. కాని ఎలా కొనిపెట్టడం? తనేమీ సంపాదించడం లేదే? పోనీ, తండ్రి నడుగుదామా అంటే ప్రతీదానికీ ఎలా అడగడం? లేదనకుండా ఇస్తారే అనుకో. అయితే మాత్రం బోలెడంత కుటుంబాన్ని ఒక్కచేతిమీదుగా పోషింపవలసిన ఆయన కష్టసుఖాలన్నీ గ్రహించికూడా భార్యబహుమతులకని డబ్బు ఎలా పుచ్చుకోడం? ఇంక

పైచదువుకి నీళ్లు వదులుకొని ఏదైనా ఉద్యోగంలో ప్రవేశిద్దామా ?—"ఏమైతే అయింది. తరువాత చూచుకోవచ్చు"నని భాగ్యం తన మిత్రుల్లో కణ్ణి కలుసుకొని పది రూపాయలు అప్పుతీసుకున్నాడు. ఆ పదిరూపాయలూ పెట్టి రెండు మంచి జాకెట్టుగుడ్డలు కొని తీసుకొచ్చేడు. "చిట్టీ! ఇవేళ నీకోసం ఏం తెచ్చేనో చూసేవా" అంటూ గుడ్డలామెచేతి కందించేడు. చిట్టి చూచింది, "ఎందు కిలాంటిగుడ్డలు కొనడం ? డబ్బు లేకపోతే నాకు చెప్పకూడదూ, మా నాన్నగారినైనా అడిగి ఇచ్చేదానిని" అని ముఖం ముడుచుకొంది చిట్టి.

రాత్రి పది అవుతుంది. భాగ్యం ఏదో వ్రాసుకుంటున్నాడు. చిట్టి లోపలకు వచ్చి, తలుపు గడియ వేసి అతని దగ్గరకు వెళ్లి నిలుచుంది. "నిలుచున్నావేం చిట్టీ! కూర్చో" అన్నాడు భాగ్యం వ్రాసుకుంటూనే. చిట్టి ఐదునిముషా లలాగే నిలబడి, కోపంగా "ఎందుకాపిచ్చివ్రాతలు ? కాగితం దండుగ, సిరాదండుగ, దీపందండుగానూ" అంటూ వ్రాస్తూన్న కాగితం లాగింది. భాగ్యం తలుపుతీసుకొని బయటికి వెళ్లేడు. చిట్టి నిద్రపోయింది.

* * * * *

భాగ్యంకోసం వెదికేరు. లాభం లేకపోయింది.

ఒక నెల గడిచింది. చిట్టిపేర ముప్పయి రూపాయలు, అప్పుతీసుకున్న మిత్రుని పేర పదిరూపాయలూ మనియార్డరు వచ్చింది. ఇప్పటికీ ప్రతినెలా ముప్పయి రూపాయల మనియార్డరు వస్తూనేవుంది.



# ఇంగ్లండు, ఇండియాలమధ్య ఒడంబడిక

= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య =

బ్రిటిష్ ప్రభుత్వంవారి క్రొత్త రాజ్యాంగపథకంలోని ౨౨-వ పేరాయందు ఈ క్రిందిసూచన ఉన్నది: "రాజ్యాధికారాన్ని భారతీయుల హస్తగతం చేయడం మూలాన ఏర్పడే కొన్ని విషయాలను పరిష్కరించుటకు భారతరాజ్యాంగనిర్మాణపరిషత్తునకును, ఇంగ్లండునకును మధ్య ఒక ఒడంబడిక జరుగవలసిన అవసరమున్నది." ఈ ఒడంబడిక జరిగినగాని ప్రస్తుతము బ్రిటిషువారి చేతిలో ఉండు పరిపాలనాధికారము భారతీయుల చేతులలోనికి మార్చబడదని ఈ సూచనలోని ప్రధానవిషయము. ఈ ఒడంబడికయొక్క స్వరూపము ఏలాగు ఉండగలదో, ఏయే విషయములను దాని మూలముగా పరిష్కరింపవలసియుండునో ఇచ్చట సంక్షిప్తముగా వివరించబడును.

సుమారు రెండువందల సంవత్సరాలుగా ఇంగ్లీషువారు మన దేశాన్ని పాలిస్తున్నారు. దీనిమూలాన వారికిని, వారి సామ్రాజ్యానికిని ఎంతో లాభం కలిగింది. ఈ పరిపాలన తొలగడంతో ఇదివరకు వారనుభవిస్తూవచ్చిన లాభాలు పోవడమేకాకుండా కొన్ని విషయాలలో కొంత నష్టంకూడా సంభవిస్తుంది. ఇంతకాలాన్నుండీ అనుభవిస్తున్న లాభాలను పూర్తిగా పోగొట్టుకోవడం వారికి ఇష్టం లేదు. అధికారంలో ఉండేవారి కెవరికీ కూడా ఇట్టి ఇష్టం ఉండదు. ఇదిగాక, మనకు స్వరాజ్యం లభించడంమూలాన వారికి కలిగే నష్టాన్ని తగ్గించుకోవడంకూడా వారికి అవసరం. ఈ అవసరాలు తీర్చుకొనే ఉద్దేశంతో వారు ఒడంబడికయొకటి మనతో చేసుకొనగోరుచున్నారు. ఆ షరత్తుమీదనే వారు పరిపాలనాధికారాన్ని మనకు ఒప్పగించుటకు సంకల్పించియున్నారు.

మనం స్వరాజ్యాన్ని సంపాదించడంలో దౌర్జన్యాన్ని సాధనంగా ఉపయోగించడానికి నిశ్చయించుకోలేదు. ఇందుకై బ్రిటిష్‌వారితో యుద్ధం చేయడం మన నాయకుల అభీష్టం కాదు. రాజీమార్గాన మన ఉద్దేశం నెరవేర్చుకోడానికి మనం ప్రయత్నం చేస్తున్నాం. రాజీకుదరడానికి బ్రిటిష్‌వారి మాటలుకూడా కొంతవరకు మనం వినవలసిఉంటుంది. యుద్ధం చేసి వారిని దేశాన్నుండి తొలగించగలిగినప్పుడు వారితో ఏలాటి రాయబారాలుగాని, ఒడంబడికగాని అవసరం ఉండదు. కాని మన పరిస్థితులలో యుద్ధం సక్రమమైన మార్గం కాదని మహాత్మగాంధీగారు ఉపదేశించారు. ఆ ఉపదేశాన్ని అనుసరించి మనం దౌర్జన్యరహితమైన పోరాటాన్ని సాగిస్తున్నాం. రాయబారాలద్వారా మనం మన ఉద్దేశాన్ని నెరవేర్చుకోడానికి చూస్తున్నాం. అందుచేత వారు కోరే ఒడంబడికకు మనం కొంతవరకు అంగీకరించవలసిఉంటుంది. మనం కోరే స్వరాజ్యానికి ఈ ఒడంబడిక ప్రతిబంధకంగా లేనంతవరకు దీనికి అంగీకరించడంలో నష్టంకూడా ఏమీ ఉండదు.

ఇంతేగాక ఇట్టి ఒడంబడికమూలాన మనకు కూడ కొంత లాభం కలగవచ్చును. అట్లు తప్పకుండా కలుగుతుందని బ్రిటిషువారు వాదిస్తున్నారు. ఒడంబడికమూలంగా వారికి కలిగే లాభానికంటె మనకు కలిగే లాభమే ఎక్కువగా ఉండుననికూడా వారు చెప్ప

న్నారు. గనుక వారు కోరే ఒడంబడికలోని సాధక బాధకా లెట్టివో మనం తెలుసుకోవడం అవసరం.

## దేశరక్షణ

వారికీ, మనకూ జరుగవలసిన ఒడంబడికలో ప్రధానవిషయము భరతఖండముయొక్క రక్షణ. తమ యొక్క పరిపాలనాధికారము తొలగిన తర్వాత మన దేశం మరెవరి పాలనలోనికి పోకుండా మన ఆధీనంలోనే ఉండడం అత్యావశ్యకమని బ్రిటిష్‌వారి అభిమతం. మన అభిమతంకూడా ఇదేకదా? బ్రిటిష్‌వారి అధికారం తొలగిపోవడంమాత్రమే కాదు మనకు కావలసింది. విదేశీయు లెవరూకూడా ఇకమీదట మన దేశాన్ని జయించకుండా ఉండవలె ననియు, మనకు లభించే స్వరాజ్యం శాశ్వతంగా ఉండవలె ననియు మనం ఆశిస్తున్నాం.

బ్రిటిషువారి అధికారం తొలగిపోయిన తర్వాత మన దేశం రషియన్లవంటి ఇతరవిదేశీయుల పరిపాలనలోనికి రావడం బ్రిటిషువారికి ఇష్టం లేకపోవడమే కాకుండా, దానిమూలాన వారికి ఎంతో ప్రమాదం, నష్టం సంభవిస్తుంది. విదేశీయు లెవరుకూడ మనదేశాన్ని జయించలేకుండా ఉండడం వారికి చాలా అవసరం.

కాని మనం మన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలిగిన స్థితిలో ప్రస్తుతం లేమని వా రభిప్రాయపడుచున్నారు. దేశాన్ని రక్షించుకోడానికి గొప్ప సైన్యాలు, నౌకాదళాలు, ఆకాశవిమానాలు, వివిధములైన యుద్ధపరికరాలు, చక్కగా తర్ఫీదు పొంది విశేష అనుభవం కలిగిన సేనానాయకులు అత్యవసరం. ఇదిగాక దేశంలో యంత్రములను ఉపయోగించే మూల పరిశ్రమలు, కీలకపరిశ్రమలు అనేకము లున్నగాని యుద్ధములం దుపయోగించవలసిన టాంకులు, ఫిరంగులు, తుపాకులు, బాంబులు మొదలైన పరికరములను తయారుచేయుట సాధ్యముకాని పని. ఇట్టి పరిశ్రమలను స్థాపించుటకును, చక్కగ నడుపుటకును రసాయనశాస్త్రమందును, పదార్థవిజ్ఞానశాస్త్రమందును ఆరితేరిన విద్వాంసులు, పరిశోధకులు ఎందరో ఉండవలసిఉన్నది. యుద్ధపరికరములు రోజురోజూకూ ఎన్నో మార్పులను పొందుతున్నవి. క్రొత్తపరిశోధనలను నిరంతరం చేస్తూఉంటేతప్ప సరియైన పరికరాలను నిర్మించుటకు వీలుపడదు. గనుక ప్రస్తుతయుగంలో దేశరక్షణకు పరిశ్రమలు, ఆరితేరిన పరిశోధకులు ప్రధానాంగము లన్నమాట మనం మరువకూడదు.

## రక్షణవిషయములో మన స్థితి

రక్షణకు కావలసిన అంగములలో మనకు ప్రస్తుత ముండునది ఒక జనసంఖ్యయే. సైన్యానికీ, నౌకాబలమునకు, ఆకాశవిమానాలకు, పరిశ్రమలకు కావలసిన జనానికి మన దేశంలో ఏమీ లోపం లేదు. మనం నలభైకోట్ల జనం. చైనాతప్ప మరి ఏదేశంలోకూడా ఇంత జనసంఖ్య లేదు. తగిన శిక్షణ పొందినయెడల దేశంలోని వివిధరాష్ట్రములందుండు జనం చక్కగా యుద్ధం చేయగలవారని రెండవ ప్రపంచయుద్ధంవల్ల స్పష్ట మయింది. కాని సైన్యాదులను నడుపుటకు తగిన నాయకులు మన దేశములో చాల తక్కువ. గత రెండువందల సంవత్సరములనుండి బ్రిటిషువారు మాత్రమే సైన్యములందు గొప్ప ఉద్యోగులుగ నుండుట వలన మనవా రెవ్వరు నాయకులగుటకు వీలుపడలేదు. అందుచేత కొంతకాలంవరకు మనకు ఈలోపం ఉండడం తప్పదు. నాయకత్వము వహింపతగ్గవారిని తర్ఫీదు చేయుటకు కావలసిన సైనికకళాశాలలను స్థాపించి నడిపించుటకు పదిసంవత్సరములైన పట్టును. మరికొన్ని సంవత్సరములు గడచినగాని నాయకులు అనుభవవంతులు కాజాలరు. ప్రస్తుతము మన కుండు లోపములలో ఇదే మొదటిది.

ఇదిగాక మన దేశంలో గొప్ప పరిశ్రమలు అనేకములు లేవు. జంషెడ్‌పూరులోని ఉక్కుపరిశ్రమ, బొంబాయి మొదలైన పట్టణములలోని వస్త్రపరిశ్రమ తప్ప మనం పేర్కొనదగిన గొప్ప పరిశ్రమల సంఖ్య చాల తక్కువ. రసాయనికపరిశ్రమ లనేకములు దేశములో స్థాపితములైనగాని యుద్ధపరికరములను తయారుచేయుటకు వీలుండదు. ఈ విషయములో మనం ఇంకా శైశవదశయం దున్నాము. ఇరవై సంవత్సరముల కాలము తదేకదీక్షతో పనిచేసినగాని ఇట్టిపరిశ్రమలు ముందుకు

రాజాలవు. మనకు ప్రస్తుతముండు లోపములలో ఇది రెండవది.

రసాయనశాస్త్రమందును, ఇతరశాస్త్రములందును పరిశోధనచేయుచుండువారి సంఖ్యకూడ మన దేశములో చాల తక్కువ. పరిశోధనకు కావలసిన శక్తి సామర్థ్యములు, బుద్ధికుశలత గలవారు మన దేశములో లేకపోలేదు. కాని ఇదివరకు వారు ముందుకు రాదగిన అవకాశములు ఏర్పడలేదు. దేశంలో పరాయిప్రభుత్వం ఉండడంచేత ఇట్టి దురవస్థ మనకు పట్టినది. కారణం ఏదైనా ప్రస్తుతం మనకు ఈ లోపంకూడా ఉన్నది. విశ్వవిద్యాలయములలోను, పరిశ్రమాగారాలలోను పరిశోధకశాలలను విరివిగా నిర్మించి, తగిన యువకులను పరిశోధనలలో తర్ఫీదుచేయుటకు పదిపదిహేను సంవత్సరములైనా పట్టును.

సుమారు పదిలక్షల సైన్యం మన కిప్పుడు ఉన్నా నౌకాబలం చాలా తక్కువ. నాలుగువేల మైళ్ల పొడవు గల మన సముద్రతీరాన్ని పరాయివారి దాడులనుండి రక్షించుకొనుటకు ఎంతో నౌకాబలము అవసరము. ఇదే విధంగా మనకు ఎన్నియో ఆకాశవిమానాలు, వాటిని నడుపుటకు కావలసిన మనుష్యులు అత్యావశ్యము. సైన్యబలం, నౌకాబలంకంటె ఆకాశవిమానములే ఈ కాలపు యుద్ధంలో ఎక్కువ ప్రాధాన్యం వహిస్తున్నవి. వీటిని తయారుచేసుకొనుటకు కూడ పదిపదిహేనుసంవత్సరాల కాలము పట్టవచ్చును.

గనుక ప్రస్తుతం మనం మన దేశాన్ని ఇతరుల సహాయం లేకుండా రక్షించుకోతగ్గ స్థితిలో లేము. అట్టిస్థితికి మనం రావడానికి పదిహేను ఇరవై సంవత్సరాలన్నా పడుతుంది.

దేశసంరక్షణ నిమిత్తమై మనం బ్రిటిషువారి సహాయాన్ని, సఖ్యాన్ని కోరడానికిన్ని, ఇందుకుగాను వారితో ఒక ఒడంబడిక చేసుకోవలసినదానికిన్ని ఇదే ప్రధానకారణం.

ఇట్టి ఒడంబడికను మనం చేసుకొననిపక్షాన బ్రిటిషువారికిని, వారి సామ్రాజ్యానికిని గొప్ప ప్రమాదము తప్పదు.

## బ్రిటిష్‌వారికి కలుగనున్న ప్రమాదం

ఈ ప్రమాదానికి ప్రధానకారణాలు రెండు. రష్యాయొక్క ప్రాబల్యం మొదటి కారణం. బ్రిటిష్‌వారికి రష్యాతో యుద్ధం సంప్రాప్తించేయెడల అట్టి యుద్ధంలో బ్రిటిష్‌వారికి జయం రావడానికి ఇండియాయొక్క మైత్రిసహాయం అత్యావశ్య మగుట రెండవ కారణం.

గడచిన ప్రపంచయుద్ధంలో జర్మనీజపానులు ఓడిపోవుట మూలాన రష్యా, అమెరికా, ఇంగ్లండులుమాత్రమే బలము గల దేశములని చెప్పుటకు తగియున్నవి. వీటిలోకూడ రష్యాఅమెరికాలు అగ్రగణ్యములు. వారి కున్నంత బలము ఇంగ్లీషువారికి లేదు.

రష్యానుగురించి మనం రెండు విషయాలను జ్ఞాపకముంచుకొనవలెను. ప్రస్తుతము ఇది యూరపుఖండములోని బాల్టిక్ సముద్రమం దుండి ఆసియాఖండపు తూర్పుతీరములోని పసిఫిక్‌మహాసముద్రము వరకు వ్యాపించియున్నది. ఆసియాలోని మధ్యభాగమంతయు దీనిలో చేరియున్నది. మధ్యమధ్యన చీలికలు లేక, ఒకేతెన్నున వ్యాపించియుండు ఇంతటి భూభాగము మరి ఏదేశమునకు లేదు. ఎవరియొక్క అదుపు ఆజ్ఞలకూ, వెంగపోటానికీ లోబడవలసిన జరూరు లేక రష్యాలో ఒకభాగమందుండి మరియొక భాగానికి వెళ్లుటకు వీలున్నది. ఇందులో పదిహేడుకోట్ల జనం ఉన్నది. వివిధపరిశ్రమలు స్థాపింపబడియున్నవి. ఆధునికశాస్త్రములన్నిటియందును రష్యన్లు అసమానమైన ప్రావీణ్యమును చూపించుచున్నారు. సామ్రాజ్యాన్ని సంపాదించడంలో రష్యాపాలకులైన కమ్యూనిష్టులు ఏకదీక్షతో పని చేయుచున్నారు. జర్మనీని ఓడించి, యూరోపాఖండముయొక్క మధ్యభాగమందును, దక్షిణభాగమందును ఉండు దేశాలలో తమ అధికారాన్ని నిలబెట్టుకొన్నారు. ఆసియాఖండమందు ఉత్తరచైనాఉత్తరపర్షియాలలో అధికారాన్ని సంపాదించినారు. ఇంతటితో తృప్తిచెందక మధ్యప్రాచ్యదేశాల నన్నిటిని తమ అనుచరవర్గములో

చేర్చుకొన జూచుచున్నారు. రష్యాయొక్క ఈ ఆశయములన్నియు సఫలములైనయెడల రష్యన్లు హిందూమహాసముద్రప్రాంతమువరకు వ్యాపించి, ఆసియాయొక్క దక్షిణతీరమందు బ్రిటిష్‌వారితో పోటీ చేయగలవారగుదురు. ఈ పరిస్థితులలో రష్యావారికిని, బ్రిటిష్‌వారికిని విరోధము తప్పదు. గత రెండు ప్రపంచయుద్ధములలో ఇంగ్లీషువారు జర్మనీతో వైరము సాధించవలసివచ్చెను. రాబోయే మూడవ ప్రపంచయుద్ధమందు ఇంగ్లీషువారు రష్యన్లతో యుద్ధము చేయవలసిన పరిస్థితు లేర్పడనున్నవి.

రష్యాతో తమకు విరోధము సంభవించుననియు, అట్టి సందర్భములో తమకు ప్రమాదము లేకుండుటకు కావలసిన ఏర్పాటుల నన్నిటిని ఇప్పటినుంచి చేసుకొనుట అత్యావశ్యమనియు బ్రిటిష్‌ప్రభుత్వమువారి ఆలోచన. ప్రస్తుతము వారి విదేశాంగవ్యవహారమున కంతకు ఇదే ప్రధానలక్షణము. మంత్రిత్రయమువారు మనతో రాయబారము జరుపుటకుకూడ ఇదే కారణం.

బ్రిటిష్‌సామ్రాజ్యము భూగోళదృష్ట్యా రష్యారాజ్యమువంటిది కాదు. బ్రిటిష్‌సామ్రాజ్యమంతయు ఒకే భూభాగమందు లేదు. ఇది అనేక ముక్కముక్కలుగా ప్రపంచమందంతట వెదచల్లినట్లున్నది. ఈ సామ్రాజ్యముయొక్క తూర్పుభాగములో హిందూమహాసముద్రమునకు విస్తారమైన ప్రాధాన్యమున్నది. ఇది ఈ భాగమున కంతకు రాదారి. ఆఫ్రికాఖండమందు తూర్పు భాగమందుండు బ్రిటిషు సామ్రాజ్యమునుండి ఆస్ట్రేలియా న్యూజీలెండులకు హిందూమహాసముద్రము మీదుగా వెళ్లవలసియున్నది. సింహళము, బర్మా, మలయా, సింగపూరు, బార్నియో మొదలైన బ్రిటిష్ ప్రదేశము లన్నియు ఈ సముద్రములోను, దీనిని ఆనుకొనియు ఉన్నవి. ఇందులో బ్రిటిష్‌వారి నౌకలు నిరాటంకముగ ప్రయాణముచేయగలిగినప్పుడే ఈ సామ్రాజ్యమునంతను విచ్ఛిన్నముకాక తమ స్వాధీనములో ఉంచుకొనుటకు బ్రిటిషువారికి వీలగును. ఇందులో ఏభాగమైనను రష్యన్లవంటి బలవంతుల వశమైనయెడల బ్రిటిష్‌వారి రాకపోకలకు ఆటంకము కలుగుటయు, వారి వ్యాపారమునకును, సామ్రాజ్యాధికారమునకును నష్టము కలుగుటయు సంభవించును. ఈ కారణములచేత హిందూమహాసముద్రములో ఏభాగముకూడ రష్యన్ల వశము కాకుండ కాపాడుకొనుట బ్రిటిష్‌వారికి విధి.

హిందూమహాసముద్రమునకు మధ్యభాగమున మన దేశమున్నది. రష్యన్ల మూలమున కలుగబోవు ప్రమాదమునుండి హిందూమహాసముద్రమును, అందులోని బ్రిటిష్‌సామ్రాజ్యభాగములను రక్షించుకొనవలసినయెడల బ్రిటిష్‌వారికి మన సహాయము అత్యవసరము. మన దేశముయొక్క వాయవ్యసరిహద్దు రష్యాసామ్రాజ్యమునకు అతిసమీపమున ఉన్నది. కొంతభాగము దానిని ఆనుకొని ఉన్నదనికూడ చెప్పవచ్చును. అందులోని విమానాశ్రయములపై దండెత్తివెళ్లుటకు మన దేశము ఉపకరించునట్లు మరేదియు ఉపకరించజాలదు. హిందూమహాసముద్రమువైపు వచ్చు రష్యన్లను అడ్డగించుటకుకూడ బ్రిటిష్‌వారికి మన సహాయము అత్యావశ్యము.

ఇదివరకు మధ్యధరాసముద్రమునకు బ్రిటిష్ సామ్రాజ్యరక్షణములో విపరీతప్రాధాన్యము ఉండేది. అందుచేత ఆసముద్రముఖమందుండు జిబ్రాల్టరు, ఆ సముద్రములోని మాల్టా సైప్రెస్ ద్వీపములు, దానిని ఆనుకొనియున్న ఈజిప్టుదేశము—వీటినన్నిటిని ఎల్లెన తమ వశములో ఉంచుకొనుట అత్యావశ్యమని వారూహించుచుండిరి. ఆకాశయుద్ధము ప్రబలిన ఈ కాలమందు మధ్యధరాసముద్రపు ప్రాముఖ్యము తగ్గిపోయెను. హిందూమహాసముద్రమునకు గల ప్రాముఖ్యము హెచ్చెను. అందుచేత భరతఖండముతో టి సఖ్యము ఎప్పటికంటె ఇప్పుడు బ్రిటిష్‌వారికి ఎక్కువ అవసరమగుచున్నది. తాము వదలదలచుకొన్న అధికారము ప్రబలులగు విదేశీయుల వశము కాకూడదని బ్రిటిష్‌వారి నిశ్చయము.

మనము ప్రస్తుతము మన దేశాన్ని రక్షించుకొనుటకు తగిన స్థితిలో లేకపోవుటయు, మన దేశము ఇతర విదేశీయుల చేతిలోపడుట బ్రిటిష్‌వారికి ప్రమాదకరమగుటయు ఇండియా ఇంగ్లండుల మధ్యన దేశసంరక్షణార్థమై ఒక ఒడంబడిక జరుగవలసిన అవశ్యకమునకు

ఆధారమగుచున్నది. మనం మన దేశాన్ని రక్షించుకో తగ్గ స్థితిలో ఉండినపక్షాన ఈ ఒడంబడిక మన కవసర మయ్యేదే కాదు. బ్రిటిష్ సామ్రాజ్యమునకు కలుగబోవు ప్రమాదమునుండి వారిని రక్షించుట మన పని కాదని మనం ఔదాసీన్యమును వహించతగిన స్థితిలో ఉండేడి వారం. కాని ఈ ఒడంబడిక మనకు కూడ లాభకరం కావడంచేతను, ఇట్టి ఒడంబడికకు మనం అంగీకరించిన గాని వారు వారి అధికారమును మనహస్తగతం చేయు టకు ఇష్టపడని కారణముచేతను దీనికి మనం సమ్మ తించవలసిన పరిస్థితి ఏర్పడ్డది.

## ఒడంబడిక ఆవశ్యముకా దను వాదము

ఈ ఒడంబడిక మనకు అవసరము లేదని కొందరు ఆక్షేపించవచ్చును. అట్టి ఆక్షేపణకు రెండుకారణము లున్నవి. మన దేశము బ్రిటిష్‌వారి సామ్రాజ్యములో ఒక భాగముగ ఉండుటచేతనే పరాయివారగు రషి యన్లు, జర్మన్లు, జపాన్ వారు దానిపై దండెత్తదలచుట సంభవించె ననియు, మనకు స్వరాజ్యము సంప్రాప్త మైన క్షణమందుండి ఇతరు లెవ్వరు మనపైకి రాజాల రనియు వీరి వాదము. కాని ఈ వాదమునందు విస్తార మైన సత్యము లేదు. బ్రిటిష్‌వారియెడల గల అసూయత మాత్రమే ఇండియాపై రషియన్లవంటివారు దాడిచేయ దలచుటకు కారణమని అనుకొనుట పొరబాటు. ఇంత కాలమునుండి బ్రిటిష్‌వా రనుభవించిన ఈ దేశపు భోగ భాగ్యములను ఇప్పుడు తామేల అనుభవించరా దన్న విషయము రషియన్ల అంతరంగమందు లేకపోలేదు. ఉత్తరపర్షియాను, ఉత్తరచైనాను స్వాధీనపరచుకొని నట్లు ఇండియాలో కొంతభాగమును స్వాధీనపరచు కొనుటకు రషియన్లు ప్రయత్నింతు రనుటలో సందే హము లేదు.

రషియన్ల వలన ప్రమాదము సంభవించినను బ్రిటిష్ వారి సహాయము లేకుండ కూడ మనం మన స్వాతం త్ర్యాన్ని రక్షించుకొనగలమని వీరు వాదించుచున్నారు. దేశరక్షణకు-తర్ఫీదుపొందిన సైన్యాదులుగాని, ఫిరంగుల వంటి యుద్ధపరికరములుగాని అవసరములు కావనియు, దౌర్జన్యరహితమైన సహాయనిరాకరణమే పరమసాధన మనియు, ఈ సాధనమును సంపాదించుటలో బ్రిటిష్ వారి సహాయము అవసరము లేదనియు వీరి వాదము. అహింసాపద్ధతిమూలమున ఎంతవరకు మనము స్వరాజ్య మును కాపాడుకొనగల మను విషయము వివాదములో కూడుకొన్నది. దీనిలోని లోపాలోపములను విమర్శిం చుటకు ఇది సమయము కాదు. కాని ఒక విషయము మాత్రము ఈ సందర్భములో గట్టిగా చెప్పవచ్చును. అహింసాపద్ధతుల ననుసరించి శత్రువును ఎదుర్కొనగల జనమును లక్షలకొలదిగ తయారుచేయుట సులభసాధ్యము కాదు. ఇదికూడ ఇప్పటికిప్పుడే జరుగుటకు వీలైనది కాదు. దీనికికూడ కొన్ని సంవత్సరములకాలము పట్ట గలదు. ఇట్టి అహింసాసైన్యమును తయారుచేసుకొను టకు ముందే శత్రువులు మనపై పడవచ్చును. మనము స్వరాజ్యమును కోల్పోవుట జరగవచ్చును. ఈలాటి ప్రమాదమునుండి తప్పించుకొనుటకు ప్రస్తుతము బ్రిటిష్‌వారి సహాయముతప్ప మార్గాంతరము ఏది కలదు? గనుక దేశసంరక్షణార్థమై మన స్వాతంత్ర్యానికి భంగం లేనంతమట్టుకూ, బ్రిటిష్‌వారితో ఒడంబడిక చేసు కొనుట ఉభయులకు లాభకరమని చెప్పవచ్చును.

ఇట్టి ఒడంబడిక ౧౯౩౬ లో ఇంగ్లండు ఈజిప్టు దేశములమధ్యను, ౧౯౩౦ లో ఇంగ్లండు ఇరాక్ దేశ ములమధ్యను జరిగెను. ౧౯౨౨ లో ఐర్లాండు స్వతంత్ర రాష్ట్రమగుటకు బ్రిటిష్‌వారు అంగీకరించినప్పుడుకూడ ఆ రెండుదేశములమధ్యన ఇట్టి ఒడంబడిక జరిగెను. గనుక ఇందులో క్రొత్త ఏమియు లేదని మనము గ్రహించ వచ్చును.

అయితే దీనిమూలాన మన పరిపూర్ణస్వాతం త్ర్యానికి ఎట్టి ప్రతిబంధకము కలుగకూడదు. ఒకే శత్రు వును ప్రతిఘటించవలసివచ్చినపుడు స్వతంత్రరాజ్యము లనేకములు కలిసి ఒడంబడికచేసుకొని పరస్పరసహా యముద్వారా శత్రువును ఓడించుటకు సిద్ధపడుట సహ జము. గతయుద్ధములో ఇంగ్లండు అమెరికాలమధ్యన, ఇంగ్లండురషియాలమధ్యన ఇట్టి ఒడంబడిక జరిగెను. దీనిమూలాన ఈ దేశముల సార్వభౌమత్వమునకుగాని, స్వాతం త్ర్యమునకుగాని భంగము కలిగిన దని ఎవరూ అభి ప్రాయపడుటలేదు.

ఇంతవరకూ మన ఇష్టానిష్టముల ననుసరించవలసిన అగత్యము లేక బ్రిటిష్‌వారు వారి సైన్యములను, నౌకలను, ఆకాశవిమానములను మన దేశమునం దుంచుకొనియుండిరి. ఇకమీదట అట్లుగాక మన అంగీకారమును పొంది, వారును మనమును సమానప్రతిపత్తితో సంప్రతించుకొని ఏర్పరచుకొనిన షరత్తుల ననుసరించి వారు మన దేశసంరక్షణార్థమై కావలసిన ఏర్పాటులను చేయ సిద్ధపడుచున్నారు. మనలను కాదని మన దేశమందు వారి సైన్యముల నుంచుకొనుట ధర్మవిరుద్ధ మగుటయేగాక సాధ్యముకాని పని యని వా రిప్పటికి గ్రహించిరి. మన దేశములో వారు ఏ పని చేయదలచుకొనినను మన ఆమోదము అవసరమన్నమాట వారి కిప్పటికి స్పష్టమయ్యెను. వారి పరిపాలనాధికారము తొలగిన దని అనుకొనుటకును, స్వాతంత్ర్యము, స్వరాజ్యము మనకు లభించినదని అనుకొనుటకును ఇదియే కారణము.

## ఒడంబడిక స్వరూపము

ఇంగ్లండు, ఇండియాలమధ్యన జరుగనున్న ఒడంబడికలో ప్రధానవిషయము దేశసంరక్షణకు సంబంధించిన ఏర్పాటులు. విదేశీయుల మూలమున మనకు ప్రమాదము కలిగినప్పుడు వారు మనకు సహాయము చేయ సిద్ధపడెదరు. వారి సామ్రాజ్యమునకు ప్రమాదము కలిగినపుడు మనముకూడ వారికి సహాయపడుటకు సిద్ధపడవలెను. వారి మిత్రులు మన మిత్రులనియు, వారి విరోధులు మన విరోధులనియు, వారితో సంప్రతించక మనము ఇతరదేశములతో సంధినిగాని, యుద్ధమునుగాని ప్రకటించకూడదనియు వారు కోరగలరు. అట్లే మనతో సంప్రతించక వారు ఇతరదేశములతో సంధివిగ్రహములను ప్రకటించకూడదని మనము కోరవలెను. దేశసంరక్షణకు కావలసినంతమాత్రపు సేనలు, నౌకలు, ఆకాశవిమానాలు, యుద్ధపరికరాలు వారు మన దేశమందు కొన్ని నిర్ణీతప్రదేశములలో ఉంచుకొనవలెను. ఇంతకుమించి వారు వారి సైన్యములను ఇచ్చట ఉంచరాదు. ఈ సైన్యములను విదేశశత్రువుల నణచుటకుమాత్రమే ఉపయోగించవలెనుగాని దేశములోని అంతఃకలహములనుగాని, అల్లరులనుగాని అణచుటకు ఉపయోగించరాదు. ఎప్పటికైన మన దేశమును మనమే కాపాడుకొనవలసియున్నది గనుక, అందుకు కావలసిన జాతీయసైన్యమును తయారుచేసుకొనుటకు ఈ ఒడంబడిక ప్రతిబంధకముగ నుండకూడదు. అట్టి సైన్యమును, నౌకాబలమును, ఆకాశవిమానములను, పరికరములను తయారుచేసుకొనుటలో మనకు కావలసిన సహాయమంతయు వారు చేయుటకు సిద్ధపడవలెను. ఇట్లే మూలపరిశ్రమలను స్థాపించుటకు కావలసిన యంత్రములను, అవసరమైనయెడల పెట్టుబడిద్రవ్యమును వారు మనకు సరఫరా చేయవలెను. శాస్త్రపరిశోధనమందు వారు మన శాస్త్రవేత్తలకు, పరిశోధకులకు సహాయపడవలెను. ఇదంతయు ఒక నిర్ణీతకాలములో—అనగా పదిహేను ఇరవై సంవత్సరములలో—పూర్తికావలెననియు, ఇది పూర్తి అయిన వెంటనే ఈ ఒడంబడిక రద్దుకావలెననియు, అటుపిమ్మట ఇంగ్లండు ఇండియాల మధ్యన ఎట్టి సహకారము,సంబంధము ఏర్పడవలెనో అప్పుడు నిర్ణయించుకొనవలయుననియు ఒడంబడికయందు నిర్ణయము కావలెను. అనగా ఈ ఒడంబడిక శాశ్వతమైనది కాదనియు, తాత్కాలికమైన దనియు, దేశరక్షణకు కావలసిన అంగముల నన్నిటిని మనము సమకూర్చుకొనుటకు సంపూర్ణమైన హక్కు మనకు కలదనియు ఇంగ్లీషువారు గ్రహించవలెను. ఆ షరత్తుమీదనే మన మీ ఒడంబడికకు అంగీకరించవలెను.

పరాయివారగు బ్రిటిష్‌వారి సేనలు మన దేశమం దుండునంతవరకు మన స్వాతంత్ర్యము, స్వరాజ్యము నిజమైనవి కావనియు, కృత్రిమము లైనవనియు, అవి తొలగిపోయినప్పుడే మనకు నిజమైన స్వరాజ్యము లభించుననియు, బ్రిటిష్‌వా రిప్పు డియ్యదలచుకొన్న స్వరాజ్యము కృత్రిమమైన దనియు కొందరు వాదించుచున్నారు. ఇంగ్లండుఇండియాలమధ్యన ఒడంబడిక జరుగవలెనని బ్రిటిష్‌వారు చెప్పుటలో మనకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసగుట వారి కిష్టములేదని వీరి అభిప్రాయము. ఈ అభిప్రాయము పూర్తిగ అంగీకరించదగ్గది కాదు. బ్రిటిష్‌వారి ఉద్దేశము లెట్టివన్నమాట అప్రస్తుతము. ఒడంబడిక లేక మనము ఇప్పుడు మన దేశమును రక్షించుకొనదగిన స్థితిలో ఉన్నామా అనేదే ఆలోచించదగ్గ విషయము. ఇట్టి స్థితిలోనికి మనము

పదిపది హేనుసంవత్సరములలోనైన వచ్చుటకు ఈ ఒడంబడిక సహాయపడగలదా, లేక అడ్డుపడగలదా అనునది రెండవ విషయము. ఈ రెండు విషయములనుబట్టి ఒడంబడికను మనము విమర్శించినయెడల ప్రస్తుతపరిస్థితులలో అది మనకు అత్యవసరమని ఏర్పడును. అంతమాత్రముతో మన స్వాతంత్ర్యమునకు లోపము కలుగజాలదు. ఒకవేళ కలిగినను మార్గాంతరము మనకు లేదన్నమాటను మనము మరువకూడదు.

ఇంగ్లండు-ఇండియాలమధ్యన ఇట్టి ఒడంబడిక కుదురుటచేత రష్యా మనపై తప్పక విరోధము వహించుననియు, ఎప్పుడో కలుగనున్న ప్రమాదము ఇప్పుడే కలుగుననియు మరికొందరు ఆక్షేపించవచ్చును. ప్రమాదము ఎప్పుడో ఒకప్పుడు సంభవించు నన్న విషయములో ఏకాభిప్రాయ మున్నయెడల ఈ ఆక్షేపణను గురించి మనము ఎక్కువగా విమర్శించవలసినది లేదు.

దేశసంరక్షణార్థమై జరగవలసిన ఏర్పాటు లేగాక మరికొన్ని విషయములను గురించికూడ ఒడంబడికలో తగిన ఏర్పాటు లుండవలెనని ఇదివరకు బ్రిటిష్ ప్రభుత్వమువారు వాదించుచుండిరి. కాని ఇప్పుడు వీటిని గురించి వారు ఎక్కువగ వాదించుట లేదు. ఈ విషయములను రెండురకములుగ మనము విభాగించవచ్చును. (౧) ఇదివరకు ఇండియా సైన్యములలోను, ప్రభుత్వ ఉద్యోగములలోను పనిచేయుచున్న బ్రిటిష్ ఉద్యోగస్థులనుగురించియు, మన దేశములో వర్తకవ్యాపారములు చేయుచున్న బ్రిటిష్ అనధికారులనుగురించియు జరగవలసిన ఏర్పాటులు ఒకరకములోనివి. (౨) ఇండియాలోని స్వదేశసంస్థానములు, అల్పసంఖ్యాకులని చెప్పబడు మహమ్మదీయులు, హరిజనులు, క్రైస్తవులు, శిక్కులు, ఆంగ్లోఇండియన్లు మొదలగువారిని గురించిన ఏర్పాటులు రెండవరకములోనివి.

## బ్రిటిష్ వ్యక్తులనుగురించిన ఏర్పాటులు

మనకు స్వరాజ్యము లభించినవెంటనే బ్రిటిష్ ఉద్యోగస్థులను మనము ఉంచుకొనవలసిన అవసరము ఉండదు. అట్లు ఉంచుకొనుట ప్రమాదము, నష్టము కూడాను. రాజ్యము మనదైనతర్వాత వారు శ్రద్ధతోను, నమ్మకముగాను మనక్రింద పనిచేయుట అనుమానము. మన నౌకరియందు వారుండుటకు వారే ఇష్టపడకపోవచ్చును. ఇష్టపడినను వారి జీతములు అత్యధికములు. వారిస్థానే నమ్మకముగను, సమర్థతతోను, తక్కువ జీతములకును పనిచేయగల భారతీయు లెందరో ఉన్నారు. ఇట్టిసందర్భములో బ్రిటిష్ ఉద్యోగస్థులను ఉద్యోగములనుండి విరమింపజేయుట అవసరమగును. వారి పింఛనులు, నడిమధ్యన ఉద్యోగములను కోల్పోవుటవలన వారికి కలుగు నష్టమునకు పరిహారము మొదలైనవిషయములను సక్రమముగ పరిష్కరించవలసియున్నది. బ్రిటిష్ పరిపాలనయందు మనకు విరోధముకాని బ్రిటిష్ వ్యక్తులయందు ఎట్టి విరోధము లేదుకదా? అందుచేత న్యాయానుసారముగ ఈ ఉద్యోగులకు ఎట్టి పింఛనులు, ఎంతటి నష్టపరిహారద్రవ్యము ఇయ్యవలెనో ఈ ఒడంబడికలో తేల్పవలసియున్నది.

వర్తకవ్యాపారములకై మన దేశమునకు వచ్చిన బ్రిటిష్‌వారి విషయములోకూడ ఇట్టి నిర్ణయము జరుగవలసియుండును. వీరిదివరకు అనేక సదుపాయాలను అనుభవించుచు ఎక్కువలాభమును గడించుచున్నారు. ప్రభుత్వముతో వీరికి ఎక్కువ పలుకుబడి ఉండు కారణముచేతను, మన వర్తకులకు పారిశ్రామికులకు ఇంతటి పలుకుబడి లేనికారణముచేతను వీరు కాఫీటీతోటల ద్వారాను, బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, ఫ్యాక్టరీలు, నౌకాకంపెనీలు మొదలైనవాటిద్వారాను ఎక్కువ లాభమును గడించి కోటీశ్వరులుగ తమ దేశమునకు వెళ్లుచున్నారు. స్వరాజ్యము మనకు వచ్చిన తర్వాతకూడ మన వర్తకులకు, పారిశ్రామికులకు లేని సదుపాయములను వీరికి కల్పించుట జరుగనిపని. సదుపాయములు లేనినాడు వారికి గల ఆస్తులు, ఫ్యాక్టరీలు ఏమగునో అన్న భయము వారిని పట్టి పీడించుచున్నది. ఏ షరతుల ననుసరించి వీరు ఇకమీదట మన దేశములో వ్యాపారము చేయవలసినదీ, మన దేశమును వదలిపెట్టి వీరు వెళ్లదలచుకొనినయెడల వీరి ఆస్తులకై మనం ఎంతద్రవ్యము ఇయ్యవలసినదీ మనము పరిష్కరించుకొనవలెను. ఈ పరిష్కారముకూడ ఒడంబడికలో ఒక అంతర్భాగము.

ఇదంతయు ఇదివరకు మనదేశములో ఉద్యోగరీత్యాగాని, వర్తకరీత్యాగాని ఉన్న బ్రిటిష్ వ్యక్తులకు సంబంధించినది. ఇకమీదట మన దేశమునకు వచ్చే బ్రిటిషువ్యక్తులనుగురించి ఏలాటి ఒడంబడిక అవసరము లేదు. వారు ఇతరపరాయిదేశస్థులతోపాటు మనము చేయు శాసనములకు బద్ధులై నడుచుకోవలసినవారుగా ఉందురు.

## స్వదేశసంస్థానములు

మన దేశములో స్వదేశసంస్థానాధీసులు—మైసూరు, తిరువాన్కూరు, హైదరాబాదు, బరోడా మొదలగు సంస్థానాలను పాలించు ప్రభువులు—అనేకులున్నారు. వీరికిని, బ్రిటిష్ప్రభుత్వానికిని ఇదివరలో అనేక ఒడంబడికలు జరిగియున్నవి. వీటిప్రకారము వీరిని రక్షించే బాధ్యతను బ్రిటిష్వారు వహించియున్నారు. విదేశశత్రువులనుండి గాని, సంస్థానములోని ప్రజలనుండిగాని ఎట్టి ప్రమాదమైనా కలిగినప్పుడు దానినుండి సంస్థానాధీసులను రక్షించుటకు బ్రిటిషువారు పూచీపడియున్నారు. భరతఖండముపై తమకు గల అధికారమునంతను భారతీయులపరము చేసి వెళ్లిపోవు పరిస్థితులలో సంస్థానాధీసుల రక్షణ ఎట్లు జరుగగలదు? అన్నవిషయమై ఇదివరకు బ్రిటిష్వారు కొంత ఆందోళనపడుచు, అట్టి రక్షణకు ఏలాటి భంగము కలుగకుండ స్వరాజ్యప్రభుత్వమువారు వ్యవహరించవలెనను షరత్తు ఒకటి ఒడంబడికలో ఉండవలెనని వారు చెప్పుచుండిరి. కాని ఇప్పుడు దీనినిగురించి వారు విస్తారము తాపత్రయపడుట మానుకొనిరి. దేశమంతటిపై తమ కిదివరకున్న అధికారమునంతా వదలుకొనుటకు సంసిద్ధులైనప్పుడు సంస్థానాధీసుల యోగక్షేమములను గురించి విచారపడుట అనవసరమనియు, వారిని రక్షించు బాధ్యతను తాము వదలుకొనుచున్నామనియు, క్రొత్తగా ఏర్పడు స్వరాజ్యప్రభుత్వంతో ఈ సంస్థానాధీసులు వారివారి ఇష్టానుసారముగ స్వరక్షణకు కావలసిన ఏర్పాటులను చేసుకొనవచ్చుననియు బ్రిటిష్ప్రభుత్వం వారు ప్రస్తుతము నిశ్చయముచేసుకొనియున్నారు. గనుక ఇంగ్లండుఇండియాలమధ్యన జరుగవలసిన ఒడంబడికలో సంస్థానాలకు సంబంధించిన ఏర్పాటులు ఏవీ ఉండవలసిన జరూరు లేదని చెప్పవచ్చును.

## అల్పసంఖ్యాకులు

మహమ్మదీయులు, హరిజనులు, క్రైస్తవులు మొదలైన అల్పసంఖ్యాకులవిషయమై కొన్ని ఏర్పాటులు ఒడంబడికలో ఉండవలెనని ఇదివరలో బ్రిటిష్వారు వాదించుచుండిరి. కాని ఈ వాదమును కూడ వారు ప్రస్తుతము చాలవరకు వదలుకొన్నట్లు కనుపించుచున్నది. ఇదివరకు వారు దీనినిగురించి తీవ్రముగ వాదించుటలో వారి అభిప్రాయమేమో కొంత తెలుసుకొనుట మంచిది.

రెండువందల సంవత్సరాలుగా వారు మన దేశాన్ని పాలించడంలో ఈ అల్పసంఖ్యాకులను ఉచ్చదశకు తెచ్చి, అధికసంఖ్యాకులతో వారికి సమానత్వము కల్పించుటకు వారు సంకల్పించినారట! అట్టిసంకల్పము క్రియారూపమును ఇంకా పూర్తిగ ధరించలేదు. కొంతవరకే వారు వీరిని రక్షించగలిగారట! ఇంకను వీరు ప్రాజ్ఞులు కాలేదట. వీరు ప్రాజ్ఞులగుటకుపూర్వమే తాము దేశాన్ని వదలిపెట్టవలసిన పరిస్థితులు ఏర్పడినవట! గనుక అనాగరులగు ఈ అల్పసంఖ్యాకులకు అధికసంఖ్యాకులగు హిందువులనుండి ఎట్టి ప్రమాదము కలుగకుండ, వారిని రక్షించుటకు కావలసిన ఏర్పాటులనన్నిటిని తాముచేసి, ఒడంబడికలో చేర్చుట న్యాయమని వారిదివరకు వాదించుచుండువారు.

ఈ వాదమువలన ప్రయోజనము లేదను నమ్మకము వారికిప్పుడు కుదిరినట్లు కనుపిస్తున్నది. అల్పసంఖ్యాకుల రక్షణవిషయములో తాము శాశ్వతముగా జోక్యము కలిగించుకొనుట భరతఖండముయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యమునకు భంగకరముగ ఏర్పడునని వారిప్పుడు తెలుసుకొనిరి. ప్రతిదేశమందు అల్పసంఖ్యాకుల సమస్య ఉన్నది. అది మన దేశమునకుమాత్రమే లక్షణము కాదు. ఇదిగాక ప్రతిదేశపు ప్రజలలో కొందరు ముందుకు వచ్చినవారు, కొందరు వెనుకబడినవారు కలరు. అందరూ ఒకేస్థితిలో లేరు. వెనుకబడినవారిని ముందుకు తెచ్చుటకు ప్రతిదేశములోను కొన్ని ప్రయత్నములు

జరుగుచున్నవి. మన దేశములో కూడ అట్టి ప్రయత్నములు జరుగగలవు. అల్పసంఖ్యాకులకు, అధికసంఖ్యాకులకు మధ్యన ఇప్పుడు మనదేశములో అచ్చటచ్చట కనుపించుచుండు వైషమ్యము ఇంతకూ బ్రిటిష్‌వారు తెచ్చిపెట్టినదే. ఇంతకాలము వారు మన దేశమును పాలించినందువలనను ఈ వైషమ్యమును వృద్ధిచేసిరే గాని, అల్పసంఖ్యాకుల యోగక్షేమానికై ఎట్టి గొప్ప సంస్కరణాలను చేసినవారు కారు. అంటరానితనమును గాని, దారిద్ర్యమునుగాని, విద్యావిహీనతనుగాని వారు తొలగింపజాలకైరి. ఇవన్నియు జాతీయప్రభుత్వ మేర్పడిన అనంతరమే తొలగగలవుగాని పరాయిప్రభుత్వము క్రింద తొలగజాలవు. అధికసంఖ్యాకులగు హిందువులు అల్పసంఖ్యాకులయెడ సానుభూతిని ప్రకటించుచున్నారే గాని ద్వేషభావమును పూనియుండలేదు. గనుక ఇందువిషయమై ఒడంబడికలో ఎట్టి ఏర్పాటూ జరగవలసిన అవసరము లేదని ఇప్పుడిప్పుడు బ్రిటిష్‌వారు అభిప్రాయపడుచున్నారు.

గనుక ఒడంబడిక అంతయు ప్రధానముగ దేశసంరక్షణార్థముగను, కొంతవరకు మన దేశములో ప్రస్తుతము ఉద్యోగులుగను, వర్తకులుగను ఉండు బ్రిటిష్ వ్యక్తుల రక్షణార్థముగను జరుగవలసియున్నదనియు, ఇంతకుమించిన షరత్తు లేమియు ఇంగ్లీషువారు కోరుట న్యాయముకాదనియు, అట్టి షరత్తులను మన మంగీకరించుట సంపూర్ణ స్వరాజ్యమునకు భంగకరమగుననియు తేలుచున్నది. ఇదియే ఒడంబడికను గల ఆవశ్యకత; దాని లక్షణముకూడ ఇదియే.

## జాగరూకతతో మెలగవలసిన అవసరము

ఈ ఒడంబడిక రాజ్యాంగనిర్మాణపరిషత్తుద్వారా జరగవలసియున్నది. రాజ్యాంగవ్యవహారాలను నడుపుటలో బ్రిటిష్‌వారు అతిసమర్థులు; బహునిపుణతతో రాయబారము జరుపగల ప్రముఖులు వారిలో ఎందరో ఉన్నారు. నయముచేతను, భయముచేతను ప్రతిపక్షులను వశపరచుకొనుటయందు వారికి గల నేర్పు మరి ఏ దేశము వారికి లేదని చెప్పవచ్చును. వారు సులభముగ వారి వాదమును వదలుకొని ఇతరులకు లొంగిపోవువారు కారు. ౧౯౨౨ లో వారు ఐర్లండులోని స్వరాజ్యపక్షమువారితో గావించిన సంప్రతింపులు దీనికంతకు తార్కాణము. ఐర్లాండురాయబారులు తమ దేశము ఆంగ్లేయసామ్రాజ్యములో ఎంతమాత్రము ఒకభాగముగ నుండకూడదనియు, దేశవిభజనకు తామెన్నడు అంగీకరింపరాదనియు నిశ్చయించుకొని ఇంగ్లీషువారితో రాయబారముల కుపక్రమించిరి. కాని ఇంగ్లీషు రాయబారుల మాయలో వారు పడిపోయి, వారి నిశ్చయమును ఎట్లో వదలుకొని, ఇంగ్లీషువారి షరత్తులకు అంగీకరించిరి. ఇట్టి మాయలో మన రాజ్యాంగనిర్మాణపరిషత్తు పడకుండ ఉండవలసిన అవసరమున్నది. బహుజాగరూకతతో మన జాతీయనాయకులు పనిచేసినగాని మన స్వాతంత్ర్యమునకు భంగకరముగాని ఒడంబడిక ఏర్పడుట కష్టసాధ్యము.



# మొదటి జయసింహవల్లభుని మాచెర్ల శిలాశాసనము



= శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ =

[కొంతకాలము క్రిందట ఆంధ్రవిశ్వకళాపరిషదాచార్యులతోను, అధ్యాపకులతోను గలిసి నేను నాగార్జునకొండ వెళ్లుట తటస్థించినది. నాగార్జునకొండ వెళ్లుటకు గుంటూరునుండి మాచెర్లవరకు రైలు, మాచెర్లనుండి బండి. మాచెర్లలో రైలు దిగి, మధ్యాహ్న మక్కడ ఆగి, సాయంకాలము బండ్లమీద నాగార్జునకొండ వెళ్లినాము. మాచెర్లలో నున్న సమయమున అక్కడ ప్రాచీన శాసనము లేవైన దొరకునేమో యని యన్వేషణము చేయు సందర్భమున అక్కడ తాలూకా ఆఫీసు ఆవరణమున పూర్వచాళుక్యసంతతిలో ప్రథముడయిన మొదటి జయసింహవల్లభుని ఈ శిలాశాసనము కానవచ్చినది. ఇది గవర్నమెంటుశాసనశాఖవారి నివేదికల కింతవఱకు ఎక్కలేదు. ఈశాసనము తీసి చాలకాల మయినను శాసనభాష తెలుగు చక్కగ అర్థమగునేమో యని ఇంతవఱకు దీనిని ప్రకటించుటలో జాగుచేసితిని. శాసనము తీసినప్పుడెట్లో ఇప్పటికి నట్లే యర్థమగుచుండుటచేత ప్రకటించుటయే మేలని దీనిని చదువరులకును, భాషాపరిశోధకులకును నివేదించుచున్నాను. శాసనము చివరిభాగ మరిగిపోయినది. శాసనప్రతిబింబము తీసికొనివచ్చుటకును, రాతిదగ్గర కూర్చుండి శాసనము చదివి పాఠము సవరించి పరిశోధించుకొనుటకును నాకు అనుకూల్యములు కలిగించిన ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలల ప్రిన్సిపాలుగారగు శ్రీ ఆచార్య డాక్టరు యస్. భగవంతముగారి కిందుమూలమున నా కృతజ్ఞతావందనములను తెలుపుకొనుచున్నాను.]

ఈశాసనము నన్నయభట్టారకునికి పూర్వము ఆంధ్రదేశమున వ్యవహారమునందుండిన భాషను గుఱించి తెలిసికొనుటకు చాల ముఖ్యమయినది. క్రీస్తుశకము ప్రారంభశతాబ్దులకు వెనుకకు వెనుకకు పోయిన కొలది మనకు తెనుగుబాసలో వ్రాసిన శాసనములే కానరావు. ఆ ప్రారంభశతాబ్దులలో ఆంధ్రదేశము నేలిన పల్లవ, విష్ణుకుండివంశ్యులు బ్రాహ్మణుల కిచ్చిన తామ్రశాసనములలో దానమిచ్చిన గ్రామము సరిహద్దు నిరూపణము సందర్భమునను, దానకాలమును దెలుపు సందర్భమునను ఒకటిరెండు తెలుగుపదములు కనిపించును. కాని అట్టి తామ్రశాసనములలో దానమిచ్చినట్లు తెలుపబడిన యూళ్లు, వాటికి సీమావధులుగ చెప్పబడిన యూళ్లును తెలుగునాటివే; వాటి పేర్లు తెలుగువే. నన్నయభట్టారకునికి పూర్వము తెలుగుబాస ఆదిమస్వరూపము వీటి ననుసరించియే తెలిసికొనవలసియుండును. గ్రామముల పేర్లు కాక శాసనమంతయు తెలుగుబాసలో నుండుట క్రీస్తుశకము ఏడవశతాబ్దినుండియే యారంభము.

నన్నయభట్టారకునికి పూర్వము దొరకిన తెలుగు శాసనములు కడు పరిమితములు. వీటి ననుసరించియే ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును నిర్ణయింపవలెను. ఈ తెలుగుశాసనము లన్నియు శిలలమీద చెక్కినవే. వీటి సంఖ్య కొద్దియైనను ఇవి ఆంధ్రభాషాపరిశోధనకు చాల అమూల్యమైనవి. అట్టివాటిలో నే నిదివరలో శ్రీ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారి సన్మానసంచికలో ప్రకటించిన "పొల్లదుర్తి-మాలెపాడు శాసనము" ఇంతవరకు తెలుగుబాసలో కానవచ్చిన మొదటి

శాసనమని నా యభిప్రాయము. ఈశాసనమున శకవర్షము లేకపోయినను ఇది క్రీస్తుశకము ఏడవ శతాబ్ది ప్రథమ దశకమునాటిదని చెప్పుట కాధారములు కలవు. శాసనము చిన్నదే కాని అంతయు తెలుగుననే యున్నది.

ఏడవ శతాబ్ది కించుక పూర్వకాలపు తెలుగు శాసనములుకూడ లేకపోలేదు. ఇవి నెల్లూరుజిల్లా ధైరవునికోనలోను, గుంటూరుజిల్లా పల్నాడుతాలూకాలోను కానవచ్చినవి; ఒక్కొకటి ఒక పంక్తిది; రెండు పంక్తులదిమాత్రమే. వీటిలో మనుష్యుల పేర్లును, బిరుదములవంటి పదములునుమాత్రమే యున్నవి. ఇవి క్రీస్తుశక మాఱవశతాబ్దికి, నేడవశతాబ్దికి నడిమికాలపువై యుండునని నా యూహ.

క్రీస్తుశక మేడవ శతాబ్దినాటి తెలుగుశాసనములు పశ్చిమాంధ్రదేశమునందును (రాయలసీమ), ప్రాగాంధ్రదేశమునందునుగూడ దొరకినవి. పశ్చిమాంధ్రదేశమున, అందు ముఖ్యముగ కడప, కర్నూలుమండలములలో దొరకిన పూర్వపు తెలుగుశాసనములు చోళరాజులవి. పొట్లదుర్తి-మాలెపాడుశాసనము చోళులదే. ప్రాగాంధ్రదేశమున గానవచ్చిన మొదటి శాసనములు పూర్వచాళుక్యులవి. పూర్వచాళుక్యులను చరిత్రమున వేంగీచాళుక్యులనియు వ్యవహారము.

ప్రాగాంధ్రదేశమున గానవచ్చిన తెలుగుశాసనములలో మొట్టమొదటిది మొదటి జయసింహవల్లభుని విప్పర్ల శాసనము. విప్పర్లగ్రామము గుంటూరుజిల్లా నరసారావుపేటతాలూకాలో నర్సారావుపేటకు సమీపమున నున్నది. మొదటి జయసింహవల్లభుడు వేంగీదేశమున పూర్వచాళుక్యరాజ్యమును సంస్థాపించిన సత్యాశ్రయవల్లభేంద్రుని (రెండవ పులకేశి) సోదరుడైన కుబ్జవిష్ణువర్ధనుని కుమారుడు. ఈ జయసింహవల్లభుని రాజ్యారంభకాల మింకను సుస్పష్టము కాకున్నను ఇతడు క్రీస్తుశక మేడవ శతాబ్ది యుత్తరార్ధమున నుండినట్లు మనకు నిశ్చయముగ తెలియును. అందువలన ఈ విప్పర్ల శాసనము క్రీ. శ. ౬౫౦, ౬౬౦ నాటిదని నిర్ణయింపవచ్చును. ఇది యింతవఱకు సరిగ ప్రకటింపబడలేదు. శాసనప్రతి దక్షిణహిందూదేశశాసనసంపుటములలో కానవచ్చును.

గుంటూరుజిల్లా చేజెర్లలో మఱియొక తెలుగు శాసన మున్నది. లిపి ననుసరించి చూచినచో అది కుబ్జవిష్ణువర్ధనుని దైయుండునని యూహ. శాసనము చాల చెడినది. ఈ కారణమున నది గట్టిగ కుబ్జవిష్ణువర్ధనునిదని స్థిరపరుచుటకు తగిన యవకాశము లేదు.

మన మాచెర్ల శాసనముకూడ మొదటి జయసింహవల్లభునిదే. ఇదికూడ విప్పర్ల శాసనకాలమునాటిదే. ఇంతవరకు దొరకిన జయసింహవల్లభుని తెలుగుశాసనములలో ఇది రెండవది. నన్నయభట్టారకునిచే మహాభారతమును తెనిగింపజేసిన రాజరాజనరేంద్రుడు ఈ జయసింహవల్లభుని సంతతివాడే. మహాభారతపు తెలుగు మొదటి జయసింహవల్లభుని కాలమున ఏరీతి నుండెనో, ఆతనితరువాతికాలమున అది ఎంత సంస్కారము నందెనో విప్పర్ల, మాచెర్ల శాసనములను జదివిన తెలియగలదు. ప్రాచీనాంధ్రభాష ఇప్పటికి పదుమూడువందల సంవత్సరములకు పూర్వమున్న స్థితిని ఈ శాసనములు మనకు దెలుపగలవు. ఈ కారణమున ఈ మాచెర్ల శాసనము ఆంధ్రభాషాచరిత్రమునకు, భాషాపరిశోధనమునకు చాల ముఖ్యమయినది.

ఇతరపూర్వచాళుక్యశాసనములవలెనే ఈ మాచెర్ల శాసనముకూడ ఆనాటి తెలుగు-కన్నడలిపిలో నున్నది. అక్షరములు పాలరాతిమీద పొంకముగ చెక్కబడినవి. అక్షరస్వరూపమున సంశయమున కెడములేదు; కాని శాసనములోని తెనుగుపదములు కొన్నిటి రూపమును, అర్థమునుగూడ సుబోధమగుట లేదు. ఇంకను విచిత్రమైనది ఇందలి వాక్యరచనా పద్ధతి. ఇది మన మిప్పుడు వాడు పద్ధతికి భిన్నమైనది. ఇప్పుడు మనము వాక్యరచనలో క్రియాపదమును కర్త, కర్మలకు తరువాత పెట్టుదుము. మన యీ మాచెర్ల శాసనమున అది కర్తకు తరువాతను, కర్మకు పూర్వమును వచ్చినది. ఇది అపూర్వము. పొట్లదుర్తి-మాలెపాడు శాసనమునను ఈపద్ధతియే కానబడును. ప్రాచీనాంధ్ర వాక్యరచనాపద్ధతి యిదేనా, ఇది యింక నితరశాసనములలోను గానవచ్చునా? ఇదియే యైన ఈపద్ధతి ఎంతకాలమువఱ కుండెను? ఇది నాటి సామాన్య పద్ధతి కానిచో పొట్లదుర్తి-మాలెపాడు, మాచెర్ల శాస

వములలో నిట్లుండుటకు కారణ మేమి? ఈవిషయములు విచారణీయములు.

శాసనవిషయము: జయసింహవల్లభుని రాజ్య కాలమున అర్హాతెభట్టారకులకు చేసిన ఆలుపుట్ల అళ్ల పట్టు సుక్షేత్రముదానమును దెలుపుటకు ఈ మాశార్ల శాసనము పుట్టినది.

శాసనమూలమును ఈదిగువ నిచ్చుచున్నాను:

౧. స్వస్తి [॥*] శ్రీసకలలోకాశ్రయ
౨. శ్రీజయసింఘవల్లభ మహా
౩. రాజులాకు ప్రవర్ద్ధమానవి
౪. [జయ *][రా]జ్యసంవత్సరంబు
౫. ళ్లిణ్బొది అన్నెణ్ట న్పల్లినాణ్టి
౬. దయాత్తైసను
౭. ప్రిథివీదేశరట్టగుళ్ల
౮. ముట్ట్యధాన్యవెసను ప్రిథివీదేశ
౯. రట్టగుళ్ళువారికి ముట్ట్య కల్యాణద
౧౦. సనుల ఇచ్చిరి అరహాన్తభటా
౧౧. రకాకు ఆలుపుట్ల
౧౨. ఆల్ల్యపట్టు సుక్షేత్రంబు
౧౩. దీని ల్లొంబూరి రట్టగుళ్ల అన్వ
౧౪. యంబున వా రెవ్వరైయును రక్షిమ్ప నుంన
౧౫. పంను వ్రాయుం[॥*] దీనికి అహితంబు చిన్తిఞ్చు
౧౬. [వార]పఞ్చమహాపాతకసంయుత్తు...
౧౭. ...............

[పైపాఠమున ఎత్తుగీత గల యక్షరము లనుమానాస్పదములుగ నన్నవి]

ఈ పైపాఠమునందలి పదములను విడిగా దీసికొని విచారింతము.

ఈశాసనమున జయసింఘవల్లభ, వెసను, దసనుల, సంయుత్తపదములలో ప్రాకృతప్రభావము కన్పట్టును. 'దయాత్తెసను' అనుదానిలో 'త్తె' సందేహాస్పదముగ నున్నను 'ధన్యవెసను' అనుదానిలో 'వె' చాల స్పష్టముగ నుండుటచేత 'వెసను' అన్నది సరియైన మాటయే యనుటకు సంశయింపబనిలేదు. 'జయసింఘవల్లభ' అను పేరులో 'సింఘ' అన్నది 'సింహ' పదప్రాకృతరూపము. ఇట్లే 'వెసను' అన్నది 'వచను' అనుదానికిగాని, 'వ్యసను' అనుదానికిగాని—ప్రాయికముగ మొదటిదానికే యని నాయూహ—ప్రాకృతరూప మైయుండవచ్చును. దయావెసను, ధన్యవెసను పదములు ఉద్యోగపదవిని, ఉద్యోగధర్మమును దెలుపు మాటలై యుండునో, లేక రాజకార్యనియుక్తుల పేరులై యుండునో తెలియవచ్చుట లేదు. పదవీవాచకము లైనచో 'ధన్యవెసను' అనుదానిని 'ధాన్యవెసను'గా సంస్కరింపవలసియుండునేమో. జయసింహవల్లభమహారాజురాజ్యమున దయావెసనుడు ఒక యుద్యోగి యనియు, అతని క్రింది యుద్యోగి ధ(ధా)న్యవెసనుడనియు, ఇతని క్రిందివాడు కల్యాణవెసనుడనియు నూహించుట కవకాశము కలదు. ఇవి యుద్యోగపదవిని సూచించు పదములు కానిచో రాజకార్యనియుక్తుల నామము లైనను కావలెను. కల్యాణవెసను లనునది కల్యాణవర్మను లను పదము రూపాంతరము కాదనునది నా యూహ. చివరికి దానము నమలుజరిపినవాడు కల్యాణవర్మనుడే. 'కల్యాణదసనుల'లో తుదివర్ణము మీది అకారము వీవార్థసూచకము కావచ్చును. 'సంయుత్త' అనునది 'సంయుక్త'పదము ప్రాకృతరూపము.

'రట్టగుళ్ల' అనునది 'రట్టగుడి' అనుదాని బహువచనరూపము. ఇంతకంటెను ప్రాచీనములైన శాసనములలో 'రట్టగుడి' అనుటకు బదులుగా 'రట్టకుడి' అనియే యున్నది. ఇదియే 'రట్టగుడి' ప్రాథమికరూపము. ఇది 'రట్ట', 'కుడి' అను రెండు వ్యస్తపదముల కలయికవలన నేర్పడిన సమస్తపదము. రట్ట+కుడి=రట్టకుడి. ఇందు మొదటి 'రట్ట'పదము జాతి, లేక కులవాచకము. ప్రాచీనకాలమున దక్షిణాపథమున నివసించిన పలుతెగలవారిలో రట్టు లొకరు. వారు ప్రధానముగ 'కుడియనులు'—

సిద్ధకార్యుడు. రట్టకుడిపదము సంస్కరింప బడగా "రాష్ట్రకూట"రూప మేర్పడినది. కాలక్రమమున మన దేశమున వీరే ప్రధానకర్షకు లైనారు. ధాన్యరూపమున వీరు రాజుకు పన్ను చెల్లించుచువచ్చిరి. ఈ పన్ను వసూలుచేయుటకు వీరిలో నుండియే ఒకనిని (రట్టకుడిని) రాజు ప్రతిగ్రామమునకు,ప్రతిదేశమునకు నియోగించుచు వచ్చును. కాలక్రమమున ఇది ఒక ఉద్యోగపదవిగా మారినది. రట్టకుడిపదము శతాబ్దులు గడచినకొలది రట్టోడి, రట్టడి, రడ్డిరూపములు పొంది చివరికి నేడు రెడ్డి యైనది. 'రట్టడి'రూపము వ్యవహారమునందున్నప్పుడు ఆపదవి పేరు 'రట్టడము' అయినది; 'రడ్డి' వాడుకలో నుండినప్పుడు 'రడ్డిగ' మయినది. నేడు 'రెడ్డికము'. మన శాసనమునందలి "రట్టగుళ్లు" గౌరవవాచకబహువచనరూపము. 'ళ్', 'ళ్' అనునవి బహువచన ప్రత్యయములు. ఇవే 'లు', 'రు'గా మారినవి. క్రీస్తుశక పేడవ, ఏనిమిదవ శతాబ్ది తెలుగుశాసనములలో మనకు బహుళముగ గానవచ్చు బహువచనప్రత్యయము 'ర్' ('రు'). 'విజయరాజ్యసంవత్సరంబుల్' అనుదానిలో 'ల్' ప్రత్యయము చూడవచ్చును. దీనిని 'ముట్వ్ర', 'భటారకాడు', 'పుట్వ్ర', 'అఱ్వపట్టు' అను పదములలో చైతము గనదగును.

'ముట్వ్ర'—ఇది ప్రాచీనము లైన తెలుగుశాసనములలో బహువచనముగనే ప్రయుక్తమయినది. కానీ నే ఇది నిత్యబహువచనమమాత్రము కాదు. 'ముట్టు' పదము బహువచనరూపము 'ముట్వ్ర'. 'ముట్టు' అనునది 'పనిముట్టు'వంటి ఏకాలదిపదములలోనో గానబడును. 'ముట్టు' అనగా కార్యనిర్వహణమున కగు ఒక సాధన విశేషము. 'ముట్వ్ర' అనుదాని యర్థము వంటే; కార్యకరణసాధనము. ఇది గౌరవవాచకబహువచనరూపము: కార్యకర్త, కార్యమును నిర్వహించునుద్యోగి. ప్రభువు వాజ్ఞ నములజరుపువాడని యర్థము. 'ముట్వ్ర'కు, 'ముదలి'కి ఎక్కువ దగ్గఱ సంబంధ మున్నట్లు కనబడును. ఈ సంబంధ మెట్టిదో, ధాతురూప మేదో విచారింపదగినది.

'క్రిథివిదేశ'రూపము విచిత్రమైనది. అసలు రూపము పృథివి కాని క్రిథివి కాదు; కాని, మన ప్రాచీనవిద్వాంసులు ఋకారమును తెల్పి ఇకారముగనే యుచ్చరించువారు. పండితులును, లాక్షణికులు నంగీకరించిన యుచ్చారణ మే యిది. ఈ కారణమునచే పూర్వలాక్షణికులు 'ఋ', 'ఇ'లకు యతిమైత్రినికూడ నంగీకరించియున్నారు. ఈ చ్చారణము ననుసరించి 'పృథివి' వ్రాతలో 'క్రిథివి' యైనది. ఇట్టి యుదాహరణములను ప్రాచీనశాసనములనుండి యనేకములను జూపవచ్చును. 'క్రిథివిదేశ' మన్నది సమస్తదేశము అనునర్థమున ప్రయోగించినట్లు కనబడును. ఒకవేళ నిది బిరుదముకాని, బిరుదమువంటిదికాని అయినను కావచ్చును. 'దేశమున కంతకు ప్రముఖుడు' అనునర్థమున 'క్రిథివిదేశ' పదము ప్రయుక్తమయినట్లు తోచుచున్నది. అట్లయినచో ఈ 'క్రిథివిదేశ'ము 'పణ్ణివాణ్డు' (పణ్ణివాడు) అగుటకు సందేహము లేదు.

'అఱ్వపట్టు'-తరువాతి కాలమున 'అఱ్వపట్టుగ' వ్రాయువారు. 'అఱి' యన్నది ధాన్యవిశేషము. దానముచేసినది "అఱుపుట్వ్ర అఱ్వపట్టు సుక్షేత్రంబు"— అఱ్లు అను ధాన్యము పండునట్టి అఱుపుట్వ్ర సుక్షేత్రము.

దానమిచ్చినది 'అరహన్తభటారకాడు.' అరహన్త యనునది అర్హతపదము దుష్టరూపము. బౌద్ధ, జైన ప్రాచీనవాఙ్మయమున గానవచ్చునది 'అర్హత'రూపమే. అర్హతులనగా జైన, బౌద్ధసన్యాసులు. బౌద్ధులలోకూడ అర్హతు లుండినను ప్రధానముగ జైనయతులను అర్హతు లని వ్యవహరించువారు. 'భటారరు' భట్టారకులు. మహామండలేశ్వరులు సుప్రసిద్ధులైన మహారాజులను,దేవతలనుకూడ భట్టారకు లని వ్యవహరించుట సంప్రదాయసిద్ధము. గౌరవబహువచనరూపమైన పదము చివరివర్ణము మీది అకారము షష్ఠీవిభక్తిప్రత్యయము పరమైనప్పుడు ప్రాయికముగ దీర్ఘముగుచుండినట్లు ప్రాచీనశాసనములందలి రూపములను గమనించిన తెలియగలదు. ఇచట అర్హతభటార అన్నది జినదేవునికిగాని, బుద్ధదేవునికి గాని చెందునని తోచుచున్నది. ఇందుల కుపబలకమైనది 'పణ్ని'పదము. అత్యంతప్రాచీనకాలమున జినదేవుని యాలయమునకుగాని, బుద్ధదేవుని చైత్యాలయమునకుగాని 'పణ్ని'యని పేరు. ఇట్టి 'పళ్లి'లు అధికముగా నుండిన దేశముగనుకనే ఇప్పటి పల్నాడు

పూర్వము పల్లినాడని వ్యవహరింపబడుచువచ్చినది. ప్రాచీన 'పల్లినాణ్డు' నేడు 'పల్నాడు'గా మారినది. ప్రాచీనకాలమున కృష్ణాతీరస్థమైన గుంటూరుమండల ఉత్తరభాగము ఒకప్పుడు బౌద్ధమతమునకు పట్టుగొమ్మగ నుండెనన్న విషయము అందరికి తెలిసినదే. నాగార్జునుని కొండ, అమరావతులు ఈ ప్రాంతము లోనివే. పల్నాడుదేశమున నేటికిని బౌద్ధశిథిలము లందందు అనేకములు కానవచ్చును. అందువలన ఈ యర్హత్తభటారకుడు ఒకవేళ బుద్ధదేవుడు కావచ్చునని యూహించుచున్నాను. బుద్ధదేవుని పూజ పల్నాడు ప్రాంతదేశమున క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దివఱకు సాగుచుండెననుటకు నిదర్శనములు కలవు. ఎట్లయిన నేమి, ఈదానము బౌద్ధులకో, జైనులకో ప్రీతిగ జేసిన దనుట నిశ్చయము.

శాసనమున పదుమూడవ పంక్తినుండి దానరక్షణ ఫలము మొదలైనవి చెప్పబడినవి. 'జేని' అనునది 'దీనిని' అనుదాని ప్రాచీనరూపము. ఇంతకంటెను ప్రాచీన శాసనములలో 'దీని'కి బదులుగా 'తేని'రూపమే యున్నది. శాసనమునందలి 'తేని', 'జేని'రూపములను పురస్కరించుకొని మన మెుకవిధముగా శాసనప్రాచీనతను స్థిరపరుపవచ్చును. ఈ విషయమున నే నిదివఱలో ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలో (౧౯౪౦ - ౧౯౪౧) వ్రాసియున్నాను. 'జేని' అనునది ద్వితీయావిభక్తి రూపము. 'దేనికి' అనునది షష్ఠీరూపము-'దీనికి' అని యర్థము.

'త్లొంబూరు'—ఇదేదో గ్రామముపేరు. దీని అర్వాచీనరూప మెట్లుండునో తెలియుట లేదు. ప్రాయికముగ నిది తొండూరుకాని, లొండూరు కాని కావలె



నేమో! లేక ఇంకను ఈ పేరు మార్పుచెందినదో. ఈ పేరుగల యూరు నాకింతవఱకు తెలియరాలేదు—స్థానికులకు విచారించిన తెలియునేమో.

'అన్వయంబునవారు' అనగా వంశమువారు, కులమువారు, అన్వయమునకు చెందినవారు, అన్వయము నందలివారు అని యర్థము.

'ఎక్వైయుము'—ఈ పదములోని క డ ప టి 'ఉము' అరవమునందలి 'ఉమ్'రూపమే. మనది అజంత భాషగనుక 'ఉమ్' 'ఉము' అయినది. ఇది సముచ్చయము. నేటి తెలుగుభాషలో 'ఉము' 'ఉను'గాను, 'ను'గాను మారినది. 'ఎక్వైయుము' అనగా 'ఎక్వైయును' ఎక్వైయున్నప్పటికి - ఎక్వైననుసరే అని యర్థము.

'ఎక్వైయుము'తరువాత 'దేనికి'వఱకు సరిగా అర్థము తెలియుట లేదు. "త్లొంబూరిరట్టగుళ్ల వంశమువారెక్వైయున్నప్పటికి వారు ఈధర్మమును రక్షింపవలెను" అని భావము. భావ మిది యని తెలియుచున్నను విడివిడి పదములకు అర్థము తెలియుటలేదు.

"అహితంబు చిన్తిఞ్చువారు"—నిగ్రహలదువారు, కీడు తలచువారు, అపకారముతలచువారు అని యర్థము.

"పఞ్చమహాపాతకసంయుక్త..."—పంచమహాపాతకములు తమ్ముతాము చుట్టుకొన్నవారు అగుదురని యర్థము, చివరిభాగము పోయినది.*

నా యూహ కందినట్లు శాసనస్థపదముల కర్థము నిర్వచించినాను. ఇదియే సరియైనదని నే ననలేను. ఇందలి తప్పొప్పులు వివరించు భారము సహృదయులైన భాషాశాస్త్రవేత్తలది.

* శాసనప్రతిబింబమును తరువాత ప్రకటించగలను.



# పులివర్రు కైఫీయత్తు

= సంకలయిత: శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు =

ఈ స్థలం పూర్వము కృష్ణాతీరమందు బహు అరణ్యంగాను వున్నందున త్రిలోకసంచారి అయిన నారదమహాముని ఒక నాటి సమయమందున యీ మార్గాన వెళ్లుతూ యీ కృష్ణాతీరమందు వున్న యీ అరణ్యం బహురమణీయముగా వున్నందున సంతోషించి శివలింగ ప్రతిష్ఠ చేసి బహుదినములు అనేక ఋషిగణసమేతముగా యీ స్థలమందు నివాసము చేసినారు. యీ ప్రకారం బహుదినములు జరిగినపిమ్మట వ్యాఘ్రపాదుడనే ఋషీశ్వరుడు యీ తీరమందు ఆశ్రమం చేసుకొని నారదమహామునిచేతను ప్రతిష్ఠ చెయ్యబడ్డ దివ్యలింగమును పూజిస్తూ కంచి శ్రీ వరదరాజస్వామివారి దర్శనం నిత్యనియమముగా యేర్పరుచుకొని ప్రతిదినం వాయువేగములచేతను కంచికి వెళ్లి శ్రీ స్వామివారి దర్శనం చేసి భక్తియుక్తముగా షోడశోపచారములచేత పూజించుకొని తదనంతరం తిరిగి ఆశ్రమానికి వస్తూవచ్చేవారు.

ఈలాగు కొన్ని దినములు జరిగినపిమ్మట ఒక దినమందు దివారాత్రిములు యెడతెగకుండ జగదుపద్రవంగా అఖండమయిన వర్షం వాయుసహితంగా కురుస్తూ వున్నందున తన నిత్యనియమమునకు లోపం రాకుండా ఆశ్రమమందు మహాలింగార్చన యథావిధిగా జరుపుకొని అలాగున వర్షించే సమయమందు కంచికి వెళ్లి వరదరాజస్వామివారి దర్శనం చేసేనంతలో అందుకు చాలా అనుగ్రహం వచ్చి, నీకు యిష్టం అయిన వరం చేకుమని ఆనతిచ్చినందున వ్యాఘ్రపాదమహర్షి ఆనందభరితాంతరంగుడై, యీ స్వరూపకముగా తన్ను ఆశ్రమమందు యుండి సదా నాచేత పూజింపబడుతూవుండవలసినది అని కోరినాడుగనుక భక్తవత్సలుడైనందున అతని మనోభీష్టము తీర్చేకొరకు అనుగ్రహించినారు.

అంతట ఆ ఋషి ఆశ్రమానికి వచ్చి మరునాడు అరుణోదయాత్పూర్వమందు సమీపగామి అయిన కృష్ణవేణీమహానదిలో స్నానం చేస్తూవుండగా ఆ ప్రవాహమందు మహోచ్ఛ్రితంగా వుదకం పొంగి తరంగములతో కూడా ఆ శ్యామ బింబరూపమయిన శిలావిగ్రహము దరికి వచ్చినందున వ్యాఘ్రపాదుడు చూచి సంతోషభరితుడై ఆ మూర్తిని తీసుకొనివచ్చి నారదమహామునిచేతను ప్రతిష్ఠచేయబడ్డ మహాశివునకు సమ్ముఖముగా తూర్పుభాగమందు ప్రతిష్ఠచేసి వరదరాజస్వామి అనే నామం యేర్పరచి అత్యంతభక్తితాత్పర్యములచేతను హరిహరాదులను పూజిస్తూవుండే సమయమందు మౌద్గల్యమహాముని తాను తుష్టున్యాదిచేతను వున్నప్పుడు తన భార్య పాతివ్రత్యగుణములకు మెచ్చి యిచ్చిన వరములచేతను తత్పత్ని మనోహరమైన దివ్యసుందరరూపము ధరించి దివ్యవిమానారూఢుడై రమణీయప్రదేశములయందు విహరిస్తూవుండేవాడై యీ స్థలమందున్న క్రీడిస్తూవుండుట చూచి వ్యాఘ్రపాదమహాముని అపహసించినందున మౌద్గల్యమహాముని కోపోద్దీపితులై నామము సార్థక్యముగా వ్యాఘ్రము గమ్మని శపించిరి.

గనుక ఆ వ్యాఘ్రపాదుడు ప్రతిశాపం యిచ్చే శక్తి కలిగిన్ని శాంతిస్వరూపుడై తపోభంగమునకు సందేహించి ప్రారబ్ధం అనుభవించక తీరదు అని మౌద్గల్యమహామునిని చూచి యీలాగంటి యుగ్రశాపము యివ్వడానికి సహజమేనా, అనేక జీవహింసలు చేస్తూ యీ మృగరూపకముగా యేలాగు సంచరింతును అని ప్రార్థించినంతలో దయవచ్చి, తమ శాపం అమోఘముగనుక ముందు రాజరాజనరేంద్రుని బాణప్రయోగంవల్ల నీకు విముక్తి కాగలదున్ను. దివ్యజ్ఞానసంపన్నుడవై మృగరూపం ధరించి క్షుత్పిపాసం లేకుండా కొంతకాలం వుండగలవు అని వోదార్చినారు. గనుక తచ్ఛాపం వల్లను వ్యాఘ్రస్వరూపుడై యీ ఆశ్రమమందే యుండి పూర్వవాసనాధిక్యతచేత జ్ఞానం కలిగి చాల నిరూపణ చేస్తూ బహుదినములు వుండెను.

తదనంతరం లింగంమీదను పుట్ట పెరిగి తత్సమీపమందు శమీవృక్షము మొలచినందున యీ వ్యాఘ్రము నిత్యమున్ను ఆ వల్మీకమునకు ప్రదక్షిణముచేసి తత్సమీపఅరణ్యమందు సంచరిస్తూవుంటూవుండెను. కలియుగం సంప్రాప్తమయి పరీక్షిత్ జనమేజయాదిరాజులు కొందరు ప్రభుత్వంచేసి చనినపిమ్మట తద్వంశీకుడైన రాజరాజనరేంద్రు డనే రాజు ప్రభుత్వంవహించి చేస్తూవున్నంతలో దివ్యజ్ఞానంచేతను తెలిసిశార్దూలస్వరూపుడైన వ్యాఘ్రపాదుడు రాజరాజనరేంద్రుడికి రాజధానియైన రాజమహేంద్రవరానకు వెళ్లి యోగబలంచేతను రాజగృహాంతరమందు ప్రవేశించి రాజుకు సమీపమందు దృష్టమై అన్యులకు దృష్టంకాకుండా వుండివున్నందున రాజు యిది మహాభూత మని యోచించి తన గురువైన కాశీనాథయ్యగారిని బెజవాడలో వుండగా పిలిపించుకొని యీ వృత్తాంత మాద్యంతమున్ను తెలియపరచినంతలో వీరశరభసాళువమహాపంచాక్షరీమంత్రసిద్ధులు కనుక శరభసాళువయంత్రములచేతను దిగ్బంధనచేసి తిరిగి బెజవాడ ప్రవేశించినారు.

ఆ వ్యాఘ్రం పూర్వప్రకారం రాజసన్నిధికి వెళ్లడానికి వుపయుక్తి లేక తత్కృత్యం తెలిసి అయ్యవారలవారిదగ్గిరకు వచ్చి తన శాపవృత్తాంతం చెప్పుకొని ముక్తిరాగల హేతువ విన్నవించినంతలో కాశీనాథయ్యగారు చెప్పిన సంగతి. నీవు మహారుషివి. ఆ రాజు బాణఘాతంవల్ల నీ దేహం బాధిస్తే ఆ రాజుకు బ్రహ్మహత్య సంభవించును. యిందుకు నేను యే ప్రకారంగా బ్రహ్మహత్య సంభవింపజేతును అని అన్నందున వ్యాఘ్రపాదుడు నాకు శాపవిముక్తి చేసి తద్దోషపరిహారార్థముగా నారదమహామునిచేత ప్రతిష్ఠచేయబడ్డ దివ్యలింగము వల్మీకములో వుండివున్నదిగనుక ఆ లింగమును ప్రతిష్ఠచేసి నాకు శాపనివారణముచేసి రాజు సుకృతమును పొందగలడని చెప్పినందున సంతోషించి రాజమహేంద్రవరానకు వెళ్లి రాజుతో వ్యాఘ్రపాదుని వృత్తాంతం తెలియపరచి ఆయనను వెంటతీసుకొని యీ స్థలానికి వచ్చి రాజుకు వ్యాఘ్రమును అగుపరచి బాణప్రయోగం చెయ్యమన్నందున ఆజ్ఞప్రకారం రాజు బాణం సంధించి ప్రయోగించిరి. గనుక శార్దూలశరీరం వదలి పూర్వప్రకారం రుషిరూపం ధరించి నీ వల్ల నాకు శాపవిముక్తి అయినది. నీవు మహాపుణ్యాత్ముడవు అని స్తుతిచేసి యీ అరణ్యం ఛేదించి నా పేరట పట్నం నిర్మాణంచేయించి నీ పేరట లింగమూర్తిని ప్రతిష్ఠ చెయ్యమని సుకృతకార్యం ప్రశస్యపక్రమిగా చెప్పి ఆ వల్మీకం అగుపరచిరిగనుక తద్వచనప్రకారం అరణ్యం ఛేదింపజేసి పట్నం కట్టించి ఆ పట్నానికి శార్దూలపురం అనే పేరు పెట్టి వల్మీకం త్రవ్వించి ఆ దివ్య శ్వేతలింగమును అక్కడనే శమీతరుమూలమందు ప్రతిష్ఠచేసి ఆ స్వామికి నరేంద్రలింగం అని పేరుపెట్టి అదిపర్యంతంనుంచి యిదివరకు దేవుని పేరు నరేంద్రస్వామివారు అని ప్రసిద్ధి అయినది. తత్ప్రాకారంలో కొద్దిదిగా రెండు ఆలయములు వుత్తరదిగ్భాగమందు కట్టించి శ్రీ త్రిపురసుందరీ అమ్మవారిని శ్రీ వీరభద్రస్వామినిన్ని భద్రకాళీసమేతముగా ప్రతిష్ఠచేయించినారు. యీశాన్యభాగమందు ఒక ఆలయం కట్టించి శ్రీ విఘ్నేశ్వరుణ్ణి ప్రతిష్ఠచేయించినారు.

ఈ పట్నం పేరు వ్యాఘ్రపురం. పులివరు అనిన్ని ప్రసిద్ధిగా కలిగియున్నది. శ్రీవరదరాజస్వామివారికిన్ని, శ్రీ నరేంద్రస్వామివారికిన్ని ఆలయప్రాకారగోపురమంటపాదులు కట్టించి వ్యాఘ్రపాదుని వచనప్రకారం శ్రీ నరేంద్రస్వామివారికి అర్చనచేయగలందులకు ఆత్రేయసగోత్రులకున్ను వెలనాటి బ్రాహ్మలున్ను అయిన మంత్రేటి శివయ్య అనే ఆయనకు నిర్ణయించి శ్రీ వరదరాజస్వామివారికి నల్లూరువారనే వైఖానసులమున్ను యేర్పరచి తమ గురువైన కాశీనాథయ్యగారిని యీ శివస్థలానికి స్థానాచార్యులుగా నిర్ణయించి శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపక దాన ప్రతిగ్రహ షట్కర్మనిరతులున్ను నిగమాగమోక్తవీరశైవాచార నిత్య త్రికాలశివపూజానిష్ఠాగరిష్ఠులున్ను శ్రీమదఘోరవీరశరభసాళువపంచాక్షరీమంత్రప్రసిద్ధులున్ను ఇడాపింగళా సుషుమ్నా గాంధారి హస్తిజిహ్వా పూషా యశస్విని అలంబుస కుహూ శంకిణీ నామదశసిద్ధనాడిమార్గ ప్రచారులున్ను, ఆధారస్వాధిష్ఠానమణిపూరక అనాహత విశుద్ధక ఆజ్ఞేయ షట్చక్రసంచారప్రపంచాత్మకులున్ను శ్రీమద్విజయవాట కాక్షేయభాగ శమీతరుశాఖాంగారబద్ధవరాశానేకవిద్య

జ్ఞానప్రభృతి విద్వజ్జనముక్తులయిన శ్రీపతిపండితారాధ్యదేశిక సాంప్రదాయక కౌశికగోత్రోద్భవ శ్రీకాశీనాథయ్యవార్ల గారుఅనే సార్థకబిరుదాంకితంబులును ప్రసిద్ధిచేసి వీరికి యీస్థలంలో జరగగలందులకు అనేకవృత్తులు వర్షాశనా లున్ను దయచేసి యీ దేవస్థలాలుక్కు నిత్యోత్సవపక్షోత్సవమాసోత్సవసంవత్సరోత్సవములు మొదలయిన మహో వుత్సవములు జరుగగలందులకు కావలసిన వసతులు యేర్పరచి కాశీనాథయ్యవార్లగారిని యిక్కడ వుంచి రాజరాజనరేంద్ర మహారాజులుంగారు తిరిగి రాజమహేంద్రవరానకు వెళ్లి కొన్ని దినములు ప్రభుత్వం చేసి చనినమీదట తద్వంశీకులయిన రాజులు యిదేప్రకారం యీస్థలములకు వుత్సవములు జరిపించినారు.

తదనంతరం మల్లవర్మ అనే రాజు యీపట్నం బహురమ్యంగా కట్టించి తుంగభద్రకు తూర్పుభాగమందు వున్న వెలనాటిదేశం ప్రభుత్వం చేసినమీదట అతని వంశీకుడైన గోంకరాజు ప్రభువై ఆంధ్రదేశం యావత్తు ఆక్రమించుకొని సమస్తమయిన రాజులను యుద్ధమందు జయించి అన్యనృపతులయొక్క దుర్గాలు దేశములు ఆక్రమించి అంతట జయస్తంభములు సంస్థాపించి యా దేశములయొక్క నృపతులు శరణాగతులై కొలిచేటట్టు చేసుకొని యీ స్వామివారి దేవాలయములమీదను బంగారుకలశములు సంస్థాపించి అఖండభూమండలాధిపతియై ప్రభుత్వం చేసిరిగనుక అతని కొమారుడైన చోడరాజు తంత్రికిన్ని మిక్కిలి యశస్కాములై శత్రువులను జయించి వారియొక్క గజాశ్వ గోమాణిక్యములు మొదలయినవి హరించి ద్రాక్షారామ భీమేశ్వరునికి భక్తుడైనందున ఆ వస్తువులు ఆ స్వామివారికి సమర్పించి తత్కటాక్షంచేతను దినదినప్రవర్ధమానుడై ప్రభుత్వంచేస కృష్ణవేణ్యానదీతీరమందు యీ వ్యాఘ్రపురీనరేంద్రేశ్వరవరదరాజస్వామివార్లకు సకల వుత్సవములు జరిగించుచు. అతని తరుణమందు కొమారుడైన నరేంద్రుడు భూభారతవహించి శ్రీస్వామివార్ల అనుగ్రహంచేతను దానశాస్త్రములయందు ప్రవీణుడై తన వంశీకులైన రాజులకంటె అధికు డనిపించుకొని రాజ్యంచేసె. గనుక యితని వంశమందు కరికాళచోళ మహారాజు జన్మించి అఖండశివపూజానిష్ఠాగరిష్ఠుడై చోళ మండలం తనకు రాజధానిగా వహించి ముక్కంటి మొదలయిన సమస్తదేశాధిపతులును తన ఆజ్ఞాబద్ధులై కొల్వగా కావేరిఆనకట్ట కట్టించి యిచ్ఛాకారాన్వయులై అయోధ్యయందు వహించి రాజ్యంచేసే తెరగున భూపాలన చేసి యావద్దేశములయందు వున్న పట్నములయందు స్వనామాంకితలింగప్రతిష్ఠలు చేసి యీ వ్యాఘ్రపుపట్నానికి వచ్చి శ్రీస్వామివారికి అత్యంతభక్తి తాత్పర్యముచేతను సకలోత్సవములు చేయిస్తూవుండగా ఆరాజు సద్భక్తికి మెచ్చి యీశ్వరుడు నృత్యం చేసినందున రాజు సంతోషించి సార్వకాలమున్ను యీ మహాదేవునకు నిత్యనైవేద్యదీపారాధనలకు జరిగేటట్టుగా భక్తక్షేత్రం ధారాగ్రహితంగా సమర్పణ చేసి మరిన్ని పులిపర్తి నాయకుల మూలంగా అఖండవర్తిదీపంబులకు పరోత్సవంబులు మొదలయినవి వినియోగములకు చేయించిన ధర్మంబులు శాసనస్తంభములమీదను లిఖింప చేసి ప్రభుత్వంచేసి చనినమీదట ఆతని తరుణమందు కులోత్తుంగచోళమహారాజు శాలివాహనం ౧౦౩౦ శకమందు పదకొండోయేట పట్టాభిషిక్తుడై నిత్యశివలింగ ప్రతిష్ఠలుచేసి రాజ్యంచేస్తూవుండగా తూర్పుదేశము నుంచి గజపతిసింహాసనస్థుడై గణపతిమహారాజుసేనా సమేతముగా వచ్చి చోడరాజుతాలూకు ఆక్రోలానను పలాయనంచేయించి దేశము స్వాధీనముచేసుకొనిరి.

గనుక వీరి ప్రధానులైన గోపరాజు రామన్న గారు ధర్మవంతుడైనందున దేశమంతటా సబాణావారున్ను సత్రములు కరిణేకములు చేస్తూ బ్రాహ్మణులకు బాధోక్కరంగా ప్రవర్తిస్తూవుండుట రామన్నగారికి తెలిసి కృష్ణవేణీతటమందు సూర్యోపరాగకాలమందున ధారాగ్రహితము పట్టి శాలివాహనం ౧౦౬౪ శకమందు బ్రాహ్మణులకు గ్రామమిరాశీసనదులు వ్రాయించి యిప్పించే మొదల యీ పులిపర్తికి ఆరువేలని యోగ్యులు—

పులిగడ్డవారి భాగం ౧ నైద్రాజువారు బొమ్మరాజువారు ౧. యీ రెండు సంప్రతులు యేర్పరచి మజ్కూరుపోలంలో నాలుగుకుచ్చళ్ల భూమి యినాం యిప్పించి మిరాశిల హాజుమాలు అనుభవించేలాగున నిర్ణయించినారు.

యీప్రకారం కరిణీకపు మిరాశీలు నిర్ణయించి ప్రభుత్వం చేస్తూవున్నంతలో తిరిగి కళోత్తుంగచోళ రాజు యీదేశానకు వచ్చి రాజ్యం ఆక్రమించి శా ౧౦౯౩ శకంవరకు ప్రభుత్వం చేసిరి. గనుక తదనంతరం కోటభీమరాజు యితని కొడుకు కేతమహారాజు శైవర భూపాలుడు పర్యంతరం శా ౧౨౨౦ శకంవరకు ప్రభుత్వములు జరిగినవి. తదనంతరం చినవేమారెడ్డిగారు కృష్ణానదీదక్షిణతీరదేశం ఆక్రమించిరిగనుక వారి ప్రభుత్వం శాలివాహనం ౧౨౯౦ శకంవరకు ౭౦ సంవత్సరములు ప్రభుత్వం చేసిరి. శాలివాహనం ౧౩౦౦ శకమందు వోరుగల్లు సింహాసనాధీసులైన లాంగూలగజపతి సదాశివగజ్జలకులాభ్యుపురుషులైన వీరభద్రవేమారెడ్డిగారిని జయించి యేగే స్థలదుర్గాలు గిరిదుర్గాలు ఆక్రమించి అతని ప్రభుత్వం లగాయితునుంచి పురుషోత్తమగజపతి వీరభద్రగజపతిపరియంతరం శాలివాహనం ౧౩౦౧ శకం లగాయతు శా ౧౪౩౬ శకంవరకు ౧౩౬ సంవత్సరములు యీప్రభుత్వం చేసిరి. తదనంతరం నరపతి సింహాసనస్థులైన కృష్ణదేవమహారాయలు యీ దేశానకు వచ్చి కొండవీటిలో వీరభద్రగజపతివారిని సామంత సేనాన్యక్షపరివారసమేతంగా పట్టుకొని ప్రభుత్వం తమవశం చేసుకొనిరి. గనుక వారి ప్రభుత్వము మొదలు కొని రామరాయలవారి అధికారాంతరకు శా ౧౪౩౮ శకం మొదలుకొని శా ౧౪౯౯ శకంవరకు ౬౩ సంవత్సరములు కర్ణాటకప్రభుత్వములు జరిగినవి. తదనంతర దేశము మ్లేచ్ఛాక్రాంత మయినందున మల్కి యిభరం హీంపాదుషావారి అధికారములు. యీ దేవస్థానాలు అర్చనాదికృత్యములు జరుగకుండా ఖిలపడివున్నందున గుంటుపల్లి ముత్తరాజయ్యగారు ప్రభుత్వం చేస్తూ వున్న సమయమందు శా ౧౫౧౨ అను శేట విజయ నామసంవత్సర చైత్ర శు ౧౦ గురువారం చక్రవర్తులైన చిల్లంగోరవి గంగిసేను శ్రీ వరదరాజస్వామివారికి శ్రీ నరేంద్రస్వామివారికి పునఃప్రతిష్ఠ చేసి అర్చనాదికృత్యములు జరిగించినారు.

తదనంతరం సుల్తానబ్దుల్లా పాదుశహావారి ప్రభుత్వంలో సర్కారుసముగుబందీలు రేఖ్వరచేయుడల యీ పులివరు విస్తారపుగ్రామము అయినందున యిక్కడ కసుబాచేసి దీనికింద సం॥ దోనెపూడి, పల్లికోన, వోలేరు, క్రాప, చినపులివరు, కణగాలు, గూడవల్లి, నడిమిపల్లి, గుంటపల్లి, పొన్నపల్లి చెరపూడి, పయిడిపాద్రు, చేబ్రోలు, రేపల్లె, నల్లూరు, పెద్దవరం, స్వయంభొట్లవేమవరం, నూజెపల్లి, కోసేటిపురం, అయిలవరం, పెనుమూడి, రుద్రవరం, గొరిగెపూడి, పెదలంక, పరిశపాడు, రాళ్ళఅనంతవరం, చాట్రగడ్డ, కామరాజుగడ్డ, పుష్పాశిఅరవపల్లి, యిసుకపలి, చినఅనంతవరం, రామూరు, కారుమూరు, ఆళ్ళమూరు, జమ్ములపాలెం, జల్లెవల్లి, ధూళిపూడి, శివంగులపాలెం, బట్టిప్రోలు, అద్దెపలి, పాంచాళవరం, వుద్దండవేమవరం, వెల్లటూరు, ఆరుంబాక, తోటపల్లి, విశ్వేశ్వరం అనే యీ ౪౮ గ్రామాదులు యీ కసుబాలోందను చెల్లేటట్టు నిర్ణయించి పులిపర్తిసంతు అనే పేరుపెట్టి పాత్ర్యనిగారిని దేశపాండ్యాలుగానున్న, సూర్యదేవరవారు అనే కమ్మవారు చౌదలుగానున్న రామరాయలువారినాట నుంచి వున్న మాణిక్యరావువారిని మన్నెవారినిగాను మానూరువారిని మజుముదార్లగానున్న నిర్ణయించిరి. యిట్లాప్రకారం సంతు . ఆమీలు చౌదరీదేశపాండ్యాల పరంగా యీపాదుశహావారి అమలులగాయతు సన్న ౧౧౨౨ ఫసలీవరకు సంవత్సరములు అమానితూము లిఖ్యాల్ చేసుకొంటూవచ్చినారు.

తదనంతరం సన్న ౧౧౨౩ ఫసలీలో నవాబు ముబారకఖాను సుబాదేశస్తులను పిలుపించి కొండవీటిసీమజమీందార్లకు వాడుకవంట్లు చేసి పంచిపెట్టేయెడల యీసముతురమణికి మాణిక్యారావువారి మట్టులో వచ్చినది కనుక సదరహీ ఫసలీ మొదలుకొని సన్న ౧౧౨౬ ఫసలీవరకు వాల్గు సంవత్సరములు ఆయన ప్రభుత్వం చేసెను!

తర్వాత ఆయన తమ్ములయిన వల్లన్నమాణిక్యారాయనింగారు సన్న ౧౧౨౪ ఫసలీలో ప్రభుత్వానకు వచ్చి సన్న ౧౧౬౦ ఫసలీవరకు ౩౩ సంవత్సరములు ప్రభుత్వం చేసెను. తర్వాత నిజామల్ ముల్కు బహాదరుగారి కొమారుడు అయిన సాసరజంగుబహాదరుగారు యీ సర్కారులుఫరాంసువారికి సదరహీ ఫసలీలో యిచ్చిరిగనుక వారు ప్రభుత్వం చేస్తూ దేవాదాయ

బ్రహ్మదాయములకు చాలా వుపద్రవములు చేస్తూ శ్రీ వరదరాజస్వామివారి ప్రాకారం విప్పించి ఆ రాళ్లు తీసుకొనివెళ్లి ముస్నెలశ్నేను అనే ధొర యీ గ్రామానకు పశ్చిమభాగమందు మేడ కట్టించుకొని సన్ ౧౧౬౫ ఫసలీవరకు యేడుసంవత్సరములు ప్రభుత్వం చేసి అపజయులై పోయినారు. పైన వ్రాసిన సన్ ౧౧౬౦ ఫసలీలో సీతన్నామాణిక్య రాయనింగారి అన్న వెంకటరాయనింగారి కొమాళ్లు అయిన రాజాగోపాలమాణిక్యరాయనింగారు ప్రభుత్వానకు వచ్చి నవాబుబషాల్ జంగుబహాదరి దర్శనానకు సన్ ౧౧౬౫ ఫసలీలో ఆకోని వెళ్లి పోకంచేతను బహుమానం పొంది తిరిగి తాలూకాలోకి వచ్చి సదరుహీ ఫసలీలగాయితు సన్ ౧౧౬౮ ఫసలీవరకు ౯ సంవత్సరములు ప్రభుత్వం చేసి దేవాదాయబ్రహ్మదాయములు జరిగించినారు. తదనంతరం సీతన్నమాణిక్యరాయనింగారి కొమాళ్లు అయిన జగన్నామాణిక్యరాయనింగారు సన్ ౧౧౬౦ ఫసలీలో ప్రభుత్వానకు వచ్చి సన్ ౧౧౭౩ ఫసలీవరకు ౧౪ సంవత్సరము అధికారం జరిగినమీదట యీయనతమ్ములయిన తిరుపతిరాయనింగారు కలతపెట్టినందున సన్ ౧౧౭౩ సంవత్సరములో తమ తాలూకాలు రెండు వంట్లుగా చేరి పగంపంచుకొన్నారు. గనుక యీగ్రామం రెండువంట్లు చేసినందున జగన్నాగారి వంటు సన్ ౧౨౦౦ ఫసలీవరకు ౧౭ సంవత్సరములు జగన్నగారు ప్రభుత్వం చేసి తమ వంటులో వచ్చిన శ్రీ వరేశ్వరస్వామివారికి పూర్వులకన్న మిక్కిలిగా మహోత్సవములు జరిగించి చనిన పిదప యీయనకొమాళ్లు అయిన రాజాభావయ్యమాణిక్య రాయనింగారు సన్ ౧౨౦౧ ఫసలీలో ప్రభుత్వానకు వచ్చి తన తండ్రిగారివలెనే ధర్మవంతులైన మజుకూరి శ్రీ వరేశ్వరస్వామివారికి జరిగే వుత్సవములకు పడితరములు నృత్తములు వగయిరాలకు లోపము రాకుండా జరిగిస్తూ దేవాదాయబ్రహ్మదాయములకు విచ్ఛిత్తి లేకుండా నేటివరకు జరిగిస్తూవున్నారు. తిరుపతిరాయనింగారి వంటు సన్ ౧౧౭౩ ఫసలీలగాయితు చేరి సఖముగా పంచుకొన్న తన వంటుకు ప్రభుత్వం చేస్తూ మజకూరిలో శ్రీ వరదరాజస్వామివారు తిమ సఖంవంటులో వచ్చినందున స్వామివారికి అనేకవుత్సవములు జరిగించి నిత్యనైవేద్యదీపారాధనలకు జరగవలసినందుకు మామూలుగా వుండుకున్న నృత్తులు నిరాటంకంగా జరిగిస్తూ సన్ ౧౨౦౧ ఫసలీవరకు ౧౯ సంవత్సరములు ప్రభుత్వం చేసినారు.

తదనంతరం ఆయనకొమారుడు అయిన అప్పారాయనింగారు సన్ ౧౨౦౨ ఫసలీలగాయితు సన్ ౧౨౦౪ ఫసలీవరకు ౩ సంవత్సరములు ప్రభుత్వం చేసిరి. గనుక తమ్ములు అయిన సీతయ్యగారు సన్ ౧౨౦౫ ఫసలీలో ప్రభుత్వానికి వచ్చి సన్ ౧౨౦౮ ఫసలీవరకు నాల్గు సంవత్సరములు ప్రభుత్వం చేసినారు. యీ సీతయ్యగారు చనిపోయినందున జగ్గన్నగారి కుమారుడైన భావయ్యగారు యీ రానూరువంటు తాలూకాకూడా సన్ ౧౨౦౯ ఫసలీలగాయితు సన్ ౧౨౧౧ ఫసలీవరకు ౩ సంవత్సరములు యేకముగా నేమామిలియ్యకు లంపిన మీదట సన్ ౧౨౧౨ ఫసలీవరకు చూరవంటుతాలూకా మహారాజశ్రీ కుంఫిణీవారు వేలాం వేయించిరి. గనుక రాజామన్రాజా వెంకటగుండారాయనింగారు వేలాంలో కొన్నందున తదారభ్య యీమటుకు ప్రభుత్వం చేస్తూ మజకూరిమట్టులో వుండుకున్న శ్రీ వరదరాజస్వామివారికి యథాప్రకారముగా వుత్సవములు జరిగిస్తూ నిత్యనైవేద్యదీపారాధనలకు మామూలుగా జరుగుతూవుండే నృత్తులకు ఆటంకము లేకుండా జరిగిస్తూనే యున్నారు. పూర్వంయందు బెరుమానాలువార్ శ్రీ పురుషోత్తం వేంచేశేటప్పుడు యీ కృష్ణాతీరమందు వున్న వరదరాజస్వామివారి కోవెలలోకి వచ్చి ఆ దినము అక్కడ నివాసము చేసి స్వామివారిని సేవించి మరునాటి దినం శ్రీకాకుళం ప్రవేశించినారుగనుక యీస్థలం మహాపుణ్యస్థలమని ప్రసిద్ధి అయినది. తదనంతరం తొండమాను చక్రవర్తి అనే రాజా యీస్థలం ఎంబెరుమానార్లు వేంచేసిన స్థలమని యిక్కడికి వచ్చి కృష్ణవేణీనదిలో స్నానం చేసి స్వామివారిని సేవిస్తూ కొన్నిదినములు యిక్కడ వుండి తమకు గురుస్వాములయిన శ్రీరంగరాజభట్టరు అయ్యగార్లవారిని యిక్కడ యీస్థలానకు స్థానాచార్యులుగా నిర్ణయంచేసి వారి అభిమతం చేతను సన్నిధానిర్వ్యర్ణము వేంచేపుచేసి గోపురప్రాకారములు నిర్మాణంచేయించి త్రిమతస్థుల

చేతను ప్రసాదస్వీకారము చేయించి యిరువై అయిదుగురు వైష్ణవకుటుంబాలను యిక్కడ కాపురం వుంచి శ్రీ స్వామివారికి అధికములుగా వుత్సవములు జరగ గలందులకు వసగులు యేర్పరచి స్వస్థానములకు వెళ్లి నారు.

యిటుతర్వాత దేశములు తురకాణ్యం ప్రబల మయిన తర్వాతను మజుకూరిలోకి తనఖానిమిత్తం ఒక సరదారుడు వచ్చి బలాత్కారముచేతను తన సామాను ఆలయంలో వుంచినారుగనుక పెట్టెలలో వున్న సామాను దగ్ధమైపోయినందున అతనికి తెలిసి అర్చ కులను బాధపెట్టుతూ తన సామాను జోవుట విమర్శిం చుకునేవరకు ఆమధ్యమందు వున్న తన ఖురాను పుస్త కం బాగా వున్నందున అందుకు సంతోషయుక్తుండై బయటికి వచ్చేవరకు తన గుర్రానికి అత్యంతోపద్రవంగా నొప్పి కనుపించినందున చాలా ఖేదపడుతూవుండగా అక్కడయుండే రామస్వామివారి ఆలయంలోకి ప్రవే శించినందున నీకు చాలా వుపద్రవములు సంభవిస్తూ వున్నవి అని చెప్పినమీదట చాలా భయం కలిగి ఆల యములోనుంచి లేచివచ్చినాడుకనుక గుర్రానికి బాగా వున్నందున సంతోషయుక్తుండై సంప్రోక్షణకు కావల సిన ద్రవ్యము సమర్పించినారు యీ ప్రకారముగా దృశ్యములు కనుపరుస్తూ పూర్వం తమవిగ్రహమందు శ్వేతోదకం విస్తరించి వచ్చేలాగున చేసి యిక్కడ అనేకమైనదృష్టాంతము కనుపరుస్తూ యిప్పటికి మహాత్వం కలిగి మహాస్థలంగా ప్రసిద్ధి అయివున్నది.

మరిన్ని సూర్యాస్తమాన సమయమందు వుత్త రాయణకాలంలో ఆ సూర్యుని కాంతి శ్రీ వరదరాజ స్వామివారియొక్క పాదములయందు ఛాయగా ప్రతి ఫలిస్తూ యిప్పటికి దృష్టాంతముగా కనపడుతూ వున్నది.

శ్రీ నరేంద్రస్వామి మహాత్మ్యం వివా,

౧. శ్రీ నరేశ్వరలింగం పూర్వం వల్మీకములో వుండి వున్నప్పుడు రాజరాజ నరేంద్రుడు వచ్చి వల్మీకం తవ్వించే సమయమందు పలుగుమైన తగిలి కొంచం శకలం వూడినందున అగంటలోనుంచి రక్తం వచ్చె గనుక తచ్ఛాంతి చెయ్యబడ్డది అని పూర్వులవల్ల తెలియడం అయినది. అందుకు దృష్టాంతం యిప్పటికిన్ని లింగమూర్తికి దక్షిణభాగమందు కొంచం గంటుగా యేర్పడియున్నది.

౨. శ్రీ నరేశ్వరిస్వామివారు పూర్వం వల్మీ కంలో వుండివున్న శమీవృక్షం చాలాదినములు జరిగి నప్పటికిన్ని గుల్లపారి వున్నందున వాయువుగల్లనుంచి పడిపోయిన్ని తద్వృక్షమూలమందు తత్సంబంధమైన వృక్షం తిరిగి పెరుగుతూవున్నది.

౩. ఉత్తరాయణ సూర్యకాలమందు సూర్యో దయమయ్యే సమయమందు శ్రీ నరేశ్వరిస్వామివారి ఫాల భాగమందు వుదయబింబ కిరణములు ఛాయగా ప్రతి ఫలిస్తూ యినివరకు దృష్టాంతం కనబడుతూవున్నది. యీ ప్రకారంగా శ్రీ నరేశ్వరిస్వామివారున్ను శ్రీ వరద రాజ స్వామివారున్ను చాలా మహాత్మ్య దృష్టాంత ములు కలిగి మహోవుత్సవములు జరగగా రెండు స్థలములు వుంచివున్నవి.

—మద్రు జే పులివఱ్ఱు—

కరికాల చోళరాజుల శాసనము

ధనదాఖ్యపురం రమ్యం కృష్ణవేణ్యా సమీపతః, తుంగభద్రా తరంగిణ్యాః ప్రాన్తేశం వెలనాడితి. విఖ్యా తం జనసంపూర్ణం మల్లవర్మాతిథా కరోత్, స్వనామ్నా శివలింగేశం ప్రతిష్ఠాప్య వ్యాజత. తద్వంశజాతో గోం కీశ శరణ్య స్సేశ్యభూభృతాం, మదాన్ధగస్య విఖ్యాతా స్సాన్ద్రకజయున్నృపాన్. పంచాశత్ లక్షసంయుక్త మంత్రదేశ మపాలయత్, జిత్వా జిత్వాచ దుర్గాణి రాష్ట్రాణి నగరాణిచ, జయస్తంభ ప్రతీకాశా కాశకుం భమయాంచితాం, కుంభోశంభుని సూసేషు దత్వా దత్తా వ్యరాజితే. తత్పుత్రో వెలనాటిచోటినృపతిః ప్రత్యక్ష నారాయణో మాద్యోప్పంజర ఘంజరంజిత మహోలక్ష్య ప్రభావాన్వితః, జిత్వా వైరినృపాన్ తదశ్వగజగో గాణిక్యరత్నాధికం దాక్షారామపురీశ్వరాయరుచిరో శ్రీభీమరాధాయతై అలింగవేదిపర్యాప్తం హాటకం కోశ ముత్తమం, కృష్ణవేణ్యాః సరితః ననగరి విభాతిచకుత!

న్నచంద్రచాళోత్తమనాయకోదయై తత్రాయాంఖి
కాయాః పతిరాదిదేవనరేన్ద్రేశ్వరనామధేయః విరాజతే
రాజకళావతంసః సమస్తసంపత్సముదాయహేతుః. లక్షా
నృపాయ ప్రథమే మహీశా రామాదయో భూమి
మపాలయం హి, తద్వంశజాతో కరికాలచోడః శశాంక
భృత్పాదపయోజభృంగః, సర్వసంపత్సస్యసస్యానాం స్వర్గ
వృష్టితదాకరోత్ కాదామృతం సమాపాద్య రాజ
రాజితరామవత్, త్రినేత్రపల్లవం కృత్వా గర్వత
మార్జయా। తస్యాక్షచక్రం లలాటస్య భగ్నం కృత్వా స్వ
రాజిత, భూజపూజాక్షేత్రాణి త్రీణి సూర్యాపిత
తానిచ, నిజాజ్ఞయాంబరస్యాని చక్రే చక్రవర్తీ
నృపాన్, సహ్యపాదోద్భవం దేవి కావేరీచోడ మం
డపే, బద్ధ్వాచోడమహీపాలో వరక్షీవసుధా మిమాన్,
ఇక్ష్వాకువంశజాతానాం నృపాణాం నగరీశుభాం, శుభా
వహామనుప్యాణా మయోధ్యారాజితస్సహా. తత్రస్థాన్
బ్రాహ్మణాదించ చతుర్వర్ణసముద్భవాన్, నిత్యా పల్లవ
రాజశ్చ రాష్ట్రాణి నగరాణిచ, దత్వా శ్రీపల్లవచ్ఛాయే
ప్రతిష్ఠా మకరోద్భవేత్, తత్ర లింగప్రతిష్ఠాప్య
స్వనామ్న......................కత్వానితాన్వయవారిధి
చంద్రము పేతమూర్తిం గణపక్షితీశం, సేవ్య తే తత్ర
సురేశ్వరదిత్యరాజంతి నిత్యం వఘ్రుషేస్మి ముఖ్యం,
స్వామిప్రసాదాత్ సర్వేష్విన్ నరేన్ద్ర స్సపవర్తినా
వ్యాఘ్రపురాఖ్యం మహాదేవం దేవేశం నిర్మితం శుభం;
హవిర్భాల్యశ్చైన నృత్యంతం చంద్రమౌళయే, ద్వాత్రిం
శత్ఖండుకం క్షేత్రం దత్వా నందంతి పాయకం, మేఘ
రుద్రగణితే శకవత్సరే స్మిన్ రవో భుజగరాజ విశాల
దంతః, సునతోత్తమ నాయకః భూవారణ్యగణి
కాదిపవర్తిసన్నిధి నరేన్ద్రేశ్వరచే శుభ ౩౨ ॥

శ్రీ శ్రీ. స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను
పాలనం, పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్.

మరిన్ని పులివర్తినాయకులు నూగెమారెబోయెడి
వశమున బెట్టిన చేను ఖ ౧త్తం సాదవన్నతమ్మయతిమ్మన
వశమునబెట్టిన గోరియలు ౫౦ వీనిం తేకాని అఖండవర్తి
దీపంబులకు నిత్యం మానెడు నెయ్యి వడపంగలవాడు
రాముని వశమున బెట్టిన గోరియలు ౫౦ అఖండానికి
నిత్యం మానెడునెయ్యి పోయంగలవాడు. హితగోత్ర
పరహితరెడ్డిగారి వశమున క్షేత్ర ఖ ౩ వీరి తమ్ముడు
కమ్మయదేవర ఖ ౩త్తం శరగోత్రం కమ్మం నూగపరెడ్డి
గారి వశమున ఖ ౪ శైవాచార్యమూరప్పగారి వశమున
ఖ ౪త్తం కేచిరాజువశమున ఖ ౪త్తం యితని తమ్ముని
వశమున ఖ ౧త్తం ౩ వారి కొడుకు వశమున ఖ ౨ ౪
మరిన్ని ఖ ౧ ౨ పాత్రలింగన్న వశమున ఖ ౧౩, ౩త్తం
విశ్లమునాయుడు జాకసానికి ౩ మరిన్ని దీనికి ౧
క్షేత్రం కేచలివారికమ్మన ౧ క్షేత్రం యీప్రకారం
క్షేత్రం ఆచంద్రార్కము జరగగలందులకు సర్వమాన్యం
చేసిరి.

స్వస్తి శ్రీ శాలివాహనశకవరుషంబులు ౧౫౧౨
అగు నేటి విజయనామసంవత్సర చైత్రశుద్ధ ౧౦ గురు
వారం శ్రీ నరేన్ద్రలింగమును చిట్టుంగొరవిగంగి నేడు
పునఃప్రతిష్ఠ చేసెను. ధాతునామసంవత్సర మాఘబహుళ
౧౦ బుధవారము జలకుగంగిశెట్టి తమ తండ్రి లింగశెట్టి
తమ తండ్రి లింగయ్య పేర్లకు పుణ్యముగాను శ్రీనరేన్ద్ర
లింగమును పునఃప్రతిష్ఠచేసెను. జలదుకూనిశెట్టి కుమా
రుడు నరేన్ద్రలింగానికి దేవళం కట్టించి నిత్యనైవేద్యం
సాగించెను. తమ తల్లి నాగమ్మకున్ను తమ అప్ప
నాగమ్మకున్ను పుణ్యముగాను సమర్పించెను.

# పరిచయ వాక్యములు

కర్నలు మెకంజీ వ్రాయించి దాచిపెట్టిన కైఫీయత్తులలో ఇది యొకటి. ఇట్టి కైఫీయత్తులు ఇంచుమించు ఆంధ్రదేశములో ప్రసిద్ధిగన్న పెద్ద గ్రామము లన్నిటికి మెకంజీ వ్రాయించినాడు. ఈ కైఫీయత్తులు చరిత్రరచనకు మిక్కిలి ఉపయోగకరములు. చారిత్రకవిషయములు అనేకములు కాలగర్భమున పడి కానరాకుండ పోయినవి పోగా మిగిలియున్నవి ఇట్టి కైఫీయత్తులలో మనపూర్వులు తమకు జ్ఞాపకమున్నంతవరకు, కాలానుక్రమణిని అనుసరించలేక పోయినను, ఎట్లో వ్రాసి పెట్టగలిగిరి. ఈ కైఫీయత్తులలో నిరర్థకమైన విషయములతోపాటు మిక్కిలి ఉపయుక్తములును, అపూర్వములును అయిన విషయములు గూడ కానవచ్చుచుండును. అనేక శిలా, తామ్రశాసనములు—ఒకనాడుండినవి, సులభముగా కనబడుచుండినవి, నేడు మాయమైపోయినవి ఎన్నెన్నో కలవు వాటియొక్క ప్రతికలు కర్నల్ మెకంజీకొరకు సంపాదించిన కైఫీయత్తులలో వ్రాయబడియున్నవి. ఈ కైఫీయత్తులే లేకుండినచో నేడు మృగ్యములైయున్న ఆ శాసనముల ప్రతికలు చరిత్రకారునకు దుర్లభమైయుండెడివి.

భాషావిషయమునగూడ ఇవి ఎంతయు ఉపయోగకరములు. నూటయేభయి అరవైసంవత్సరముల నాటి వ్యావహారిక భాష ఈ కైఫీయత్తులందు ప్రత్యక్షముగా కానవచ్చుచున్నది.

ఆర్థిక, రాజ్యాంగ, నైతిక, సాంఘిక, మత విషయముల చరిత్రాంశము లనేకములు ఈ కైఫీయత్తులలో కానవచ్చుచుండును.

ఈ పులివర్రు కైఫీయత్తులో ఆ గ్రామ నిర్మాణ కాలము, దాని నామకరణ చరిత్రయు కొంతవరకు తెలియుచున్నవి. తెనుగుభాషలో 'వర్రు' వంటివి నామాంతపదములు ఎన్నెన్నో కలవు. నదులఒడ్డున, సెలయేళ్లదరిని, కొండలదగ్గర, సముద్రపు తీరమున, వట్టి బయలున గట్టబడిన గ్రామములకు వేర్వేరు నామాంతపదములు గానవచ్చుచున్నవి. అట్టివి దుర్రు, కుర్రు, పర్తి, కుర్తి, దుర్తి, అంకి, అంగి, ఆము, గడ్డ ఇత్యాదులు అనేకముగలవు. ఈ కైఫీయత్తును బట్టి పులివర్రు గ్రామము బౌద్ధయుగమునాడుకూడ - క్రీస్తుశకారంభమునకు పూర్వ శతాబ్దములందు వర్ధిల్లియున్నట్లు ద్యోతకమగును. ఈ గ్రామమున వెలసిన నరేంద్రస్వామి, శివాలయము నరేంద్రమృగరాజని బిరుదము ధరించిన రెండవ విజయాదిత్యుని కాలము (క్రీ. శ. ౮౦౦-౮౪౬) నాటిదని ఊహింపవచ్చును. ఆ రాజేంద్రుడు ద్వాదశవర్ష సంగ్రామము అతిఘోరముగ జరిపి, గుదకు విజయుడై, దేశశాంతికొరకు, ప్రజల ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధికొరకు నిర్మించిన నూటయెనిమిది శివాలయములలో ఇది యొకటిగావచ్చును. శివాలయములతోపాటు నూటయెనిమిది ఆరామ, అగ్రహార, తటాకాది ప్రతిష్ఠలు గూడ ఆరాజేంద్రుడు గావించెను. కాలానుక్రమముగ పులివర్రు గ్రామము ఎట్టిపాలనమును అనుభవించెనో, ఏయే రాజవంశములు ఏయే రీతిగ పరిపాలించిరో కూడ ఈ కైఫీయత్తువలన తెలియుచున్నది.

అన్నిటితోపాటు మిక్కిలి చిత్రమైన విషయము శకవర్షములు ౧౧౧౪-అనగా ౧౧౯౨ క్రీస్తుశక కాలమున (?) లిఖింపబడిన శిలాశాసనమునందు వెలనాటి రాజేంద్రచోడుడు (మొదటివాడు) ౫౦ లక్షల పరిమాణముగల ఆంధ్రదేశమును పరిపాలించెనని తెలుపబడియున్నది.

— ఈ శాసనప్రతిబింబమును-లభించినచో-పరిశీలింపవలసియున్నది.

ఇట్టి చరిత్రాంశము లనేకములు—విమర్శింపదగినవి— ఈ కైఫీయత్తునందు గలవు.

# కలగూరగంప

## అభిమానుల జాబులూ, బెర్నార్డ్‌షా చమత్కార జవాబులూ

అది అవ్యాజ అభిమానమనండి, లేక మరేమైనా అనండి, ఏమయితే నేమికాని తమజన్మలో ఎప్పుడో ఒకప్పుడు. ఏదో ఒక సందర్భంలో, ఏదో ఒక నెపంతో బెర్నార్డుషాకు జాబులువ్రాసి జవాబులు తెప్పించుకోవడమంటే ఐరిషుదేశస్థులకు అదొక వెర్రి మోజు. ఐరిషుదేశస్థులే అనేమిటి—ఇంకా చాలా మందికికూడా ఈవ్యామోహం లేకపోలేదు.

ఆయనకు ఇలాటి అభిమానులనుంచి నిత్యమూ వచ్చే ఉత్తరాలకు అంతుండదు. తెల్లవారిలేస్తే తపాలా బంట్రోతు తెచ్చిపడవేసే ఉత్తరాల్లో అధికభాగం ఈబాపతే.

అయితే, ఆ పెద్దమనిషికి విసుగేమైనా ఉంటుందా? ఊహూం. అన్నిటినీ సావధానంగా 'మ. రా. రా. శ్రీ' నుంచి 'ఇట్లు భవదీయుడు' వరకూ ఓపికగా సాంతం చదివితీరవలసిందే! అన్నిటికీ సమాధానాలిచ్చి తీరవలసిందే. "ఎంత అభిమానం లేకుంటే ఇలా పని కట్టుకొని ఉత్తరాలు వ్రాస్తారు! వీనికి తోచిన జవాబులు వ్రాయకుంటే బాగుంటుందా" అని ఆయన అభిప్రాయం.

కానయితే, ఆ అన్నింటికీ తాను స్వయంగా కూర్చొని జవాబులు వ్రాసేటందుకు ఆయనకు సాధ్యమయ్యేటట్టు తోచలేదు. తొంభయేండ్ల పండుముసలి కదా మరి! పోనీ, తనకు ఓపికలేకపోతే మానె, ఎవరినైనా కూర్చొబెట్టుకొని చెప్పి వ్రాయించరాదా అంటారేమో! అదిమాత్రం సాధ్యమా? వారుమాత్రం ఎన్నని వ్రాయగలరు? అందుకని ఆ చమత్కారి ఏమి చేశాడంటే—

డబ్లినులో ఒక ప్రైవేటు బ్యాంకరుకు పెద్ద ఖజాంజీగా తాను పనిచేసిన నాలుగేండ్లలోనూ తాను ఆకళించుకొన్న వర్తక సరళులను మనసులో పెట్టుకొని ఇటువంటి ఇటువంటి జాబులువస్తే ఇటువంటి ఇటువంటి సమాధానాలు వెంటవెంటనే పంపితే సరిపోతుందని, కొన్ని మామూలు జాబులకు మామూలు జవాబులు సిద్ధంచేసుకొని అచ్చుఫారాలుగా అచ్చొత్తించి పెట్టుకొన్నాడు.

(అసలు, స్వతహాగా, ఆయన సమాధానాలు ఎట్లా ఉంటాయనుకొంటారు? అడిగిన ప్రశ్నలకు సక్రమంగా, సూటిగా సమాధానాలిస్తాడా? లేదు. ప్రశ్నకు మారుప్రశ్న వేయడమో, సూటీపోటీ మాటలతో ఎదుటివారిని విభ్రాంతులను చేయడమో ఆయనకు మామూలు. సాధారణంగా ఆయన జవాబులన్నీ పెడసరపు జవాబులుగానే ఉంటాయి. అది ఆయన లోక వినోదం. ఈ విషయంలో షా బలే చమత్కార శక్తి లేండి.)

ఇది ఈ నాడు ఆయనలో కొత్తగా పుట్టుకొని వచ్చిన బుద్ధిగాదు. పాతిక ముప్పయి యేండ్లనుంచి వస్తూవున్న ప్రాచీనాచారమే.

ఇటువంటి సిద్ధసమాధానపత్రావళిలో మొట్ట మొదటిది ౧౯౧౪ నాట వెలిసింది. '౧౯౧౪-౧౫ నాటి యుద్ధాన్ని గురించిన సామాన్యవివేచన' అనే పేర తాను బహుఘాటుగా వ్రాసిన ఒక రచనకు ప్రజలిచ్చిన ప్రోత్సాహానికి కృతజ్ఞత తెలుపుకోవడానికై అది పుట్టింది.

ఆయన ఈ సిద్ధసమాధానాలన్నీ సాధారణంగా కార్డులరూపంలోనే ఉంటున్నాయి. కవర్లందుకు, అనవసరదండుగ అనుకున్నాడో ఏమో మరి!

# ప్రపంచ విఖ్యాత రచయిత జార్జి బెర్నార్డుషా



[మొన్న జూలై 26-వ తేదీనాడు ఈయన 90-వ జన్మదినోత్సవం జరిగింది.

వయసులో వార్ధక్యం వచ్చినా ప్రజ్ఞావిభవంలోనూ, సాహిత్య వ్యాసంగాల్లోనూ ఆ వార్ధక్య లక్షణాలేవీ ఈయనలో గోచరించడం లేదు. తత్త్వాస్వాద విషయంలో ఈయనది 'నీ, నా' అనే విచక్షణ లేని నిష్పక్షపాతమైన విశాలహృదయం. ఈ మేధావిని ఈ జన్మదినోత్సవ సందర్భంలో 'శతం జీవ శరదోవర్ధమానః' అని ఆశీర్వదిస్తున్నాము.]

ఎప్పుడో రాబోయే ఏవో జాబులకు జవాబులుగా ఆయన ఇలా ముందుగానే సిద్ధంగా అమర్చి పెట్టుకొన్న పత్రములలో కొన్నింటిని ఇక్కడ ఉల్లేఖిస్తున్నాము. వీటినిబట్టి ఆయన చమత్కారప్రజ్ఞాప్రాభవాలెట్టివో చదువరులే ఊహించుకోవచ్చు.

తొలినాటివాటిలో ఒకటి ఇట్లున్నది. ఆకార్డు మీద, తనకు, పోస్టుమాస్టర్ జనరల్ బలవంతంగా రుద్దిపెట్టిన తంతి అడ్రసు 'సోషలిస్టు, లండన్' అనేది ఉన్నది. ఆకార్డు వ్యాసాలకోసం లేఖలు వ్రాసే పత్రికాసంపాదకుల నుద్దేశించింది.

"ప్రస్తుతం ఏనాటి ప్రత్యేకసారస్వతప్రమేయాన్ని పెట్టుకోవడానికిగాని తనకు వీలుపడదని తెలుపుటకు బెర్నార్డుషా చాలా చింతిస్తున్నాడు. ఇప్పుడు చేతిలో ఉన్నపనే మరి కొన్నిమాసాలవరకూ ఆయనకాలం మింగివేస్తుంది."

"మీతో సంభాషణాభాగ్యం ఇప్పించవలసిం" దని పత్రికావిలేఖరులు పెట్టుకొనే దరఖాస్తులకు సమాధానంగా ఈజవాబు ఆయన సిద్ధంచేసి పెట్టుకొన్నాడు:

"తనకు తానే ఒక పత్రికారచనోపజీవిననీ, కాబట్టి, సహజంగా, ప్రజలతో పత్రికలమూలంగా ప్రత్యక్ష సంబంధాన్ని పెట్టుకోవడానికి తానే అభిలషిస్తాననీ తనను చూడవచ్చి, తనతో మాట్లాడి ఆసంభాషణలను పత్రికల కెక్కించడానికి వచ్చే విలేఖరులకు బెర్నార్డుషా విధిలేక జ్ఞాపకం చేయవలసివస్తున్నది. కాని, సమయం అనుకూలించినప్పుడు వ్రాతప్రశ్నలకు మట్టుకు కొన్నింటికి జవాబు లివ్వడానికి మాత్రం ఆయన కాక్షేపముండదు. అయితే, ఆ అడిగేప్రశ్నలు మట్టసంగా, చమత్కారంగా ఉండాలి. ఇరవై, లేక అంతకన్నా తక్కువ మాటలలో జవాబివ్వగూడినవిగా ఉండాలి. కావలసినవారు చుట్టపుచూపుగా వచ్చి తనను చూచి పోవడానికి ఆయనకేమీ అభ్యంతరం లేదు. కాని, ఆసందర్భంలో తనతోటి జరిగిన సంభాషణ పత్రికల కెక్కించరాదనే కఠినషరతుతోనే సుమా!"

పండ్రెండేండ్లపాటు బహిరంగసభల్లో ఆయన చేసిన ప్రసంగాల అనుభవం షాను గ్రేటుబ్రిటనులో కెల్లా గొప్ప ప్రజాహితవక్తగా చేసిపెట్టింది. ఆయన ఉపన్యాసాలను ఆరోజుల్లో పత్రికలు సరిగ్గా ప్రకటించకపోతేనేంగాక. ఆయన ౭౦-వ జన్మదినోత్సవంనాడు, ఆయన ప్రసంగం ఏదైనాసరే, ప్రచురింపరాదని ప్రభుత్వం వారు సాధికారంగా చేసిన నిషేధపుటుత్తరువులే చాలు ఆయనంటే ప్రభుత్వానికి ఎంత గడగడ అయిందీ రూపించడానికి.

సభల్లో అధ్యక్షపీఠం అధిష్ఠింపరమ్మనీ, ఉపన్యాసాలివ్వ వేంచేయవలసిందనీ అడిగేవారికై ఆయన తయారుచేసిపెట్టిన జవాబిది:

"షా ఉపన్యాసోపజీవి ఏనాటికీ కాడు. బహిరంగవేదికలమీద—ఏవో కొన్ని ప్రత్యేకసందర్భాలకు—ముఖ్యంగా రాజకీయతరహావాటికి తప్ప ఇతర ప్రమేయాలకు ఆయన ససేమిరా ప్రసంగాలుచేయ తలపెట్టుకోలేదు. కాబట్టి తాము పిలవడానికై వ్రాసిపెట్టుకొన్న ఉపన్యాసకుల పట్టీనుండి తన పేరు కొట్టివేయవలసిందిగా షా ఆయా సంఘకార్యదర్శులను సాంజలిగా కోరుతున్నాడు. ఆయన వస్తుప్రదర్శనలకుగాని, సంతలూసంజాములకుగాని ప్రారంభోత్సవాలు జరపరు. సంతర్పణసమారాధనలలో ఉపచారవాక్యాలాడరు. సంఘాలకూ, సంస్థలకూ ఉపాధ్యక్షుడుగానో, పోషకుడుగానో తన పేరివ్వడు. ఆస్పత్రులకనీ, అలాటి తదితరసత్కార్యాలనీ డబ్బుకోసం విజ్ఞప్తులు ప్రకటించడు. కాబట్టి ఇటువంటివాటికై తనను అర్థించవచ్చేవారు తన నిరాకరణకు తనను మన్నించవలసిందిగా ఆయన కోరుతున్నాడు."

అంతకంటే నిర్మొగమాటమైన ఈ జవాబు చూడండి:

"డబ్బుకోసమని, దయచేసి, షాను అడగవద్దండి. దానితో అవసరమున్న వేలాది తన పాఠకులకు ఇచ్చేటంతపాటి డబ్బు ఆయనవద్ద లేదు. కావలిస్తే, మీకేదైనా వ్రాసిపెట్టమంటే వ్రాసిపెడతాడుగాని మీకు ఆర్థికంగా మాత్రం ఆయన తోడ్పడలేడు."

ఇలాంటివే ఇంకా ఎన్నో తరహాల సమాధానాలు ఆయన అచ్చువేసి పెట్టుకొన్నాడు. సమయ సందర్భాలు చూచుకొని ఎటువంటి జాబులకు ఎటువంటి సమాధానాలు పంపవలెనో, వాటిని వెంటవెంటనే పంపించివేస్తూ వుంటాడు ఆయన తనవారిచేత,

ఇటువంటి చమత్కారాలు ఆయనలో అనేకం.

---

# స్త్రీ

అనంగనంగా — పూర్వకాలంలో — మన ముత్తాతల ముది అవ్వల కాలమందు మొగవాడు అహంభావంతోను, తెలివిహీనతతోను ప్రవర్తించేవాడు. స్త్రీని తన బానిసగా భావించేవాడు. సుకుమారమైన ఆమె కాళ్లకు ఇనుపసంకెళ్లు తగిలించాడు. అరవచాకిరీ చెయ్యడానికి అడ్డులేకుండునట్లు, పరుగెత్తిపోవటానికి వీలులేకుండా చేశాడు. బోనులోని జంతువునుగా చేసివేశాడు.

అబల-అదేం చేస్తుంది? బానిసత్వానికి ఒప్పుకొని లొంగివుండింది. మొగవాని మనస్సు నొక్కనీక మెలగుతూ వుండింది. మనస్సులోని అసంతృప్తిజ్వాలల తీక్ష్ణను బయటికి తెలియనీకుండా నడచుకొంటూ వుండింది. అన్నిబాధలనూ ఓర్చి, సహించి, మొగవాని సౌఖ్యము, వాని సంతోషమే తన పరమవిధిగా ఎంచి, అతని యిల్లు చక్కబెట్టి, దాని అందమునకు మెరుగిచ్చి ప్రకాశింపజేసింది. ఇలవేల్పులకు పూజాపునస్కారాలు, మొగవానికి ఆహారవసతులు ఏకొదవా లేకుండ జరుపుకొంటూవుండింది. మొగవాడు వేటకెళ్లి ఎలాంటి అపాయానికీ పాలుగాకుండా తిరిగిరావలెనని దైవాన్ని ప్రార్థిస్తూవుండింది.

కాని, ఇదంతా గమనిస్తూకూడ ఆ మొగపురుషు ఇలా అనుకొనేవాడు: "ఎవరికోసం చేస్తుందిరా ఇదంతాను? నేను దాన్ని కాపాడవలెనే! నేనుగనక రక్షించకపోతే దాన్ని ఏ నక్కో ఎత్తుకొని పారేస్తుంది. నేను చేసేదంతా దాని మేలుకొరకే. నేనే దాని పాలిటి రక్షకుడను."అని రొమ్ము విరుచుకొని తిరుగుతూ తన్ను తానే స్తుతించుకొనేవాడు.

దేవు డిదంతా గమనించాడు. మనిషిని తమాషా పట్టిద్దామనుకొన్నాడు.

మొగవాడు ఒకరోజు మామూలుగా వేటకెళ్లాడు. ఆ సమయం చూచుకొని దేవుడు అతని ఇంట్లో ప్రవేశించి, స్త్రీని తనవెంటబెట్టుకొని మాయమైపోయినాడు.

ఎప్పటిమాదిరిగానే మొగవాడు ఇంటికి వచ్చాడు సందెవేళ. కాళ్లకు నీళ్లూ, స్నానానికి ఏర్పాట్లూ, కడుపు దాహానికి తీర్థమూ సిద్ధంగా లేకపోవడం చూచాడు. ధుమధుమలాడాడు. "ఓయ్, ఒసే, ఏమేవ్, నిన్నే"అంటూ రకరకాలుగా కేకలు వేశాడు. కాని, ఆ బానిస అగపడితేనా? కంటికి కానరాదు; బదులుపలుకూ లేదు. దాంతో మొగవాడు ఉగ్రమూర్తి అయిపోయినాడు. పళ్లు పటపట కొరికినాడు. ఆవేశంతో ఇల్లంతా కలయదిరిగి వెతికాడు. దైతక్కలు తొక్కాడు. కాని, కాని, బానిస ఎక్కడా కనబళ్లేదు. శతసహస్రాలుగా తిట్టాడు. తలవెంట్రుకలు పీక్కున్నాడు. 'దేవుడా'అని నెత్తి బాదుకొన్నాడు.

దేవుడు ప్రత్యక్షమయ్యాడు. "ఏమిటి నీ విచార"మన్నాడు.

"విచారమూ, గిచారమూను! నాబానిస మాయమైంది. నాకు త్రాగ నీళ్లు లేవు; తిన అన్నం లేదు. నావసతులు ఎవ్వరుమాస్తా రింక"అని నిష్ఠూరాలాడాడు.

"భలేవాడివేనే! ఈమాత్రం ప్రమాదానికేనా ఇన్ని ఆర్భాటాలు చేస్తివి! ఏం భయపడకు. రేపటి మంచి నీకు అన్నానికీ, నీళ్లకూ ఇబ్బంది ఉండదులే. పో. ఎప్పుడు కావలిస్తే అప్పుడు అవి నీకు సిద్ధమవుతూ వుంటాయి."అని దేవు డూరడించాడు.

అదేప్రకారంగానే, ఆ మరుసటిరోజు మొదలుకొని, మొగవాడు సాయంత్రం ఇంటికివచ్చేవేళకల్లా —ఏ మాయమంత్రాలవల్ల నయితేనేంగాని—ఆహారవసతులూ, స్నానసన్నాహాలూ అన్నీ కొరతలేకుండా జరుగుతూవచ్చేయి. కాని, బానిసమాత్రం ఎక్కడా కంటబడదు.

దినాలు గడిచాయి. నీటికీ, కూటికీ కొరత లేకుండా జరిగిపోతూవుంది. కాని—మనిషికి విసుగెత్తిపోయింది. అన్నంనీళ్లు రుచించడం లేదు., ఏదో యంత్రానికి బొగ్గూ, నీళ్లూ నింపినట్లుగా ఉండింది. ఏదో చెప్పరాని కొరత! మానవసహృదయం, మానవత్వం లేదనిపించింది. ఎంతకాల మీ నీరసజీవితమని అంతులేని విసుగూ, నిస్పృహా జనింపనారంభించాయి. తనకు జీవితమే శూన్యమనిపించింది. బ్రతుకు భారంగా తోచింది.

ఒకరోజు చాలా అలసిపోయి ఇల్లు చేరుకొన్నాడు. మామూలుధోరణిలో 'ఒసేయ్' అని కేక వేశాడు. ఆ పిచ్చికేక 'ఒసేయ్' అని ప్రతిధ్వనించింది. అన్నమూ, నీరూ యథాప్రకారంగా సిద్ధమైనాయి. కాని, దాసిచిరునవ్వులమోమూ, ఆమెసోయగమూ, తేనెలొలుకు ఆమెముచ్చటమాటలూ తలపునకు వచ్చి, భరింపలేని వేదనతో, ఆవేశం పట్టలేకపోయినాడు. తిరిగి 'దేవుడా' అని మొరపెట్టాడు.

దేవుడు ప్రత్యక్షమై "ఏమిటోయ్ నీ కిప్పుడు వచ్చిన లోటు! సకాలానికి తిండి అందడం లేదా, శుద్ధముండడం లేదా?" అని అడిగాడు.

మొంగవాడు ముఖం వేలవేశాడు. "ఏమిటి కీ వెక్కిరింతలు స్వామీ! ఈ అగ్నిపరీక్ష లెందుకు తండ్రీ! నీకు పుణ్యముంటుందికాని నా దాసిని నా కిచ్చేయి. దాని విలువ ఇప్పటికి గ్రహించాను. బుద్ధి వచ్చింది." అని దీనాతిదీనంగా వేడుకొన్నాడు.

దేవుడు వాని అవస్థ చూచాడు. వాడు దారికి వచ్చినందుకు సంతోషించాడు. అతన్ని కనికరించి, స్త్రీని మరల తెచ్చి దిగవిడిచాడు.

మొంగవాడు చప్పున లేచి, ఆమెను ఎదుర్కొని ఆమె కాలిసంకెలలను తుంచి పారవేశాడు. ఆమెను నానాభరణాలంకృతురాలిని చేశాడు. దగ్గర చేరదీసి, నిర్మలహృదయంతో, నిష్కల్మషంగా "నీ వికమీదట నా దాసివు కావు. నా దేవివి. నా జీవనజ్యోతివి. నీవులేని నాయిల్లు గుల్ల. నీవులేని నాజీవనం నిస్సారం." అని పశ్చాత్తాప హృదయంతో చెప్పుకొన్నాడు. స్త్రీ విలువను గ్రహించాడు.

(సర్ సురేశచంద్ర చక్రవర్తిగారి వంగభాషలోని కథ ననుసరించి)

పద్మావతి శ్రీరాం

---



బిడ్డ ఆరోగ్యం తల్లి ఆరోగ్యంపైన ఆధారపడివుంటుంది..

లేత బిడ్డను పోషించి పెంచవలసినది, బిడ్డకు బలము, చైతన్యము కలిగించవలసినది తల్లి గనుక, బిడ్డ ఆరోగ్యం తల్లి ఆరోగ్యంపైన ఆధారపడివుంటుంది. శాంతి అశోకను ఇచ్చి తల్లి ఆరోగ్యాన్ని కాపాడండి. శాంతి అశోక ఆరోగ్య పోషక వస్తువులు గల ఉత్తమ రసాయనం. ఇందుకుతోడు, దీని స్త్రీల ఆరోగ్యాన్ని సమూలంగా నాశనంచేసే స్త్రీ వ్యాధులకు ఉత్తమ ఔషధమని పూర్వంను చి ప్రసిద్ధి కెక్కిన ఓషధి 'అశోక' చేరివున్నది.

శాంతి అశోక

ఉత్తమ గర్భాశయ రోగనివారిణి

శాంతి కుటీరం
తణుకు—పశ్చిమ గోదావరిజిల్లా.
సోల్ ఏజంట్లు:-శ్రీ కృష్ణా జనరల్ స్టోర్సు, తణుకు.



# విమర్శనము



## శ్రీమహర్షి జీవితకథామృతము

ద్వితీయ భాగము. గ్రంథకర్త: శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారు, బి.ఏ., రామారావుపేట, కాకినాడ. వెల ౨ రూ.

ఇందు నారద, పరాశర, భరద్వాజ, భృగు, మార్కండేయ, యాజ్ఞవల్క్య, వసిష్ఠ, విశ్వామిత్ర, వ్యాస, శ్రీశుకుల చరిత్రములు గలవు.

తపశ్శక్తి సంపన్నులగు ప్రాచీనమహర్షుల జీవితములలోఁ బ్రవేశించి వారి జీవితాదర్శములను బలుమారు స్మరించి తరించుట మన కర్తవ్యము, శ్రేయోదాయకమును. అవి యూహాతీతములు. తపస్విజనుల అరణ్యజీవితములు, ఏకాంతవాసములు, ప్రకృతిసహవాసములు మున్నగునవి స్మరణమాత్రములై హృదయవీథిలోఁ జొరఁబాఱినప్పుడు క్షణమైనఁ దన్మయత్వము నందని భారతీయుఁడు లేఁడనుట సత్యమునకు సన్నిహితము. మన మహర్షులు సౌందర్యోపాసకులు, ఆనందమయులు. జీవితసర్వస్వము—తపశ్చరణలో రహస్య మెఱిఁగి—భగవదారాధనకు సమర్పించిన ధన్యమూర్తులు. తపోనియతిచే సాధింపరాని కార్యము లేదని సృష్టిని దఱిచితఱిచి తద్రహస్యములను సంపూర్ణముగా స్వానుభవమునకుఁ దెచ్చుకొన్న పరిణతప్రతిభాసమన్వితులు.

విరాగమున రాగము, విషమున నమృతము చూఱలాడిన యీ జటధారుల సమగ్రజీవితములు ప్రాచీనసంస్కృతిపురాణేతిహాసములలో దాఁగి సామాన్యజిజ్ఞాసువులకు దవీయసము లైనవి. ఈ లోపము గుర్తెఱిఁగి ఆయా మునిచంద్రుల జీవితముల ననేకగ్రంథములనుండి సేకరించి ఈ 'శ్రీమహర్షి జీవితకథామృతము'ను శ్రీ వేంకటేశ్వర్లుగారు రచించిరి.

ఇందలి కథాశైలి పురాతన సాంప్రదాయముల ననుసరించుచు సరళముగా, సహృదయ రంజకముగాఁ బ్రవహించినది. కథాకథనములోఁ దృప్తిచెందక శ్రీ వేంకటేశ్వర్లుగా మహర్షుల యాదర్శములు, బోధనములు, వారి నిత్యజీవిత విధానములను అపూర్వ[illegible]ముగఁ దెలిపియున్నారు. ఇట్టి కృతులు వైదిక[illegible]ము సమగ్రముగా వర్ణించు భావిగ్రంథకర్తలకుఁ బునాదులు.

ఏకపత్నీవ్రతములో, బ్రహ్మచర్యదీక్షలో, తపోనియతిలో మన మహర్షులకుఁ గల శక్తిసామర్థ్యములు ఊహాతీతములు. మన ప్రాచీనమహర్షులు మనకంటె మహోన్నతులను విషయము విస్మరింపఁదగనిది. నారదవసిష్ఠాదుల జీవితము లందులకు సాక్ష్యములు. త్రిమూర్తులఁ బరీక్షించిన భృగుమహర్షి, బ్రహ్మర్షిత్వ మందిన విశ్వామిత్రమహర్షి, జగదాధారులైన మార్కండేయ శ్రీశుక మహర్షులు, త్రిలోకత్రికాల పూజ్యులగు వ్యాసాదులు మున్నగు మహామహుల పవిత్ర చరిత్రముల నిట్లు సర్వజన సుబోధకముగా రచించిన శ్రీ వేంకటేశ్వర్లుగారు ప్రశంసాపాత్రులు. వేదయుగ సౌరభము శ్రీ వేంకటేశ్వర హృదయమున నిండార వ్యాపించినది.

ఆదర్శమే ప్రధానాంగముగాఁ గలవి వేంకటేశ్వర్లుగారి రచనలు. ఈ గుణమే వారి ప్రతిరచనలోఁ బ్రస్ఫుటముగా గోచరించుచుండును. ఇతర గుణము లానుషంగికములు. ఈ సుగుణ ముత్తరోత్తరాభివృద్ధి నందునని నావిశ్వాసము. "పరిణామ రమణీయాః" అను కాళిదాసునమృతసూక్తి వీరి రచనలపట్ల వర్తించినది. ప్రతియాంధ్రుఁడు చదువవలసిన సద్గ్రంథ మిది!

బెల్లూరి శ్రీనివాసమూర్తి.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.